"యశస్వీ"

# ...స్కృత దత్త చిత్ర చన్ద్రిక

ఆఖ్యాత - వ్యాఖ్యాత

సూరపనేని వేణుగోపాలరావు

...త్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ, T.C.P.T., M.A., P.O.L.,

రిటైర్డ్ - సంస్కృతాంధ్రాధ్యాపకులు

అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ.



...రణ: సూరపనేని వేణుగోపాలరావు

"యశస్వి"

# "చ్యుత దత్త చిత్ర చన్ద్రిక"

# (Cyuta Datta Citra Candrika)

(సంస్కృతాంధ్రాంగ్ల హిన్ద్యాది భాషా తులనాత్మక చిత్రాలఙ్కారప్రక్రియ)

(పరిశోధన గ్రంథము)

మాన్యశ్రీ

[illegible]

శ్రీ అక్కిరాజు రమాకాన్త రావు గారికి సగౌరవముగ సమర్పితము

[illegible]

31-8-96.


ఆఖ్యాత, వ్యాఖ్యాత :

"సాహిత్యరత్న" సూరపనేని వేణుగోపాలరావు

సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ, T C P T, M A, P O.L,

రిటైర్డ్-సంస్కృతాంధ్రాధ్యాపకులు,

అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ-521301



ప్రచురణ :

"ఆనన్దవర్ధన" ప్రచురణలు

40 – 9/10 - 12

మునిసిపల్ కాలనీ, వెంకటేశ్వరపురం - P. O.

విజయవాడ - 520 010.

వెల : రు. 75-00

"ఆనన్దవర్ధన" తృతీయ ప్రచురణ, 1995

తులనాత్మక పరిశోధన గ్రంథము :

"చ్యుత దత్త చిత్ర చన్ద్రిక"

(Cyuta Datta Citra Candrika)

ఆఖ్యాత, వ్యాఖ్యాత : "యశస్వి"

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు 1995





వెల : రు. 75-00



ప్రతులకు : 46674

శ్రీమతి సూరపనేని కాన్తారత్నము,

ఆనన్దవర్ధన ప్రచురణలు 40-/10-12,

మునిసిపల్ కాలనీ వెంకటేశ్వరపురం - P. O.

విజయవాడ-520010.

ముద్రణ :

వంశీకృష్ణా ప్రింటర్స్,

విజయవాడ-2.

# మున్నుడి

## గ్రంథ రచనా సముద్దేశ నివేదనము

సాహిత్యమొక పయోనిధియే కాదు. అదొక మహా రత్నాకరం. దిగితేకాని, లోతుతెలియదు ఒడ్డు నుండి, ఓపికగా, రాళ్ళు విసిరితే, ఏమి తెలుస్తుంది? సాహసించి, లోతుకు వెళ్ళితేగాని, రత్నాన్వేషణ ఫలించదు. అట్లే, సాహిత్య పాథోనిధి మంథనోత్థమైన కావ్యామృతం కోసం, మహామహులు, క్రాంత(తి)దర్శులు, నగు కవి పండితులెందరో, ఎన్నో నూతన సంప్రదాయాలను, ప్రక్రియలను ప్రకల్పించి, ఎంతగా, ఖండన మండనలను చేసుకొన్నా, కడకు, ఆ సాహిత్య ప్రక్రియలన్నీ, "అనర్ధ పర్యవసాయురే' అను పరమార్థాన్ని, అందరు, ఏకగ్రీవంగా అంగీకరించిన వారే "భావపక్ష'న్ని, భవ్యంగా భావించిన వారుకూడ. 'కళాపక్ష'న్ని కాదనక, కమనీయంగానే కరుణించి, మన్నించినారు.

వ్యంగ్యం యొక్క-'1. ప్రాధాన్య, 2. అప్రాధాన్య, 3. అస్పష్టత్వా'లనుబట్టి, కావ్యం 'త్రివిధం'కాగా, అస్ఫుట వ్యంగ్యమై, అధమ కావ్యంగా చిత్రింపబడిన, ఆ చిత్రకావ్యం, మరల, 'శబ్ద, అర్థ, ఉభయ-చిత్రంగా' త్రివిధమైనది. ఇట్లు, మూడవ తరగతికి చేరిన 'చిత్ర కావ్యం' అనగానే, అవరమనీ, అధమమనీ, అపహాస్యం చేసినవారు, చేసేవారు కూడా లేకపోలేదు. రస పరి పంథి అంటూనే, ధ్వన్యాచార్యుడగు ఆనన్దవర్ధనుడు, శబ్దాలంకార భూయిష్ఠమగు 'దేవీ శతకం' వ్రాయగా, కర్ణపూరకవి 'చైతన్యామృతం'లో ఎన్నో శబ్ద చిత్రాలంకారాలను, ఇలాగే ఇతరులు కూడా చిత్రించారు. విశ్వనాథుడు 'ప్రహేళిక' అలంకారం కాదంటూనే, "చ్యుత దత్తాక్షరాదికము'ను కూడ విశదీకరించినాడు ..........ఇట్లు, ధ్వనినికషోపలంతో కావ్యోత్కర్షను కాంక్షిస్తే, వాల్మీకి, వ్యాస, కాళిదాసాది మహాకవుల గ్రంథాలుకూడ, కేవల వ్యంగ్య ప్రధాన-ఉత్తమ గ్రంథాలనిగాని, నిర్దుష్టాలనిగాని, నిర్ధారణ చేయలేము. అక్కడక్కడ, శబ్ద చిత్రాలు కొల్లలుగానున్నను, సామూహిక-వ్యంగ్య వైభవంతో అవి ఉత్తమ గ్రంథాలుగా చెల్లుబాటవుతున్నాయి. పునర్ముద్రణకు నోచుకొనక, గ్రంథాలయగ్రస్తాలై, దుమ్ముదులిపి, దృష్టిసారించే దూరదర్శనులకు, పరమానందాన్ని కల్గించినా, ప్రజాస్వామ్య పరిధిలో పామరులను సతతము హితం చేయుట వలన, అవి సర్వజన రంజకాలు కూడకాలేవు. నేడు, భౌతిక విజ్ఞానం, భగ్గుమని,

తవ్యం, కావ్యంకూడ కావడం, వకోదికికూడ పద్యం తయారుకావడం తో సాహిత్య, సౌహిత్యముల విలువ సంక్షిప్తమైపోయింది.

అసలు, 'చిత్రకావ్యం' అనగానే, చదివేవారికేగాక, వినేవారికికూడ, ఆశ్చర్యానంద వినోదాలను కల్గిస్తుంది. భాష సులభంగా ఉండవలసిందే. కాని, ఒకప్పుడు, దానిని దొంకతిరుగుడు కల్పనలతో, శిరోవేష్టన ప్రాణాయామం చేయించి. నవనవోన్మేషం చేస్తేగాని, రామణీయకం రంజిల్లదు. అదే అలంకారానికి అమ్మ, ఆత్మ. ఏ చిత్రం లేకుండా, స్వభావో క్తితో, తేటతెల్లంగా చెబితే, అది 'వార్త' కావచ్చుగాని, 'కవిత్వం' కాదు. వస్తుతః, వక్రోక్తి చమత్కారంలేని కావ్యమే కన్పడదని, దాని కోసం కవులంతా కంకణం కట్టుకోవాలని, "సైషా సర్వత్ర వక్రోక్తిః...." శ్లోకం ద్వారా, భామహుడు భాషించాడు ప్రతి ప్రసిద్ధ భాషలోనూ, అలంకారభూష్య కావ్యమందూ ఉండదుగాక ఉండదు. చివరికి, నిత్య వ్యవహారంలో, పామరుడుకూడ, తనకు తెలియకుండానే, ఇది రంభ, అది మనిషికాదు, రక్కసి, వాడు గాడద, నీకు నీవే తగుదువు, పిండారబోసినట్లున్న వెన్నెల.... ..."ఇత్యాదిగా, అలంకృత భాషను వాడటం, సర్వసామాన్య స్వభావమైపోయింది. దీన్ని, వానికెవరైనా నేర్పితే వచ్చిందా? లేదు....'అదోషౌ సగుణౌ 'సాలంకారౌ" శబ్దార్థౌ కావ్యమ్" (దోషాలు లేని, గుణాలున్న, అలంకార సహిత శబ్దార్థాలే కావ్యము) అనేది కావ్యసామాన్య లక్షణమైపోయింది.

ఇక, దీన్ని కూడ ముఖ్యంగా గమనించాలి. మమ్మటాద్యాలంకారిక శిరోమణులు 'చిత్రకావ్యా'న్ని గూర్చే చరించారుగాని, చిత్రాలంకారాలపై దృష్టిని సారింపలేదు. ఒకవో, చిత్రకావ్యం సులభావగాహ్యంగా ఉన్నా, చిత్రాలంకారపు భేదాలు కొరకరాని కొయ్యలవలె, అర్థంకాక, దురవగాహ్యాలై కూడ ఉండవచ్చు. దానికోసం పాండిత్యం ప్రదర్శింపవలసివస్తుంది. కనుక, పాఠకులు కూడ, నవలలు, కథలవలె, వీనిని ఒక్కసారిగాకాక, క్రమంగా, ప్రతిదినము, మోతాదు ననుసరించి, 'రసాయన'మను ఆయుర్వేదౌషధమునువలె, కొద్ది కొద్దిగా, సేవిస్తేనే, చిత్రాలంకార రహస్యం చిక్కగా తెలిసి, మానసికారోగ్యం మానితమౌతుంది.

వాస్తవాన్ని వక్కాణించాలంటే, 'రసం-ధ్వని' వ్యంజనావాదుల పైత్యకధన మేమీకాదు.... 'య దవ్యంగ్య మపి చారు తచ్చిత్రమ్" (వ్యంగ్యహీన చిత్రకావ్యం కూడ గ్రాహ్యమే) అని, ఆ చిత్రాన్ని, రసనిష్పత్తికి మాధ్యమంగా మన్నించిన, అప్పయ్య దీక్షితుని అభిప్రాయం కూడ ఆదరింపదగినదే అవుతుంది చిత్ర సృష్టితో

అలంకారాలు సాధనాలేకాని, సాధ్యాలుకావు' అని దీక్షితాభిప్రాయం. మొత్తంమీద, 'అభ్యాసార్థులకు చిత్ర వ్యవహారం, ప్రాప్తపరిణతులకు ధ్వనివైభవం' అని సరి పెట్టుకోవడం సమంజసంగా ఉంటుంది. అయితే, నేటి, సామాజిక స్పృహా సంరంభంలో, నవలలు, కథలు, మినీకవితలు .... మొ. వానిలోను, దిన, వార, మాసాది పత్రికల్లోను, ఏ ప్రకటనలను ఏ కడను చూచినా, చిత్ర, విచిత్ర పదాడంబర పటాటోపం, పరిపరివిధాల, ప్రభుత నెరపటంతో, శబ్ద చిత్ర కావ్యాలంకారాల పైపుకే, కాలం మొగ్గుచున్నట్లు కన్పడుతుంది

పూర్వులగు, భామహ, దండి, రుద్రటాదులు, ఈ చిత్రాలంకారాలనుగూర్చి, మొదటకొంత ప్రస్తావించగా, తర్వాత భోజరాజాదులు, 'స్వర, స్థాన, వర్ణ, గతి, ప్రహేలిక, చ్యుత-దత్త, గూఢ, ప్రశ్నోత్తర, సమస్యా, భాషాసమక,అ కారబన్ధా" ది చిత్ర భేదాలతో, మరికొంత వివరించారు. 'ధర్మదాససూరి' 'విదగ్ధముఖ మణ్డన' గ్రంథావిష్కరణానంతరమే 'చిత్రాలంకార— విశిష్టతలు విశిష్టంగా, పరివరి విధాల ప్రవిభక్తాలై ప్రకటితాలైనట్లు కన్పడుతుంది.

వేదో పనిష చ్ఛాస్త్ర పురాణాదుల కాలంలో బీజరూపంగా నుండి, అనూచానంగా, అనుస్యూతంగా ఆగమించిన, ఈ చిత్ర కావ్యాలంకార పరంపర, ఇట్లు, దశాధిక భేదాలతో, దర్పంతో పరిఢవిల్లుతూ వస్తూనే ఉంది మధ్య కాలిక రాజ సభాపండిత గోష్ఠులలో, చమత్కారచారు చిత్రాలంకారచర్చలు జరిగినట్లు, 'బాణ-కాదంబరి' మొ. నవి సాక్ష్యమిస్తున్నాయి. రసవత్-ధ్వని కావ్య పారగ్రహీతలగు సహృదయులకు, ఈ చిత్రాలంకారాలు సద్యః స్ఫూర్తిని, హృదయ స్పందనముగాని కల్గింపవనుటకూడ కాదనరాని సత్యం.

అయితే, సభామధ్యంలో, క్రీడాగోష్ఠి వినోదాదులలో, శబ్ద, శ్లేషశిల్పాదులతో చమత్కారం చిందించి, పరవ్యామోహనం కల్గిస్తాయనటంలో అనుమానంలేదు. ఆనాటిక్రీడా గోష్ఠుల్లో పాల్గొనని కవిపండితులు కళంకితులు కాగా, వారికావ్యాలు 'కావ్యాభాస' లయ్యేదివట! ఎంత శబ్దశాస్త్రవిష్ణాతులై, ఎన్ని నిఘంటువులను కంఠస్థం చేసినా, చిత్రక్రీడా గోష్ఠివినోదాలలో పాల్గొని, పరవాఙ్ముద్రణం చేయించాలను కొన్నవారును అల్పాక్షరాలకు, వైచిత్ర్య భంగిభణితులతో, చమత్కృత-అనల్పార్థాలను కల్పించి, చవులూరింపదలంచినవారును, ధిషణా కషణంచేయు, ఈదారు చిత్ర నిషేవణం, చక్కగా, చిక్కగా, చేసియే, ప్రాపగిరాంధురుధరులయ్యేవారట!

అంతేకాక, ఆయాభాషాసారస్వతాలలో, అంతగా ప్రజ్ఞగాని, ప్రాభవంగాని

లేని పామరులుకూడ, ఆయా క్రీడా గోష్ఠులకు పాల్గొని, విని, చదివి, ఆ చిత్రకవిత్వ ధ్వని వ్యంజనల స్ఫూర్తితో, మెదడుకు మేతనందుకొని, విశ్లేషించి, విశేషవైశారద్యం ప్రదర్శించేవారంటే, ఆనాటి గోష్ఠుల ప్రభావం అట్టిది. "వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ...." (రఘు. 1-1) శ్లోకంలో, ఈ శబ్దార్థాల అవినాభావ ధర్మమునే పార్వతీ పరమేశ్వర సంబద్ధంగా ప్రస్తుతించినారు మహాకవి కాళిదాసు. ఆ 'శబ్దజ్యోతి' అనుగ్రహంతోనే, పరస్పర వ్యవహారాలు పరిష్కృతాలౌతున్నాయి. ఆ జ్యోతి లేకపోతే, ప్రపంచ మంతా అజ్ఞానాంధకారపరిధిలో, ఏనాడో అణగారిపోయి ఉండేదని, "ఇద మన్ధం తమః కృత్స్నం...." ఇత్యాది శ్లోకంలో, దండిగా వివరించినారు దణ్డిమహాకవి.

శ్రుతి సుభగాలైన ఈ శబ్దచిత్రాలఙ్కారాలు, కొన్ని విన్నంతనే, అర్థావగతిని గల్గించి, చిత్రంగా, శ్రోతలచిత్తాన్ని ఇట్టే ఆకర్షించి, చిత్రికపట్టి, ఆబాలగోపాలాన్ని ఆనందపరవశం చేస్తున్నాయి వస్తుతః, చతుర చేతశ్చమత్కారకారికాని కవినుండి కవిత్వంకాని, అతని రచనలలో కావ్యత్వంకాని ఉంటుందా? అని నేటి ప్రశ్నోపని-షత్కర్తల ప్రశ్నపరంపర. అసలు, ఈ శబ్దార్థోభయాలంకారాలు ఏనాడు, ఎప్పుడు, ఎక్కడ, ఎలా పుట్టినవోగాని అంబోధికి అలలు, అంబరానికి తారలవలె. కావ్యేందిరకు కళంకాలుకాక, కాఞ్చన భూషణాలై, కదంతొక్కుతూ వస్తున్నవన్నమాట కూడ కాదనరాని సత్యం, వైచిత్యం, చమత్కారం, విచ్ఛిత్తి....ఇత్యాదులన్నీ, చిత్రశబ్ద వ్యాపకార్థాలగుటచే, ఈ వైచిత్ర్యాధారంగానే, శబ్ద, అర్థ, ఉభయ చిత్రాల సృష్టి జరిగిందనేది నిర్వివాదాంశం.

కావ్యపరమోద్దేశం, కేవలం ధన, వ్యవహార, శివనామకరణములేకాక, చమత్కార చారుశ్రీకరాలైన శబ్దార్థాలతో, చేతోమోదంతోపాటు, సద్యఃపరనిర్వృతిని, కాన్తాసమ్మితతయా-ఉపదేశాన్ని కూడ చేయాలి వృత్తివిద్యలు తప్ప, భుక్తి విద్యలుగాని, సాక్షరతగాని, సమ్యక్కుగా సర్వులకు అందుబాటులోలేని కష్ట కాలంలో, సామాన్య ప్రజానీకానికి, వ్యంగ్యాలు, తద్భేదాలు, వేలకొలది వెలసి ఉన్నా, అందని ద్రాక్షపండ్లయి, అందలమెక్కి కూర్చున్నాయి.

ఇంకొంచెం ముదలకిస్తూ ముందుకుసాగితే ఈ శబ్దచిత్రాలంకారాలు ఆనాడు ఉద్యానవనాలలో, సంపన్నులగృహాలలో, మధు, మైరేయాలతో, కావ్యశాస్త్ర చర్చలతో వినోదించు విద్యావంతులనేగాక, పగలంతా పనిపాటలతో, అలసిసొలసిన అను వారిని, రైతులను, కూలీలను, కార్మికులను, కూడు-గుడ్డ-గూడు లేక, అష్టకష్టాల

కడలిలో అణగారిపోతున్న అధోజగత్సహోదరులను సైతం, ఎలాగోటిక్కెట్టుకొని, శబ్దచిత్రాల, అతిశయోక్తుల, ద్వంద్వార్థాల శబ్ద–ఆర్భాటాలతో, అలరారు సంభాషణలను, పాటలను, అలంకృత-ఆకారాలను, నాటకాలలో, సినిమాలలో, చిత్రాలలో (అర్థంకాని పరభాషలలోనివైనా), అపరిమితానందంతో.ఆదమరచి, చూచి, వినగానే, పగటికలలు కనేటట్లుచేస్తున్నాయి. మరికొందరు తిండికూడమాని, పస్తుపడుకొంటున్నారు. 'కాటిసీను' గాంచి, కటకటా! అంటూ, కంట తడిపెట్టి వలవిస్తున్నారు ఇలా ఏడవటానికేనా? వారు ఇంత కాలం, ధనం, వెచ్చించి, తిండిమాని, టిక్కెట్టు కొన్నది? కాదు, కాదు, ఆ శోకరసంలోకూడ, పామరుడుసైతం సామాజికుడై, పరమానన్దాన్ని పొందగలడు. రామాయణకర్త వాల్మీకి శోకమేగదా 'శ్లోక'మైనది. ఇక, రసజ్ఞుల సంగతి చెప్పనేల? అదంతా, శబ్దచిత్రశ్రవణ, సంగీత, సాహిత్య మాధుర్యాల మాహాత్మ్యంలో, ప్రభావంలో, మణిగియున్నదనుట నిర్వివాదాంశం. అదే, సౌశబ్ద్యంసాధించే, సాహిత్యం, సౌహిత్యం, బ్రహ్మానంద సబ్రహ్మచారిత్వం కూడ. శరీరబలానికి వ్యాయామాదిక్రీడలవలె, శేముషికి శేవధులైన చిత్రకల్పనలు, ఎన్నో పురాణగాథలను, వ్యాకరణ విశేషాలను..........ఇంకా, ఎన్ని విశేషాలనో, సూక్ష్మంలో మోక్షంగా, అలవోకగాతెల్పి, శారీరకకష్టాన్ని, కాసంతసేపైనా, మరపిస్తాయి. జ్ఞానతృష్ణను, జ్ఞాపకశక్తిని, విజిగీషలో విశ్వాసాన్ని పెంచుతూ, పాఠకుల సుద్రూతలూగించి, విజ్ఞాన-వినోదాలనేగాక, ఆశ్చర్యానందాదులనుసైతం, వారికి అమెతలుగా అందిస్తున్నాయి. అంతేకాక, అవి కావ్యశిల్పానికొకపెట్టనిసొమ్ములై, కట్టనివలువలుగా, కమనీయములైనాయి. మానసికారోగ్యానికి మానదండాలు కావటం చేతనేగాబోలు, ఈ చిత్రకావ్యాలంకారాలంటే, చెవికోసుకొనేవారు ఎందరో తయారయ్యారు. మొదట, అర్థంచేసుకోవడంలో ఆలస్యమైనా, ధిషణాకషణంతో, గ్రంథగ్రంథులు ఛేదించి, క్రమక్రమంగా, అర్థానుభూతితో, అత్యంత విస్మయవిస్ఫారితాక్షులైన పాఠకులు పొందే అమందానందాన్ని, అంతా, ఇంతని వర్ణింపగలమా? కనుకనే, 'విశ్వభాషలలో విలక్షణగానంపన్నమైన "సంస్కృతభాష'యే, సర్వచిత్ర రచనలకు సక్షమమైనభాష" అని, ఎలుగెత్తి చాటినారు, ఎ బి కీత్ మహాశయుడు.

వస్తుతః, మిక్కిలి కష్టసాధ్యమైన, ఈ చిత్రాలంకార సమగ్రపరిశోధన, పెద్దపెద్ద–సాహిత్యఅకాడమీలు, ధార్మికసంస్థలు, పదులకొలది పండితప్రకాండులను, సంవత్సరాలకొలదిపోషించి, ఎన్నోలక్షలు వెచ్చించి, ప్రకటింపదగినకార్యము, ఏలయనగా, నేటివరకు, వానిపై జరిగిన పరిశోధనలను, తులనాత్మకతను, ప్రశ్నిస్తే,

చాలమంది ప్రాచార్యుల ప్రత్యుత్తరాలు "నేతి(న+ఇతి), నేతివచనాలే". ఇక, విషయమా కష్టసాధ్యం. ప్రబలపాండిత్య పండితులు పర్యవేక్షింపవలసిన విషయం. వ్యాఖ్యానసాపేక్షం, కష్టకావ్యాలని పలువురు పట్టించుకోలేదు ప్రారంభించి పరిత్యజించినవారు మరికొందరు. ఆకరగ్రంథాలుకూడ అంతంతమాత్రమే. ప్రాచీనప్రతులు లభ్యంకావు. అదికూడ పరిమితాలు. ఎక్కడో, ఏకోష్ఠంలోనో, ఏమూలనో పడి ఉంటాయి. తత్రాపి, సంస్కృతగ్రంథాలు అసలేదొరకవు. వెదకి వెలార్చితే, క్రిమికీటకదష్టాలై దృశ్యాదృశ్యాలుగా ఉంటాయి సందేహాలువస్తే, తీర్చే జంగమవిజ్ఞాన సర్వస్వాలైన, అలనాటి పండితాఖండలు లందరూ, గ్రంథస్థంచేయక, పరలోకం ప్రయాణించారు. పరసహస్రాబ్దాలుగా, పండితానన పరిష్వంగ పరిమితాలైనవి వారితోనే దివికేగినాయి. తాళపత్రాలలోని కావ్యాలెన్నో, అజ, గజ భక్షితాలుకాగా, మరి కొన్ని, చిదికి, చితికి చేరినాయి. 'పండితపుత్రులు' కొన్నిటిని, పప్పుబెల్లాలకు అమ్ముకోగా, నేడు లోకులనాలుకలపై నర్తించేవన్నీ, చూస్తూ, చూస్తూ, విద్రుష్టాలు అసలేముగదా!

లోగా, అక్కినేని నాగేశ్వరరావు కళాశాల (గుడివాడ)లో, అధ్యాపక వృత్తిలోనున్నపుడును, కొన్ని పత్రికలలో ప్రకటించినపుడును, కొన్ని నగరాల సాహిత్య సంస్థలసభలలో, గోష్ఠులలో ప్రసంగించినపుడును కవిన, వినిన శిష్య,మిత్ర, హితైషి సాహిత్య బంధువర్గము, పై వానిని పరిశోధించి, ప్రకటింపగోరినది. కాని, ఉపన్యాసాలకు, పరిశోధనలకు, గ్రంథ ప్రచురణలకు 'హస్తి మశకాంతరం'గదా! దానికితోడు వయోవృద్ధత్వం, అలసత్వం, అజ్ఞత్వం, అల్పజ్ఞత్వం అనేక క్లిష్టసమస్యల నెదుర్కొనవలసి రావడంతో మనస్సు వికలం కావడం, ప్రాజ్ఞులము కావలెనన్న 'దురాశ'తో 'ప్రజ్ఞులు' (దొడ్డికాళ్ళవాళ్ళం) కావడం,....అన్నీ అవరోధాలే. కొంచెం ప్రయత్నిద్దామనుకొంటే, కథ అడ్డం తిరుగుతోంది మందత్వం, మందమతిత్వం మస్తుగా మల్లడిగొన్న మాదృశులకు యశఃప్రార్థిత్వం, ప్రాంశులభ్య ఫలలోభంగాని, ఏకోశానా లేవు. ఏమేలోగా, యథాశక్తి, యథామతి తెలిసినంతవరకు, పాఠక ప్రభువులపాదారవిందముల ముందు ప్రత్యగ్రంగా, ప్రత్యక్షీకరిద్దామనే కోర్కె మాత్రం లేకపోలేదు.

షష్టి (60) పూర్తితో, సర్వీసునుండి రిటైర్డై, పశ్చిమవయస్సులో పరిశోధన "కరపి మా లిఖ, మా లిఖ" అనుకొంటూ,కాటికి కాళ్ళారజాపుకుని,విశ్రాంతి తీసుకోవవలసిన సమయంలో, మిత్రుల పత్తిడితో, ఒక భాషలోగాక, అనేక-అన్యభారతీయ, పాశ్చాత్య (యూరోపియు) భాషలతో, తులనాత్మకంగా పరిశోధించవలసివచ్చినది.

'ఆశా బలవతీ' గదా! చిన్నతనము నుండి చిత్తశుద్ధితో, ఏవో కొన్ని ఆదర్శాలతో, సంస్కృతవ్యాసంగంతో, గురుకులక్లిష్టతతో, పేదతనంతో, ధనసంపాదనకు దారిచూపు ఆంగ్లాది విద్యలను, ఆమడదూరం అవతలికి త్రోసి, ఆనాడు అగ్రజాతులకు మాత్రమే అందుబాటులో నున్న, 'గీర్వాణ వాణి'ని గిలించుటకై, గురువరివస్యతో, పఠించినాము.' పరిశోధనకై, తంజనగరము, మద్రాసు. మైసూరు, తిరుపతి, వాల్తేరు, హైదరాబాదు, పూనా, బొంబాయి, కలకత్తా, పాట్నా, కాశీ, అలహాబాదు, ఢిల్లీ, హోషియార్‌పూర్ (పంజాబ్) మొ॥ పట్టణాలకు పరుగులెత్తి, పాతలైబ్రరీ గ్రంథాలను బూజుదులిపి, వెదకి, వెలికి దీయుటంలో అమూల్య సమయమెంతో వ్యర్థమయ్యేది ఒక్కొక్కప్పుడు, కాని దేశంలో ఒడలు జలదరించేది. 'బాధ' బరువై, కళ్ళవెంట కడివెడు నీరు కార్పించేది? ఆబాధ శత్రువులకైనా వద్దనిపించేది ఇంకా, వార్ధక్యం వద్దంటున్నా, శ్రమపడి, పరిశోధించి, ఏదో కొంత సాధించాలనుకుంటే, "ధనమూల మిదం జగత్'తో, ఇదంతా 'ఛాందస'మని చెండాడే వారినెందరిని మెప్పించగలం?

అయినా, అన్యభాషలకు అమిశ్రితమై, అసాధ్యమై, సంస్కృతంలోమాత్రం, కొల్లలుగా ఆచ్ఛాదితమై, అందరానికెగిరిపోకుండా అవనిలో నిల్చియున్న, ఆయా చిత్ర కావ్యాలంకార విశేషాలను, వానిలో దాగియున్న అనేక రహస్యాలను, చవిపోయేలోపల (శాస్త్రం పాపం ...) యథాశక్తి యథామతి, సాధ్యమైనంతవరకు సంస్కృత భాషా-నభిజ్ఞులకు, ముఖ్యంగా, పామర, కార్మిక, కర్షకులకు, అధోజగత్తులో అలమటిస్తున్న తాడిత, పీడిత, దళితసోదరులకు, ఆంధ్రాది భాషాసాహిత్యాల వడ్డుపెట్టులొని, స్థాలీపులాకన్యాయంగా, "చిత్రకావ్యాలఙ్కార సర్వస్వ దర్శనం' చేయించాలనే, అత్యాశ-తపనలతో, అర్థశతాబ్దానికిపైగా, అధీతి-బోధ-చరణ-ప్రచారణలతోపాటు, పైప్రక్రియలన్నింటిని పరిశీలించక తప్పలేదు. ఏమైతేనేమి, తదంతర్గతాలైన '1ప్రశ్నోత్తర చిత్రాలఙ్కారమ్, 2గూఢచిత్రరహస్య ప్రకాశిక" అను పరిశోధనగ్రంథాలను, 25వేలకుపైగా వెచ్చించి, చేతి చమురు భాగవతంతో ప్రచురించి, చేతులు కాల్చుకొని, కూర్చుండకయు తప్పలేదు.

ఇక 'చ్యుతదత్త చిత్రచన్ద్రిక' వెలుగులోనికి రావాలి. వీనిని దండి, వామనాచార్యుడు వదిలివేసినారు క్రీడా మాత్రోపయోగులుగా మన్నించిన, రుద్రటాచార్యుడు వీనికి సర్వప్రథమస్థానమిచ్చి సంక్షిప్తంగా వింగడించినాడు మమ్మట, రుద్రయ్యకాదు

ఈ విషయంలో మౌనముద్రాలంకృతులు, కాగా, హేమచంద్రుడు వీటిని 'చిత్రాలంకా
రాలు'గా చిత్రించినా, లక్షణాలు మాత్రం చెప్పలేదు. విశ్వనాథుడీ 'చ్యుతదత్తాక్షరాది
కము'ను ఉక్తివైచిత్ర్యంగా ఊరీకరించెను. వాగ్భటుడు వీటి భేదాలను వివరిస్తూ
'అక్షరాదిచ్యుతి కారణం'గా 'ఛన్దః పరివర్తన'ను కూడ సూచించెను. వామనానుసారి
యైన, అమర చంద్రయతి మాత్రం, శ్లేషసిద్ధికోసం, ఈ చ్యుతాది రచనా సాహా
య్యము నపేక్షించెను. తర్వాతి, ఆలంకారికులు కొందరీ 'చ్యుతాది చిత్రా'న్ని స్వీక
రించినా, లక్షణాలలో నవీనతను, నాణ్యంగా చూపలేకపోయారు. అసలు 'శ్లేష
చిత్రాలు లేకుండా, వాగ్వైదగ్ధ్యమెలా వస్తుందంటాడు (వినాచ శ్లేషచిత్రాభ్యాం కీదృశీ
వాగ్విదగ్ధతా?' ర 3-81) ప్రకాశవర్షుడు. అల్లే ఆంధ్ర కవులగు నన్నెచోడ, భైర
వాదులు కూడ, కావ్యంలో చిత్రకవితను తప్పకుండా చొప్పించాలన్నారు. "ఆశు
కవిత్వంబు లల్లితేనేసరా? చిత్ర ప్రబంధముల్ చేయవలదె?" అంటూ చిత్రాలకు
ముద్దుగా, ప్రబంధత్వాన్ని ప్రతిపాదించింది కవయిత్రి ముద్దుపళని. మొత్తంమీద ఏది
చ్యుతమైనా, ఏది దత్తమైనా, లేక, ఒకటి చ్యుతమై తత్స్థానంలో మరొకటి దత్త
మైనా, వానిలో, అన్యార్థ ప్రతీతి మాత్రం అని వార్యం, అవశ్యకమనే సంగతి
మరువరానిది. మరియు, దీనిలో చూపిన 'చ్యుతాది విశేషాలు' అనేక మహాకవుల
కావ్య రాజాలనుండి, ఉదాహరింపబడినవి. ఒకచో, గ్రంథవిస్తరభీతికి వెరచినను,
భవిష్యత్ పాఠక, పరిశోధక మహాశయుల పరమావస్థాన్ని దృష్టిలో పెట్టుకొని,
పట్టుదలతో, వెదకి, వెలికిదీసిన, చమత్కారచారుశ్రీకర చిత్రభేదాలను, పునరుక్తిభీతి
విడిచి, అవసర పదచ్ఛేద, అర్థ, తాత్పర్య, విశేష, వివరణలతో, శిష్టవ్యావహారికంలో,
ఉదాహరణాన్తరజాతము నిచ్చుటకుకూడ, సాహసింపవలసి వచ్చినది మనవి.

నేడు అంకితంకొని, అక్షరలక్షలు, అగ్రహారాలు, కనకాభిషేక, గజారోహణ,
గండ పెండెర దానాదుల కాలం దాటిపోయింది. ఎదురైనచో తమ మదకరీంద్రం
గాకపోయినా, కారో, స్కూటరో, సైకిలోదిగి కేలూతనిచ్చిన, న్మానించేవారు, విద్వ
త్కరుణా కటాక్షం విస్తరింపజేయు దాతలు కూడ కరవైనారు. ప్రజాస్వామ్యంలో
ప్రభువులంటే, ప్రజలు, ప్రజాసంస్థలు, ప్రజాప్రభుత్వాలేగదా! కాని వారు వారిని ఆద
రించి, ఆదరించి (భరించి,. ) సన్మానింపకపోయినా, కనీసం ప్రకటించుటకైనా సాయం
చేయాలి. లేక, వారే ప్రకటించి, పోషించాలి. లేక కొనాలి, కొనిపించాలి. లేకపోతే,
ఆ పేదపండితులేమి పరిశోధనలు చేయగలరు? విశేషమేమిటంటే, నేటి ప్రజలు,
పార్టీలు అధికారదాహంతో, అందలాలెక్కాలను కొంటుంటే, ధనిక ప్రజలు

అనంతకోటి-అవినీతి ఉపాయాలతో, లక్షలు, కాదు, కోట్లకు పడగలెత్తినా, తృప్తి పడక, పరార్థ (ఉపకార)మును పారద్రోలి, పరార్ధ (అన్నిటిని మించిన సంఖ్య) పర్యంతం పరుగు పందెములలో పాల్గొని, ధనం సంపాదించి. దుర్వ్యసనాలకు, దుర్వ్యయం చేయటం విచారణీయాంశం మొత్తంమీద, "అర్థస్య పురుషో దాసః, ధనమూల మిదం జగత్ కావటంతో, రాను రాను, వదాన్యత వగ్గై, ధనలాలస లగ్గై లావైపోతోంది. ఇక, పాండిత్యంకూడ ప్రల్లదం (పరుషం) అయిపోతుంటే, 'సామాజిక స్పృహ'ను సార్థకం చేయాలని లోకం కోడై కూస్తోంది. ఇట్టి, కష్టకాలంలో, టి. టి. దేవస్థానం, తెలుగు విశ్వవిద్యాలయం మొ॥ సంస్థలు, ఉత్తమ గ్రంథ ప్రచురణకు, పూర్తిగా, లేక కొంత-ఆర్థిక సహాయం అందించి, పుణ్యం కట్టుకోవడం ముదావహం.

ఇక, ముద్రణలోని పాట్లు, అమ్మకంలోని అగచాట్లు, చెప్పనలవిగానివి. కదిపితే పందలు,కాదు, వేలు, కాగితం, ప్రింటింగ్, బైండింగ్,........మొ.నవి, ఒకటేమిటి, అన్నిరేట్లు అవధులుదాటి, అంబరానికెగిరి, 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అంటున్నాయి. పుస్తకాలను ముద్రించుకోలేక, అమ్ముకోలేక, విక్రేతలకిస్తే 50 శాతం కమీషన్ కావాలంటారు. ముందుడబ్బివ్వరు. ఎక్కువ ధరవేస్తే ఎందరు కొంటారు? జిజ్ఞాసువులు బాధపడతారు పోనీ, ఎలాగైనా ప్రచురితమైతే దాలునను కొంటే, లాభంలేనిదే ఏసెట్టి వరదలో దూకబోతాడు?

ఇట్టి, విపరీత, విపత్కర, దుర్భర, దుష్టపరిస్థితులలో, పెన్నముతో పెనగులాడుతూ, వార్ధక్యంతో, వందురుచూ, వణకుచూ, మతిమాంద్యంతో, పేపరుమీదికెక్కగల వారెందరుంటారు? హాయిగా, తిని,తీరికగా కూర్చొంది, సుఖింపక, ఇంతటి మహాకార్యభారాన్నెత్తవ్వి,తలకెత్తుకోవడం 'దురాశ,పేరాస'కాదా? అని ఆక్షేపించడం, ఈసడించటం కూడా సులభమే అది సత్యంకూడ. ఆ దురాశ దుఃఖానికి మూలమే. అయితే, మానవుడు ఆశాజీవి. అధీతి, బోధా, చరణ, ప్రచారణములతో, అర్ధ శతాబ్దికి పైగా సంపాదించిన అనుభవ ధనం వ్యర్థం కావలసిందేనా? పునాది దొరికితే, మరోధరులుపురోగమింపగలరుగదా? అని తలంచితే, ఇంతలో,"క్షణశః కణశ శ్చైవ ......., విద్యార్థీ చేత్ త్యజేత్ సుఖమ్" ఇత్యాది సూక్తులు, సూటిగా, ఘాటుగా, కొట్ట వచ్చినట్లు హెచ్చరించటంవల్ల, మా వార్ధక్యం వంగి, లొంగిపోయింది.

కాని, ఈ మధ్యలో, 'శ్రేయాంసి బహువిఘ్నాని, ఛిద్రేష్వనర్థా బహులీభవన్తి" అన్నట్లు, కష్టపరంపర కాలకూట విషంలా, హఠాత్తుగవచ్చి, మీదపడింది.

మా రెండవ అమ్మాయియు, పెద్ద తల్లిదండ్రులగు శ్రీమతి & శ్రీ సూ. మనోరమా, శోభనరావుగారల అభిమాన పుత్రికయునైన, డా విజయ రమేశ్, M.Sc , Ph D , (జువాలజీ లెక్చరర్, సిద్ధార్థ మహిళా కళాశాల, విజయవాడ-10) కూతురును, కొడుకును, భర్తను, కవిన, పెంచి పెద్దజేసిన తల్లిదండ్రులను వదలి, అకాలకాలకబలీ భూతురాలు కావడంతో, 300 పేజీల ప్రశ్నోత్తర చిత్రాలంకారం' 200 పేజీలతోనే ప్రకటితమైనది. మరల పరివర్ధితం కూడా చేయలేకపోయాము. ఇక, రెండవ 'గూఢ చిత్రరహస్య ప్రకాశిక' తె. వి వి. వారి Expertsచే, పరిశీలింపబడి, నాల్గువేలరూపాయల ఆర్థిక సాహాయ్యమునందుకొని, తె. వి. వి. వారికి కృతజ్ఞతాంజలి తెలుపుకొని, ప్రకటితమగు లోపల, మూడవఅల్లుడు శ్రీ N ప్రభాకర నాయుడు B Sc , M A , M.Ed , (గణితాధ్యాపకుడు, శ్రీ కాళహస్తి) ఆంధ్ర ప్రభుత్వం వారి పిలుపుపై, చిత్తూరులో ట్రైనింగ్ పూర్తిచేసుకొని, అకస్మాత్తుగ, అక్కడనే గుండె నొప్పితో అస్తమించి, చరిత్ర శేషుడైనాడు, క్రమంగా, వర్థిష్ణువులగుచున్న వారిద్దరి అకాలమరణంతో, మా సంసారాలు అంధకారబంధురాలు, అనారోగ్యం పాలైనాయి. ఎలాగైతేనేమి, గూఢ. చిత్ర ప్రకాశికను ప్రకటించి, వారికే అంకితం చేసినాము. ఇలా మాగోడు, సహృదయులకు సమర్పించుకొని, సగంభారం తగ్గించుకొన ప్రయత్నించినందులకు క్షన్తవ్యులము.

ఇక, మిగిలిన గ్రంథాలనెట్లు పూర్తిచేయగలమా? అవి, సంశయ గ్రస్తులమై, పరిశోధనల ప్రచురణకై చేయుచున్న 'గౌరవాధ్యాపకత్వా'నికికూడ స్వస్తి చెప్పి, ఈ 'చ్యుతదత్త చిత్ర చన్ద్రికా' రచనను పూర్తిచేసి, ఒకవ్రాతప్రతిని, టి. టి.డి (తిరుపతి) వారికి, మరొక ప్రతిని, తె. వి. వి. (హైదరాబాదు) వారికి (కాపీ రైటు హక్కుతో వారే సొంతంగా ప్రకటించుకొనుటకు వీలుగా, వ్రాసి) పంపినాము. ఆరు నెలల తర్వాత, టి.టి.డి వారిగ్రంథం, దైవ,మతపరంకాక,సాహిత్య పరమైనందున, సాయం చేయజాలమన్నారు ఇక, తె. వి. వి పై ఆధారపడి, ఉత్తరాలువ్రాసినా, సంవత్సరం దాటినా, ప్రత్యుత్తరం రానందున, విరాళతో, దోలాందోళనస్థితిలో ఉండ, వదాన్యశేఖరులగు, మాన్య శ్రీ వివి ఎస్సెస్ 'మణి'గారు, మా ముద్రిత గ్రంథద్వయమును పరీక్షించి, 2+2=4వేలకు రెండు చెక్కులను పంపి తమ సంస్కృత సాహిత్యాసక్తిని, విద్యాబదాన్యతను నిరూపించుకొన్నారు అంతియేకాక, ఈ చ్యుతదత్త చన్ద్రిక-వ్రాతప్రతినికూడ పరిశీలించి,ముద్రణకు ఆర్థికసహాయ్యమును

కూడా అందింతు మన్నపుడు, ఆనందించి, కృతజ్ఞతతో, వారికిగ్రంథము అంకితము చేసి, ఋణము తీర్చుకొనుటకు నిశ్చయించుకొంటిమి

మాన్యశ్రీ మణిగారికి, అంకితభావము నిర్ధారితమై, కొంత భాగము ముద్రితము కూడ కాగా, ఆగస్టు (95)మధ్యలో, తె వి.వి వారు పరిశీలించిన, ఈ పరిశోధన గ్రంథమును, తాము సొంతంగా ప్రకటించుకొనుటకు వీలుగా, రు. 10/=స్టాంపుపై కాపీరైటుహక్కుతో విమ్మని వ్రాసినారు మరల, సెప్టెంబరులో రిమైండరును కూడ పంపినారు. ఇట్టి దోలాందోళన స్థితిలో, కొందరు హితైషులు పరస్పరవిరుద్ధ ప్రతిపాదనలనందించినారు. ఏమైనా చివరికి వాగ్దాన భంగముకాకుండ, మాన్య మణిగారికే, అంకిత మిచ్చుటకు నిర్ణీతమై, గ్రంథముద్రణ పూర్తి చేయబడినది తె వి.వి. వారికి సంగతి తెల్పి, వారి దయార్ద్ర దృష్టికి కృతజ్ఞతాంజలి ఘటించి, త్వరలో పూర్తి కానున్న, మా 'ప్రహేలికాప్రపఞ్చమ్' అను 4వ పరిశోధనను పంపుకొందుమని, సవినయముగ మనవి చేసికొన్నాము

పండిత గోష్ఠులకే పరిమితమైన, ఈప్రాజ్య సంస్కృత చిత్రాలంకార పారశ్వత సౌందర్యమేరు పర్వతాన్ని, అనేక కావ్య, భాషల తౌల్యంతో, అల్పాంశతోనైన, ఈ అద్దంలో ప్రతిఫలింపజేసి, చిత్రాలంకార సాహిత్య సౌధాదురుక్షువులకు, పూర్వరంగంగా, "జీర్ణ మంగే స్వభాషితమ్" కాకుండ, ఏ విధంగానైన, ప్రకటించి, స్వాంతస్సుఖమును పొందవలె ననిపించినది. ఇక, కానవివారివి కాదని, ప్రత్యక్ష దైవతాలైన ప్రజలపై, ప్రజాస్వామ్య-సామ్య వ్యవస్థలపై, ప్రాజ్ఞ పాఠక, కవి, పండిత ప్రకాండులపై, శిష్య, మిత్ర, హితైషి, సాహిత్య బంధువర్గం పై, భార మునుంచి, వారి పద పంకేరుహములపై, సప్రశ్రయంగా సమర్పితాలైన, ఈ గ్రంథాలు, అఞ్జలిఘటించి, ఆతురతతో, ఎదుట నిల్పబడినవి. అద్దమున్నది, ముఖమున్నది. ఇక, 'నీర క్షీర వివేచనబాధ్యత క్షమాసారులు, సచేతస్కులనగు, సహృదయ, పాఠక,పండిత, కవిరాజహంసలదే'.

విరళ ప్రచారం, విషయదురూహత, వ్యాఖ్యాన సాపేక్షత, అకరాభావము, అజ్ఞత, వయోభారం ...వద్దని మొత్తుకొంటున్నా, ఆ బరువు భరింపలేక, మానివేయాలంటే, "ఆరంభింపరు నీచ మానవులు, ....ప్రారబ్ధార్థములు జ్ఞగింపరు సుమా!...." ఇత్యాది సూక్తులు సూటిగా గుర్తుకువచ్చి, వార్ధక్యంలోకూడ ఉత్సాహాన్ని ఉరకలింప జేస్తున్నాయి.

నేటి కంపోజిటర్లు, ముఖ్యంగా, సంస్కృత భాషానభిజ్ఞులు కావడంతో, ఎంత గట్టిగా, కళ్ళల్లో వత్తులుపెట్టుకొని, కంచు కాగడాలతో గాలించి, పరీక్షించి, దిద్దినా, ముద్రారాక్షసా లెన్నో మునురుకొని, వచ్చిపడుతూనే ఉన్నందుకు, క్షమిస్తూ, అర్థతాత్పర్యాల సహాయంతో, సరిదిద్దుకొన ప్రార్థితులు. మరియు, ప్రస్తుత పరిశోధన లలో దొరలిన దోషాలను, చార-విచార-జిఘృక్ష దృష్టులతో, క్షమించి సవార్థ తత్త్వావమర్శ పరితోషసమీహతో, సానుగ్రహంగా సమీక్షించు సహృదయులే మాకు ప్రమాణం అసర్వజ్ఞుల గ్రంథాలలోదోషవిరహ మెలా ఉంటుంది? 'నా స్త్యేవ త జ్జగతి సర్వమనోహరం యత్ .... దొరలిన దోషాలను తెల్పి, కృతజ్ఞతాఞ్జలులనందు కొనుటకై, పాఠక, కవి, పండిత ప్రవరులకు పౌనఃపున్య ప్రార్థన.

ఒక అపరిచితవ్యక్తిపై, అవ్యాజ కరుణాకటాక్షమును ప్రసరింపజేసి, ఆర్థిక సహాయమునందించి, అజ్ఞాతముగానుట కంగీకరించిన, మాన్యశ్రీ 'మణి' మహో దారులకు, ఎన్నికృతజ్ఞతా పూర్వకవందనశతములర్పించినను, ఋణము తీర్చుకొన లేము. ఈ గ్రంథరచనకు,ప్రచురణకు, ప్రోత్సహించి, దయతో సహాయపడిన, సహాయ పడమన్న పెద్దలకు, సవిమర్శమగు పీఠికను 'చిత్రిక'తో చిత్రించిన, గరిమ+ఎల్ల= గౌరవమునకు-హద్దైన, లేక, గరిమ-ఎల్లయెడలగల, లేక, గరి (అతిశయముతో) మెల్ల .. (ఎత్తైన, మేలైన-స్థానము నధిష్ఠించి)సార్థకం చేసికొన్న, మిత్రులు శ్రీగరి మెళ్ళ....సోమయాజులుశర్మగారికి, కొన్ని అవశ్యకగ్రంథాలను ఆదరంతో అందిం చిన,ఆచార్యవి. శ్యామసుందరదేవ్‌గారికి, సకాలంలో ముద్రించి పెట్టిన, 'వంశీకృష్ణ ప్రింటర్స్'అధిపతులు శ్రీ సర్రా రాధాకృష్ణమూర్తిగారికి, అన్నివిధాల సహాయంచేసిన ఆత్మీయులకు, మిత్ర బృందము మొ వారికి కృతజ్ఞతాఞ్జలి ఘటించి,సప్రశ్రయముగ, పదే పదే ప్రార్థించుచున్నాము.

పాఠకానాం ప్రహర్షాయ ధిషణాకషణాకరమ్।
సు ధియా స్వధియా ప్రోక్తం చిత్రం చిత్రమనోహరమ్॥
యథామతి యథౌచిత్యం యథాశక్తి యథారుచి।
సుధియాం సుజనజ్ఞత్యై 'చ్యుతదత్తం' ప్రకాశితమ్॥
శివియస్సెస మణిం వన్దే విశ్వదాతృవరం విదమ్।
పాఠకాచార్య దేవాదీన్ భక్తి ప్రవణ చేతసా॥

"అపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్"

| | | |
|---|---|---|
| అనన్త వర్ధన | ఇతిశమ్ | వినత విధేయుడు |
| విజయవాడ-10 | | "యశస్వి" |
| | | (సూ. వే. గో. రావు) |

# చిత్రిక

## శ్రీరామచన్ద్రాయనమ:

శ్రీ పూరపనేని వేణుగోపాలరావుగారు రచించిన 1) ప్రశ్నోత్తర చిత్రాలంకారము (2) గూఢ చిత్రరహస్య ప్రకాశిక (3)సంస్కృత చ్యుతదత్త చిత్రచన్ద్రిక యను మూడు గ్రంథములను బఠించి యమందానందము నొందితిని. ఇవి చిత్ర కవితా ప్రస్థానమునకు సంబంధించిన మహత్తర గ్రంథములు.

ఒకే శ్లోకములోఁ బ్రశ్నయు సమాధానము గూడ నిమిడి యుండుట ప్రశ్నోత్తరచిత్రాలంకారము. ఇందలి ప్రభేదములన్నియుఁ'బ్రశ్నోత్తర చిత్రాలంకారము'లో లక్ష్యలక్షణ సమన్వయపూర్వకముగా,వివిధోదాహరణములతో వివరింపఁబడినవి శ్లోకములోఁ గర్త, కర్మ, క్రియాపదములు, కవి,గ్రంథనామములు, కొన్ని పాదములు మొదలగునవి'గోప్యముగానుండుట' 'గూఢ చిత్రము'.ఈ గూఢ చిత్రరహస్య ప్రకాశికలో,వీని యవాంతర భేదములన్నియు ననేకోదాహరణములతో సాకల్యముగా వివరింపఁబడినవి. 'చ్యుతదత్త చిత్రచన్ద్రిక' యనునది ప్రస్తుతగ్రంథము.

బాణభట్టు కాదంబరిలో శూద్రకుని వర్ణించు సందర్భములో- "కదాచి దక్షరచ్యుతక-మాత్రాచ్యుతక-బిందుచ్యుత-కాతిగూఢ చతుర్థపాద-ప్రహేళికా,ప్రదానాదిభిః" అని పేర్కొనుటచే నీ చ్యుతదత్త చిత్రాలంకారము 7వ శతాబ్దమునకే,బాహాటముగాఁ బ్రచారములో నుండెనని గ్రహింపవచ్చును. 'ప్రవహ్లికా ప్రహేళికా' యని యమరసింహుని నామలింగానుశాసనము. భామహుఁడు కావ్యాలంకారములో, నీ చిత్రకవితను నామమాత్రముగా సూచించి విడిచిపెట్టెను. దండి మహాకవి కావ్యాదర్శములో, నేకాక్షరాదివ్యంజన చిత్రములను,ప్రహేళి(క)కలను బంధకవితను గొంతవఱకుఁ బ్రదర్శించెను. తరువాతి యాలంకారికులు బంధగర్భ చిత్రకవితలను గూడ, లక్ష్యలక్షణములతో నుదాహరించిరి.

భారవి కిరాతార్జునీయములో, మాఘుఁడు శిశుపాలవధములో, రత్నాకరుడు హరవిజయ మహాకావ్యములో, ధర్మనంది చంద్రప్రభ చరితములో,వాగ్భటుఁడు నేమినిర్వాణ కావ్యములో, శ్రీ వేదాంతదేశికులు యాదవాభ్యుదయ-పాదుకా సహస్రము లందును, వేంకటాధ్వరి లక్ష్మీ సహస్రమునందు, భరద్వాజ కవి శివకర్ణామృతమునందును నీ చిత్రకవిత్వమును మిక్కుటముగాఁ బ్రదర్శించిరి. జైన స్తోత్రసముచ్చయము, సుభాషిత రత్నభాండాగారము, సుభాషిత సుధారత్న భాండాగారము మొదలగు సంకలన గ్రంథములలో నీ చిత్రకవితా సంబంధి శ్లోకములు గలవు.

ధర్మదాసుని 'విదగ్ధముఖమండనము', చక్రకవి 'చిత్ర రత్నాకరము; విశ్వేశ్వర పాండేయుని 'కవీంద్రకర్ణాభరణము' చిత్రకవితా ప్రస్థానమును నిరూపించు టకై రచింపఁబడిన ప్రత్యేక గ్రంథములు.

ఇంక మన తెలుఁగులో నీ చిత్రకవిత ప్రప్రథముగా నన్నెచోడమహాకవి కుమారసంభవములో దర్శనమిచ్చుచున్నది. నంది ఘంటల జంట వరాహపురాణము, ముక్కుతిమ్మన పారిజాతాప హరణము మొదలగు కావ్యములనుండి నేఁటివరకును నీ చిత్రకవిత కొంచెఁదిగనో గొప్పగనో దర్శనమిచ్చుచునే యున్నది. కావ్యాలంకార సంగ్రహము, అప్పకవీయము మొదలగు లక్షణ గ్రంథములలోనిది, కొంతకుఁ గొంత వివరింపఁబడినది.

కాని మన తెలుఁగులో నీ చిత్ర కవితాప్రక్రియలు, వాని యవాంతర భేద ములు లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగా, వివిధోదాహరణములతో విపులముగా వివరించు నుద్గ్రంథ మింతవఱకు వెలువడలేదన్నచో నతిశయోక్తికాదు. ఆ కొఱఁ తను 'సాహిత్యరత్న' సూరపనేని వారి గ్రంథరత్నమాల వలన నేఁడు తీరుచున్న దనుట స్వభావోక్తియని, యీ గ్రంథము నామూలాగ్రముగాఁ బఠించినవారికిఁదెల్ల మగును. విదగ్ధముఖమండనము, కవీంద్ర కర్ణాభరణము మొదలగు గ్రంథముల లోని విశేషములన్నియు, నిందుఁదేటతెల్లమగు తెలుఁగులో, వివరింపఁబడినవి. వీరు దాహరించిన శ్లోకములేకాక యనంతభట్టు 'చంపూ భారతము', వేంకటాధ్వరి విశ్వ గుణాదర్శము, శ్రీశ్రీపాదవారి నైషధీయచరితము మొదలగువానిలోఁగూడ నీ చ్యుత–దత్తచిత్రాలంకారములుగల శ్లోకములు కొన్నిగలవు. మచ్చునకుఁగొన్నింటి నుదాహరించుచున్నాను.

> అసీదతా మాశు ధనుర్ధరాణా మాసీ దతామ్యత్కర కౌశలానామ్ ।
> క్షణం మిథో బాలగణోపరోధాత్ వ్రణం న కస్యాపి రణం నవం యత్॥
>
> చం.భా. 2-109

ఈ శ్లోకము ద్రౌపదీ వివాహసమయమున శత్రుసైన్యములు, యుద్ధముచేయు సందర్భములోనిది. వేగముగా యుద్ధమునకు సిద్ధమైన ఆ సైనికులకు బాణసమూహ మడ్డుపడుటచే, రణము, 'నవ'మగుటచే (=వకారము లేకపోవుటచే) ఏ ఒక్కనికి వ్రణము కలుగలేదని భావము. వ్రణములో 'వ' కారము చ్యుతముకాగా, 'రణమే' మిగిలినదని చమత్కారము.

> కబరత్వముపైః పతస్య పుంసః కలిలందామ్న కకారసంవిధానమ్।
> రణతి స్మ తదా కిలంతభావం భగవన్మత్తక భూషణం య దేషః॥

ఈ శ్లోకము 'కిరాతార్జునీయమహాకావ్యము'లోనిది. పురుషులలో వరుడైన శివుడు 'శబ(వ)రత్వము'ను పొందగానే, శిరోభూషణమైన శశిఖండము(=చంద్రవంక) శిఖండ(=నెమలిపింఛము) మయ్యెను. 'శశిఖండము' నందలి 'శ' కారము చ్యుతమై, 'పర' శబ్దమునకు దత్తమై శబరుడు కాగానే (వబయోరభేదః) 'శిఖండ' మైనదని చమత్కారము విశ్వగుణాదర్శములోని యీ శ్లోకమును పరింపుడు.

అంసే సలీల మధిరోప్య శుకం స్వహస్తాద్

గోప్యా భయాకుల దృశః కుతుకీ ముకుందః ।

అంసం గతం శుక మిహాపన యేతి వాచం

తస్యా విశమ్య స తదంశుక మాచకర్ష ॥ వి. గు. 223.

శ్రీకృష్ణుడు ఒక గోపికయొక్క అంసము (భుజము)నందు, 'శుకము' (చిలుక)ను, తన చేతితో విలిచి, ఆమె భయపడుచు "అసం గతం శుక మిహాప నయ" (=భుజము పైనున్న చిలుకను తీయుము)='అం'తో కూడిన, శుకమును తీయుము-అను మాటను విని, ఆమె 'అంశుకము' (=పైట)ను లాగెనని భావము. 'శుక' శబ్దమునకు, 'అం' దత్తము కాగా 'అంశుక'మైనదని చమత్కారము.

కవిసార్వభౌమ, శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి "నైషధీయచరితము" నందలి, ఈ పద్యమును తిలకింపుడు.

చ. కరములఁ బెంకొదల్, మొన 'మ'గా నును బిక్కలు, 'ధు' ద్వితీయమై
నెఱుల, వికంఠ్యమై పెదవి, నీగి 'ధు' 'వంద' 'ర' పైఁగ వాక్కు, బొ
ట్టిరవుగ 'మా'కు మాఱ నుత లెన్నఁబిఖందుమ నాది వోవఁగం
దరము, మరల్పనన్ నగవు, నల్వగ నల్వ సృజించె నెవ్వరిన్॥
శృం నై. 2 62

ఇది దమయన్తి వర్ణనము, ఆమె తొడలు కరములు=తొండములు దానికి ముందు 'మ' దత్తముకాగా, 'మకరములు'=మొసళ్ళ-పిక్కలైనవి దానికి రెండవ వర్ణముగా, 'ధు' దత్తముకాగా, 'మధుకరములు'=తుమ్మెదలు కచములైనవి. అందలి 'కంఠ్యము' ('క'కారము) చ్యుతము కాగా, పెదవి 'మధుర'మైనది. ఆ మధురములోని 'ధు' చ్యుతమై, 'అంద' అను పదము రేఫముపై దత్తమై (చేరగా) "మకరందము' =తేనె, వాక్కైనది అందలి సున్న(ం) "మ' వర్ణముపై దత్తమై చివరి అక్షరములు "ర-ద"లు వ్యత్యయములు కాగా, "మందరము" పిఱుదైనది. దానిలోని మొదటి అక్షరము చ్యుతము కాగా, 'దరము"=శంఖము కంఠమైనది. ఆ "దరము" వ్యత్యయము కాగా "రదము"=ఏనుగుదంతము,నవ్వైనది-"నవ్వు" ఏనుగుదంతమువలె తెల్లగామన్నదని భావము, ఈ పద్యములో, దత్తములు, చ్యుత

ములు, బిందుదత్త చ్యుతములు, వ్యత్యయములును వాడబడి, ఒకానొక విచ్ఛిత్తి విశేషమును కలిగించుచున్నవి.

ఈ విధముగా ప్రాచీన సంస్కృతాంధ్ర వాఙ్మయ సముద్రమును మథించినచో ఇట్టి పద్యరత్నములు ఇంకను వెలువడవచ్చును. ఇట్టివి శ్రీ వేణుగోపాలరావుగారికి స్ఫురింపకకాదు. గ్రంథవిస్తరణభీతిచే, విడిచిపెట్టి యుందురు.

సూరపనేనివారు ఇట్టి పద్యరత్నముల నెన్నిటినో కూర్చి, ఈ గ్రంథమును సంతరించినారు. ఈ లక్ష్యలక్షణములు, ఉదాహరణములు, ఏ ఒక్క గ్రంథము నందును లభించునవి కావు. తుమ్మెదలు పూవు పూవునకు తిరిగి, తేనెను కూడబెట్టి నట్లుగా, వీరు వీనిని పెక్కు గ్రంథములు పరిశోధించి, సంకలనముగావించినారు. సులభమైన తెలుగుటీకతో, ఈ గ్రంథము రచింపబడుటచే, ఈ పద్యములలోని రహస్యములు, అవగతములగుచున్నవి గాని, మూలశ్లోకములను మాత్రమే పఠించినచో, ఆ పద్యములందలి సొగసులు సామాన్యపాఠకులకు గోచరము కావు.

శ్రీ వేణుగోపాలరావుగారు సాహిత్య విద్యాప్రవీణులై, ఆంధ్రభాషా ప్రవీణులై, M A., పట్టభద్రులగుటయేకాక, ఆంగ్ల, హిందీ సాహిత్యమునందలి మర్మములుకూడ తెలిసిన మనీషులు. అందువలననే ఈ గ్రంథములో సంస్కృతాంధ్ర సాహిత్యములేకాక, ఆంగ్ల, హిందీ భాషలలోని గూఢ చిత్రాలంకారములుగల పద్యముల నుదాహరించి, వివరింపగలిగిరి. ఇట్లే, 'ప్రశ్నోత్తర చిత్రాలంకార'మను మొదటి భాగములోకూడ, తమిళము, కన్నడము, మలయాళము హిందీ, గుజరాతీ, ఓఢ్రము, మహారాష్ట్రము, మొదలగు భాషలలోని ప్రశ్నోత్తర చిత్రాలంకారములు గల పద్యములను ఉదహరించుట పాఠకులకు తెలిసిన విషయమే. ఇది యంతయు, వీరు పాఠశాలల యందు, కళాశాలలయందును, ఏబది సంవత్సరముల బోధనానుభవముతో, నిరంతర సాహిత్య గ్రంథ పఠన పాఠనముల తపస్సు వలన కలిగిన ఫలితమని వీరి గ్రంథములను ఆమూలాగ్రముగ పఠించిన ప్రతివారికి, తెల్లముకాక మానదు.

ఈ గ్రంథ ముద్రణమునకు ధనసాహాయ్యముగావించిన, వదాన్య శిరోమణులు శ్రీ బులుసు మణిగారు. వీరు సుప్రసిద్ధవేదశ్రౌత పండితులైన, బ్రహ్మశ్రీ బులుసు వెంకప్ప సోమయాజులుగారు, బ్రహ్మశ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారు జన్మించిన 'బులుసు' వంశములో పుట్టి, తమ జన్మమును పవిత్రము చేసికొనిరి. పాపయ్యశాస్త్రిగారనగా —

వేదముల కర్థమును చెప్పనుర్వియందు-
బులుసు పాపయ్యశాస్త్రికే పోలుగాక"

అని, శతావధానులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిచే పొగడ్త గొందిన మహామహులు, ఇంక మన బులుసు మణిగారు 'ఆశ్వలాయన శ్రౌత సూత్రము' 'ఇష్టసిద్ధి' మొదలగు శతాధిక సంస్కృతాంధ్ర గ్రంథములను ప్రకటించి, వెలుగు లోనికి తెచ్చిన మహామహులు. అనేక వేదశాస్త్ర పండితులకు ప్రతి సంవత్సరము వేద సభలలో చేతికి ఎముక లేకుండ, ధన దుకూలాదులతో సత్కరించి, ప్రాచీన సంస్కృతిని పోషించుచున్న ఉదార స్వభావులు అట్టి మనస్వి ఈ 'యశస్వి' రచించిన గ్రంథమునకు 'కృతిపతి' యగుట.

"మణినా వలయం వలయేన మణిః"

అను వాక్యమును అన్వర్థ మొనర్చుచున్నది.

పోతన యంతటి పరమ భక్తకవి రచించిన భాగవతములో
"పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి...." భాగ, 8-65.

అనెడి పద్యములో 'మాఱాకు' అనుచోట 'రా'కు 'మా'ను హత్తించి, అనగా 'రామ' నామమును జపించి, (శ్లేషలో, రేఫశకటరేఫముల వివక్షణ ఉండదు) అను అర్థము పౌరాణికులు చెప్పుచున్నారన్నచో, ఈ గూఢచిత్రాలంకార మెంత గొప్పదో, పాఠకులు పరిశీలింతురుగాక!

ఇతోధికముగ, బంధ-గర్భ-చిత్ర కవిత్వాలను గూర్చి, తక్కిన భాగములను కూడ పూర్తిచేసి, ప్రకటించుటకు శ్రీ సూరపనేని వేణుగోపాలరావుగారికి, ఇట్లే, ఇతోధికముగ, పండితులనాదరించి, తమ అమూల్య ధనసహాయముతో అనేక గ్రంథములను వెలుగునకు తెచ్చుటకు బ్రహ్మశ్రీ బులుసుమణిగారికి, ఆ పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములనుప్రసాదించుగాక! అని ప్రార్థించుచు, ఇంతటితో ముగించుచున్నాము

ఇట్లు

గరిమెళ్ళ అచ్యుత సత్యశేషగిరి సోమయాజులు శర్మ
'సహజ పాండిత్య' 'తర్కకోవిద' 'విద్యా విభూషణ'
M.A (సంస్కృతము); M.A (తెలుగు); M.A (దర్శనములు)

# మాన్యతమః శ్రీ బీవియస్సెస్ “మణిః”

శ్లో. 1. విద్వ ద్వృన్ద గుణానురూప విభవ త్యాగైక కల్పద్రుమ!
గామ్భీర్యేణ, మహాశయేన, శరణత్రాణేన, మర్యాదయా,!
సర్వార్థాన్ పరి పూరణేన, మహతా స్థైర్యేణ, ధైర్యేణ చ,
సూర్య! త్వా మనుకర్తు మిచ్ఛతితరాం వారాంనిధిః, కింతతః?॥

2 యాగై ర్దేవ గణాన్, ధనై ర్బుధగణాన్, మానై స్తథా బాన్ధవాన్,
న్యాయ్యైః పౌరజనాన్, వధూగణ మథ ప్రేమ్ణాచ సమ్మానయన్।
పుత్రైః పౌత్రగణైః సుఖా న్యనుభవన్, “భవ్యాన్ కవీనాంకృతీః”,
శ్రీమన్! వేఙ్కటసూర్య! సుమతే! జీయా స్సమానాం శతమ్॥

3. సమ్పత్తే సదనే సదా విహరతాం, విత్తే చ చిన్తామణిః,
స్వర్ధేను స్తవ చత్వరే, సురతరు శ్చారామభూమౌ తవ।
వాణీ తే వదనే, దయా నయనయోః, దానం కరే ప్రత్యహమ్,
ఆయు స్తే శరదాం శతం, విజయతాం! “దానాయ దీనార్థినే’ ॥

4. పక్షపాతో న యస్యాస్తి-న చ శాస్త్రవిలఙ్ఘనమ్,ఽ
నా సత్యం న చ వైరస్యం--స జీయా చ్ఛరదాం శతమ్॥
విద్యా వినయ సంయుక్తం విశ్వదం విమలాశయమ్।
వన్దే వేసూ సు మణ్యాఖ్యం భక్తి ప్రణత చేతసా॥

శ్రీ బులుసు వేఙ్కట సూర్య సుబ్రహ్మణ్య-‘మణి’ అభిజనము విజయవాడ (1927 సం॥) శ్రీమన్ ‘మణి’ అనేక జాతీయ, అంతర్జాతీయ ఇంజినీరింగ్, ఇండస్ట్రీస్ మొ॥ సంస్థలకు, ట్రస్టీ, ఉపాధ్యక్ష, అధ్యక్ష పదవుల నధిష్ఠించి, సేవించిన విఖ్యాత కర్మణ్యులు. త్యాగరాజ, కూచిపూడి, కళా-సాగర, భారతీ, రసిక రఞ్జని, సచ్చిదానన్ద శృంగేరి పీఠాది, అనేక సంగీత, సాహిత్య, ధార్మిక, సంస్థలకు ఆధ్వర్యవం వహించి కొన్ని విశ్వవిద్యాలయాలలో, వైష్ణవ, అద్వైత వార్షికోపన్యాస కర్మ(లకు) సాక్షి.

అనూదాన “స్వధర్మ స్వారాజ్య సంఘ డైరెక్టర్’ గా, వేద, వేదాన్తవేత్త లకు, కవి పండిత ప్రవరులకు భూరి గుప్త దానధర్మాదులతో, సత్కరించి, సంస్కృత సంస్కృతాంధ్రాది గ్రంథాలనెన్నింటికో, ఇహలోకయోగం గల్గించిన సూర్యమణి.

‘అనన్యార్తి ప్రశమన ఫలా స్సమ్పదో హ్యాత్తమానాం, ఈవిగల దొరయె దేవుడు...”ఇత్యాది సువర్ణ సూక్తులకు సుమూదాహరణ మణి భాసుర భూసుర ‘బులుసు’ వంశాభోధి చన్ద్రమణి, సచ్ఛీల, సాహిత్య, సౌహిత్య, సౌజన్య, సుగుణ గణాళి.

ఇది అత్యుక్తి లేని, స్వభావోక్తియుక్త ఆదర్శ ‘మణి’ పరిచయ సఙ్గ్రహము.

# విషయసూచిక (సంస్కృతమ్)

'చ్యుతదత్త చిత్రచన్ద్రిక' సంస్కృత పద్యానుక్రమణిక.

### హిన్దీలో 'చ్యుతదత్త చిత్రములు'



### పాశ్చాత్య ఆంగ్లాది భాషలలో 'చ్యుతాది చిత్రాలు'



—o—

# 1. సంస్కృత చ్యుత - దత్త - చిత్రాలంకారములు

ఇవి 'చిత్రాలఙ్కారప్రస్థానం'లో, ఒక తెగకు చెందిన 'ప్రక్రియలు'గా ప్రత్యేక ప్రతిపత్తిని ప్రతిష్ఠింపుకొన్నవి. ఆదికాలం నుండి వేదోపనిషచ్ఛాస్త్రాగమ పురాణాలలో, రామాయణ భారత భాగవతాది గ్రంథాలలో, బీజరూపంగానున్న, ఈ చిత్రాలంకారాలను, తర్వాతి కవులు పవిత్రంగా, విచిత్రంగా, అద్భుతంగా, చమత్కృతిమచ్చిత్రాలుగా చిత్రిస్తూనే వస్తున్నారు. వస్తుతః, వాని అర్థాలను అవగాహనం చేసికొని, ఆనందించుటకు, జ్ఞానతృష్ణ, విద్యాపై శారద్యం, సమయస్ఫూర్తి, శబ్దాధికారం, వ్యాకరణ వ్యాయామం, పాండిత్య ప్రకర్షాదులు ప్రకటంగా ప్రజ్వలితాలు కావలసియున్నవి. వానిలో అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని, చమత్కారాన్ని, చర్చించటంచేత గూడ, అవి అందరికీ అందుబాటులోనికి రాలేకపోయినవి. అయినను, పదుమంతర కాలమున, నానావిధముల నడుము కట్టుకొని, మధ్యయుగం నాటి పూర్వ రాజాస్థానాలలో, సరస్వతీ సదనాలలో, కావ్య ప్రబంధ శాస్త్రాలాపాలతోపాటు, క్రీడా గోష్ఠి వినోదాలలో సభాస్తారులను, విశేషంగా విద్వజ్జనులను ఆకర్షించి, చర్చింపబడుతూనే వస్తున్నాయి—అని మహాకవి బాణభట్టుని భణితి.

చారుచిత్ర నిరీక్షణం కావాలనుకొన్న ప్రతికని – 'గోష్ఠిప్రహసనజ్ఞత, పరోన్మేషజిగీష, వ్యుత్పత్త్యై సర్వాశిష్యత, ఇంగితాకారవేదిత్వం, పరాక్షేప సహిష్ణుత్వం, ధిషణాకషణం.... మొదలగు పాటులన్నీ పడితేగాని, ప్రాప్త గిరాం ధురంధరుడు కాలేకపోయేవాడట. అసలు ఆ గోష్ఠులలో పాల్గొనని కవులు కళంకితులుగా, వారి కావ్యాలు కావ్యాభాసలుగా భావింపబడేవంటే, ఇంకా ఏమి చెప్పాలి?

# చ్యుత - దత్త - చిత్ర చరిత్ర

ప్రథమాలంకారికులగు భరత, భామహ, వామనాదులు ఈ చిత్రలంకారాలను, తత్రాపి, ఈ 'చ్యుత-దత్త-చిత్రా'లంకారాలను గూర్చి చర్చింపలేదు. ఆచార్యదండి, ఈ చిత్రలంకార చర్చలో 'మార్గదర్శి మహర్షి' యైనవాడే, కాని, సర్వప్రథమంగా ఈ చ్యుత దత్త చిత్రాలను చర్చించి, విస్తృత వ్యవస్థిత వివేచన చేసిన మహా విద్వాంసుడు మాత్రం రుద్రటాచార్యుడే.

శ్లో॥ మాత్రాబిన్దుచ్యుతకే ప్రహేలి(ళి)కా కారక క్రియాగూఢే
ప్రశ్నోత్తరాది చాన్యత్ క్రీడా మాత్రోపయోగ మిదమ్
....మాత్రాబిందు చ్యవనాత్-అన్యార్థకత్వేన తత్ చ్యుతో నామ॥
రు. కా. 5. 24,25

మాత్రా, బిందు చ్యుతకములు, ప్రహేలి(ళి)కలు, కారక-క్రియాగూఢములు, ప్రశ్నోత్తరాదులు....మొత్తంమీద, ఇవీ, ఇంకా ఇతరములు అన్నీ, శబ్దాది క్రీడల ద్వారా, ఆయా విద్వాంసుల మెదడుకు మేత నందించి, ఆలోచనాలోచనాలను ఆవిష్కరించి, సమస్యల్ని సమాధానంగా పరిష్కరించి, బుద్ధి నైశిత్యాన్ని పెంపొందిస్తూ, కాలక్షేపాన్ని కావిస్తూనే వస్తున్నాయి.

ఒకచోట 'మాత్రనుగాని, బిందువు(ం)నుగాని, చ్యుతం చేయుట (తొలగించుట, మార్చుట ...) వలన, మరియొక అర్థము ప్రతీయమానమైనచో, అది, ఆయా "చ్యుత"మను పేరుగల చిత్రాలఙ్కారములగును' అని,ప్రతిపాదించి, ప్రత్యేకంగా వాని లక్షణాలను చెప్పకపోయినను, రుద్రటాచార్యుడు ఉదాహరణములను మాత్రమిచ్చెను.

అగ్నిపురాణకారుడు మాత్రం తొమ్మిది శబ్దాలంకారముల నుద్ఘాటించి (1), వానిలో నెనిమిదవదగు, ఈ చిత్రాలంకారము ప్రశ్న, ప్రహేలికా, గుప్త, చ్యుత, దత్త, చ్యుత-దత్త, సమస్యా భేదాలతో సప్త (7) విధములైనవని వివరించి, (2) పిమ్మట,పై ఈ 'చ్యుత-దత్త-చ్యుత దత్త' చిత్రముల నిట్లు వివరించెను.

1. ఒక వాక్యాంగము యొక్క చ్యుతి వలన, అన్యార్థ ప్రతీతి జరిగి, ఆ చ్యుత

వాక్యాంగము యొక్క ఆకాంక్ష సంబంధము కూడ నిర్వహింపబడినచో, అది 'చ్యుత' చిత్రమగును.

2. అట్లే, ఒక వాక్యాంగము దత్తము చేయబడుటవలన, అన్యార్థ ప్రతీతితో పాటు, దాని ఆకాంక్ష సంబంధము కూడ నిర్వహింపబడిన 'దత్త చిత్ర' మగును.

2ఎ. మరల, ఈ 'చ్యుత-దత్తము'లు రెండును, 'స్వర, వ్యంజన, బిందు, విసర్గల' యొక్క 'చ్యుతి' వలన, అట్లే, 'దత్తత' వలన కూడ, క్రమంగా, ఒక్కొక్కటి నాలుగు విధము లగుచున్నవనియు చెప్పెను. (3)

3. అంతేకాక, మొదట అక్షరచ్యుతి జరిగిన దాని స్థానమున, మరియొక వర్ణము దత్తమై అన్యార్థము కూడ ప్రతీతమైనచో, అది 'చ్యుత దత్తాక్షర చిత్ర' మగునని వివరించెను. (4)

(1) ....వాకోవాక్య మనుప్రాసః 'చిత్రం' దుష్కరమేవచ।
జ్ఞేయా నవాలంకృతయః శబ్దానా మిత్యసంకరాత్॥ అ. పు. 342-20,

(2) గోష్ఠ్యాం కుతూహలాధ్యాయీ-వాగ్బంధః 'చిత్ర' ముచ్యతే
ప్రశ్నః, ప్రహేలికా, గుప్తం, చ్యుత, దత్తే, తథో భయమ్।
సమస్యా సప్త తద్భేదాః నానార్థస్యానుయోగతః అ.పు. 343-22, 23,

(3) యత్రార్థాంతర నిర్భాసో వాక్యాంగ చ్యవనాదిభిః।
తదంగ విహితాకాంక్షః తత్'చ్యుతం' స్యా చ్చతుర్విధమ్।
స్వర వ్యంజన బిందూనాం విసర్గస్య చ విచ్యుతేః
దత్తేఽపియత్ర వాక్యాంగే ద్వితీయోఽర్థః ప్రతీయతే।
'దత్తః' తదాహుః తద్భేదాః - స్వరాద్యైః పూర్వవన్మతాః।
అ. 343-27, 28, 29,

(4) అపనీతాక్షరస్థానే న్యస్తే వర్ణాన్తరేఽపి చ
భాసతేఽర్థాంతరం యత్ర "చ్యుత దత్తం" తదుచ్యతే॥ 343-30

పిమ్మట, రుద్రటాలంకార - టీకాకారుడగు న[మే]మిసాధువు, పైవాని నన్నిటిని, ప్రత్యేకాలంకారములుగ పరిగణింపక, పూర్వభేదాలలోనే అంతర్గతాలు చేసెను.

ఇక, భోజమహారాజు, 'ఈ చ్యుత భేదా'లను ప్రత్యేకాలంకారములుగ, పరిగణింపక ప్రహేలికా భేదాలలోనే చేర్చెను.

శ్లో॥ ప్రహేళికా సకృత్పృచ్ఛాః సాపి షోఢా చ్యుతాక్షరా।
దత్తాక్షరో భయం ముష్టిః బిందు మత్యర్థవత్యపి    స.కం. 2-133

"చ్యుతాక్షరా" దత్తాక్షరా, చ్యుత దత్తాక్షరా, ముష్టి, బిందుమతి, అర్థవతి'-అను ఆరు ప్రహేళికా భేదాలలో, భోజదేవుడు వీనిని పేర్కొనెను.

'కావ్యానుశాసన'కర్త, ఆచార్య హేమచంద్రుడు వీనిని 'చిత్రభేదము'గా నంగీకరించి, "చ్యుతం మాత్రార్ధమాత్రా బిందు వర్ణగతత్వేన చతుర్ధా"- [హే. కా. 5. 4] ఈ చ్యుతము మాత్రా, అర్ధమాత్రా, బిందు, వర్ణ-గతమగుటచే 4 విధాలని, వివరించినాడుగాని, తల్లక్షణాలను హేమచంద్రుడు కూడ చెప్పలేదు.

"మాత్రా బిన్దు వర్ణాది భేదైశ్చ్యుతమనేకధా" [వా. కా. 4-1 కి వృత్తి] అనగా మాత్ర, బిందువు, వర్ణము ...మొదలగువానితో నీచ్యుతము, అనేకవిధాలని, వాగ్భటాచార్యుడు [ ] కూడ వక్కాణించి, పద్య చరణాలలో, ఈ 'అక్షరాది చ్యుతి' కారణంగా, 'ఛందః పరివర్తన' కూడ జరిగినచో, 'గర్భకవిత' కావచ్చునని సూచించెను.

ఇక, మమ్మట, రుయ్యక....ఆది ఆలంకారికులు వీనిని పూర్తిగా విడిచి పెట్టినను, విశ్వనాథుడు మాత్రం "ఉక్తివైచిత్ర్య మాత్రం సా చ్యుతదత్తాక్షరాదికా" [సా. ద. 10-14]—ఈ 'చ్యుత-దత్త- అక్షరాది ప్రహేళికా భేదచిత్రములు అలంకారములు, కావు 'ఉక్తివైచిత్ర్య మాత్రము'లే అని ఉద్ఘాటించెను.

తర్వాత వచ్చిన ఆలంకారికులు కొందరు, ఈ 'చ్యుత-దత్త' చిత్రములను గ్రహించినను, వీనికి ప్రత్యేకంగా, నవీన లక్షణాలనుగాని, ఉదాహరణములనుగాని ప్రదర్శింపలేదు.

అనంతరం, అమర చంద్రయతి మాత్రం, తన 'కావ్య కల్పలతా వృత్తి' [103-104 పుటలు]లో, వాగ్భటుడు చెప్పిన 'భిన్న ఛందో నిర్మాణము'ను పల్లవితం చేసెను. శ్లేషసిద్ధి కతడు చేసిన నిర్దేశాలవలన, ఈ చ్యుతచిత్రమున అనేక నవీన భేదము లేర్పడుటకు వీలైనది. ఎట్లనగా —

1. పూర్వాక్షరలోపం - ఉదా. 'త్రిదశాభోగః'లో పూర్వాక్షరం 'త్రి'లుప్తం కాగా, 'దశాభోగః' మిగులును.
2. ద్వితీయాక్షరలోపం-'కపాలిశ్రీ'లో 2వ అక్షరం 'పా' లుప్తం కాగా, "కలిశ్రీ" మిగులును.

3. మధ్యాక్షరలోపం-'కమలం'లో మధ్యనున్న 'మ' లుప్తమైతే, 'కలమ్' మిగులును.

4 ఉపాన్త్యాక్షరలోపం-'దానవశ్రీ'లో ఉపాంత 'వ' లుప్తంకాగా, 'దానశ్రీ' మిగులును.

5. మాత్రాలోపం - 'కాలస్థితిః'లో 'ఆ' మాత్రను తీస్తే, 'కలస్థితిః' మిగులును.

6 మాత్రాధిక్యం—'కేవలజ్ఞానం'లో ఒక మాత్రను 'దత్తం' చేస్తే, 'కేవలా జ్ఞానం' ఔతుంది.

7. అతిక్రాన్తక్రమం-'భారతీస్థితిః'లో, అక్షరాతిక్రమణంచేస్తే 'తీరభాస్థితిః' ,,

8. వలితక్రమం-'హోతపైభవః'లో క్రమాన్ని మారిస్తే, 'తపోపైభవః' ,,

9. కేవలాక్షర ప్రయోగం—ఇది మూడు విధాలు. ఎట్లన—కేవలాక్షరానికి —

క. ఆదిలోనున్న లఘువును 'గురువు'గా చేయుటవలన ఉదా : 'కరకస్థితిః' లో మొదటి లఘువగు 'క'ను గురువుచేస్తే, 'కారకస్థితిః' కాగలదు.

ఖ. అట్లే, మధ్యలో నున్నదానిని గురువుచేయుట. ఉదా : 'కృపణస్థితిః'లోని 'ప' గురువుకాగా, 'కృపాణస్థితిః' కాగలదు.

గ. చివరిదానిని గురువుచేస్తే—'కమలస్థితిః'లో అంతమందున్న 'ల' గురువై 'కమలా స్థితిః' కాగలదు.

ఇట్లే, ఆది, మధ్య, అన్త్యాలలో, మొదట 'గురువులు'గా నున్న వానిని, క్రమంగా 'లఘువులు' చేయుటవలన, మరొక మూడు భేదాలు కాగలవు.

ఈ పద్ధతిలోనే, వీనిని మించిన అనేక నవీన భేదాలను, ధర్మదాససూరి ( శ), అజితసేనాచార్య, చక్రకవి (17 శ) విశ్వేశ్వరాదులు తమ గ్రంథాలలో చిత్రించినారు.

# రుద్రటాచార్య - మాత్రాచ్యుతకమ్

"నియత మగమ్య మద్రవ్యం భవతి కిల త్రస్యతో రణోపాన్తమ్" రు. కా. 5-28. త్రస్యతః = భయపడువానికి, రణ + ఉపాన్తం = యుద్ధ = సామీప్యము, అగమ్యమ్ = వెళ్ళరానిది, అద్రవ్యం = యోగ్యము కానిది — కూడ అగుట, నియతం-కిల = నిత్యము ఉన్నమాటయే కదా.

పిరికిపంద యుద్ధం పేరు చెప్పినంతనే, భయపడి, వణకిపోవునని భావము.

ఇక్కడ 'కిల' శబ్దం వలన, 'కదా.' అను ఒక అర్థం వస్తోంది. కాని, ఆ 'కిల'లోని 'ఇ'కారమును స్యుతం చేయుట [కోసి వేయుట] వలన, 'కల'గా మారి, మిగులుతోంది. ఈ 'కల'ను ప్రక్కనున్న అక్షరాలతో కలిపిన, 'కలత్రస్య ...' కాగా. 'భార్యతో సుఖించువానికి. యుద్ధం పేరు చెప్పినంతనే, ముచ్చట్ల [మూడు చోట్ల] చెమటలు పోస్తాయి'. అను రెండవ అర్థం కూడ ప్రత్యక్ష మౌతుంది. 'కిల' లోని 'ఇ' [హ్రస్వం] ఏకమాత్రగలది 'స్యుత'మగుటవలన, ఇది 'మాత్రాస్యుతక' మైనది.

N. B. [గమనిక] ఇక్కడ 'కిల' (క్+ఇ—ల్+అ) లోని 'ఇ'ని తొలగించిన, 'క్+ల్+అ' మిగులగా, 'కల' ఎట్లౌతుంది ? అని ఒకప్రశ్న రావచ్చును.

మాత్రాది స్వరములను తొలగించిన పిమ్మట, మిగిలిన, కేవలము 'హల్' [క్,చ్,ట్....] మాత్రమును పల్కుట, కష్టసాధ్యమగుటచే, ఉచ్చారణ సౌకర్యము నకై, మిగిలిన ప్రతి హల్మాత్రమునకు 'అ'కారమును చేర్చి, [క-చ-ట—] గా పలుకుట పాటింపదగిన సంప్రదాయమని, పూర్వులు, 'నమిసాధువు' మొదలగు వారును నొక్కి, వక్కాణించినారు. అన్యవర్ణ సాహాయ్యము లేకుండ అచ్చులను ఉచ్చరించవచ్చునుగాని, హల్లులను మాత్రము అచ్చుల సాయము లేనిదే పలుక జాలము. కనుకనే, అచ్చులను, అచ్చులతో గూడిన హల్లులను, అక్షరములు [ = Sy lables] అని చెప్పినారు. 'మాత్ర' యనగా—

శ్లో 1 ఏకమాత్రో భవేత్—'హ్రస్వః'—ద్విమాత్రో 'దీర్ఘ' ఉచ్యతే।
త్రిమాత్రస్తు 'ప్లుతో' జ్ఞేయః-'వ్యంజనం' త్వ[తు+అ]ర్ధ మాత్రకమ్॥

2. చాషో రౌత్యేక మాత్రం హి—ద్విమాత్రం రౌతి వాయసః।
త్రిమాత్రం తు శిఖీ రౌతి—నకుల స్త్వర్ధమాత్రకమ్ ।

1. ఏకమాత్రాకాలము—అనగా 'అ' అని ఉచ్చరించునంతటి [సుమారుగా ఒక చిటికె లేక రెప్పపాటు] కాలమును 'హ్రస్వము' అనియు, అట్లే, 'ఆ' ( = అ+అ) అని ఉచ్చరించునంతటి రెండు మాత్రల కాలముగలదానిని 'దీర్ఘము' అనియు, మూడు మాత్రలు గల్గిన 'ఆ3' [అ+అ+అ] కాలమును "ప్లుతము"

అనియు, పై వ్యాకరణులు వచించిరి. ఈ 'అ'కారాదులు కలుపని. కేవల హల్లులు అనగా క్, చ్, ట్ .... మొదలగునవి, 'వ్యంజనములు అర్ధమాత్రాకము' లన బడును. ఒక హల్లునకు క్రమంగా 'అ-ఆ-ఇ-ఈ ....' ఇత్యాది అచ్చులను కలుపుట వలన, క్+అ = క, క్+ఆ = కా, క్+ఇ = కి, క్+ఈ = కీ ..." ఇత్యాదిగా నేర్పడినదే 'గుణితము'గా పరిగణింపబడినదని, పాఠక మహాశయులు గ్రహింప గలరు.

1. వ్యంజనము (హల్లు)నకు స్వరము (అచ్చు) చేర్చినగాని, ఉచ్చరింప బడదు. కనుక, దానికి, మాత్రాగణనము నిరుపయోగమని కొందరు భావించినారు. ఇక. ప్లుతము (3 మాత్రలు గలది) గురువుగానే ఎన్నబడును ∴ మాత్రా పరిమాణము అచ్చునుబట్టియేగాని, హల్లునుబట్టి చెప్పరాదు.

2 పాలపిట్ట కూత ఏకమాత్రగలది. కాకి కూత "కాకా" రెండు మాత్రలు గలది. నెమలి కూత మూడు మాత్రలు గలది. ముంగిస కూత "అర్ధమాత్రకము" అని కూడ, ఆనాటి వ్యాకర్తలు వ్యాఖ్యానించిరి.

# "విదగ్ధముఖమండన" కర్త 'ధర్మదాససూరి'

## (11 శ. పూర్వార్ధం) నిర్వచనము

శ్లో. అన్యోఽప్యర్థః స్ఫుటో యత్ర-మాత్రాది చ్యుతకేష్వపి
ప్రతీయతే విదుః తద్-జ్ఞాః-తన్మాత్రా చ్యుతకాదికమ్। వి. ము.4-58

యత్ర = ఏ ప్రశ్నలో, మాత్రా+ఆది, – చ్యుతకేషు+అపి = మాత్ర మొదలగువాని–చ్యుతి (తొలగింపు, మార్పు, నాశము ..) జరిగినపుడు కూడ, అన్యః+అర్థః+అపి = మరియొక–అర్థము- కూడ, స్ఫుటః - ప్రతీయతే = స్పష్టముగా-వ్యక్తీకరింపబడినచో, తద్-జ్ఞాః = ఆయా మాత్రాదిచ్యుతకముల - నెరిగిన పండితులు, తత్ = దానిని, మాత్రాచ్యుతక+ఆదికమ్ - మాత్రాచ్యుతకము .... మొదలగువానిగా, విదుః-తెలిసికొనుచున్నారు.

గమనిక – దీనిలో "చ్యుతకా"ది సామాన్య లక్షణము మాత్రమే చెప్పబడి నందున, అది శబ్దముచే, బిందు, విసర్గ, అక్షర, స్థాన, వ్యంజన ...చ్యుతకము"లను గూడ గ్రహింపవలెను.

# మాత్రాచ్యుతకమ్
(Dropping of Full Syllable)

శ్లో॥ మహాశయ మతిస్వచ్ఛం నీరం సన్తాపశాన్తయే
ఖలవాపా దతిక్రాన్తాః సమాశ్రయత హేజనాః॥ వి.ము. 4-5

ఖలవాపాత్ - అతిక్రాన్తాః = (వేసవిలో పగలంతయు) భూమిమీదనో, కళ్ళములోనో పనిచేసి, అతిగా అలసి సొలసిన, హేజనాః = ఓ ప్రజలారా! సన్తాప-శాన్తయే = ఆ వేసవి వేడిని, శ్రమను-పోగొట్టుకొనుట కొరకు, మహా + ఆశయం = గొప్ప-ఆధారమైన [లోతుగానున్న], అతిస్వచ్ఛం - మిక్కిలి ఎవి శ్రమ లేక నిర్మలమైన, నీరం = నీటిని, సమ్ - ఆశ్రయత = బాగుగా సేవింపుడు.

వేసవి కాలంలో, పగలంతా కళ్ళంలో కష్టపడిన ప్రజలారా! ఆ వంతా పోన్ని పోగొట్టుకొనుటకు, మహా - అధారము, స్వచ్ఛమునైన జలాశయము (చెరువును) సేవించండి.

ఇక్కడి "నీరం" [= న్+ఈ-రం]లోని, 'ఈ'ని ద్యుతంచేసి [తీసి]న [దాని స్థానమున, వ్యాకర్తల నియమం ప్రకారంగా "అ" ఉంచిన,] "నీరం" పోయి, "నరం" [= మనుష్యుని]గా మిగులును. తత్ఫలితంగా, ఈ శ్లోకానికి వచ్చిన రెండవ అర్థం -

ఖలవాసాత్ - అతిక్రాన్తాః = దుర్జన సహవాసమువలన - మిక్కిలి విసుగు చెందిన, హేజనాః = ఓ ప్రజలారా! సన్తాపశాన్తయే = (ఆ - సహవాస) మనో వ్యథను—పోగొట్టుకొనుటకై, మహా+ఆశయం = ఉదార - అభిప్రాయములుగల్గి, అతిస్వచ్ఛం = పరమ పవిత్రుడైన, నరం = మానవుని, సమాశ్రయత = సేవించుడు.

చెడు సావాసంతో చేటు నొందిన జనులారా! మహోదారుడు, పవిత్రుడు నగు, అనర్ఘమానవుని ఆశ్రయించి, మీ బాధను పోగొట్టుకొనుడు.

"నీరం"లోని ద్విమాత్రక- దీర్ఘమగు "ఈ"ను చ్యుతం చేసి, ఉచ్చారణ సౌకర్యమునకై "అ"ను చేర్చుట వలన, "నరం" కాగా, పై రెండవ అర్థం

లభించినది. పూర్వోదాహరణమున, ఏకమాత్రాచ్యుతితో, 'కిల'-'కల' — కాగా, ఇకారిత, ద్విమాత్ర-దీర్ఘమునగు 'ఈ'చ్యుతమై, 'వీరం' - 'వరం'గా మారటం విశేషము.

∴ ఇదొక మాత్రాచ్యుతకము.

**N. B.** ఇట్లే, మాత్రా-బిందు-విసర్గ-అక్షర-స్థాన-వ్యంజన ... అది చ్యుత కములలో, ఉదాహరింపబడిన, ఇంకను ఉదాహరింపబడనున్న శ్లోకస్థ - పదము లందలి మాత్రలు, బిందువులు....మొదలగునవి, శ్లేషాదుల మాహాత్మ్యంతో, రెండు అర్థాల నిచ్చుటకు వీలుగా, ప్రయోగింపబడినవని, చ్యుతాది ప్రయోగానంతరం 'అర్థాంతరం' రాకపోతే, చ్యుతాదుల ఉనికియే ప్రశ్నార్థకమై వ్యర్థమగునని కూడ గమనింపవలెను. మరియు, పాఠక ప్రభువుల ఉత్కంఠను, ప్రజ్ఞను, ప్రఖ్యాతము, ప్రభావితము, చమత్కృతము చేయుటకై, విస్తరభీతికి వెరచినను, అనేక - జ్ఞాత, అజ్ఞాత మహాకవులనైకవిధ - గ్రంథాల నుండి కూడ, అన్వేషించి, పరిశోధించి, చమత్కార చారువులు, విభిన్న వైచిత్ర్యము గలవియునగు, అనేక శ్లోకములను సేకరించి, అర్థతాత్పర్యములతో, పాఠకులకు అవసరమైనంతవరకు అన్వయించి, సమర్పింపబడుచున్నందున, పాఠకులు ప్రాణమూలక, శ్రమకోర్చి, ఆయుర్వేద - 'రసాయన'మను మందును వలె, వానిని కూడ. క్రమంగా, సేవించి, ఆనందించి, సప్రశ్రయముగ, ఆదరించి, అనుగ్రహింప ప్రార్థితులు.

ఆచార్య విశ్వేశ్వరుడు (17 శ.) 'కవీంద్ర కణ్ఠాభరణ' గ్రంథమున విశ్లేషించిన, ఈ 'చ్యుత చిత్రము' యొక్క, నవీన భేదాలను, వాఙ్మయముగా పరిశీలించండి.

శ్లో. యత్ర త్యాగేన మాత్రాదేః అన్యోఽ ప్యర్థః ప్రతీయతే!
తత్తత్పంజ్ఞ మనాసన్నం స్థాన(o)చ్యుతక మిష్యతే    క. క. 4-5

యత్ర—మాత్రా+ఆదేః-త్యాగేన=ఏ శ్లోకాలలో-మాత్ర .... మొదలగువాని యొక్క — విడిచిపెట్టుటవలన. అన్యః+అర్థః+అపి=మరియొక - అర్థము కూడ, ప్రతీయతే=తోచుచుండునో, అనాసన్నం-స్థానం=ఆ పదాలు 'ఆసక్తి'రహితములై,

ఆశ్రమ స్థానాలను అతిక్రమించి యుండుటచేత, తప్-తత్-సంజ్ఞం-ఇష్యతే=అ-నూ ప్రయుక్త ప్రదేశముల ననుసరించి 'అనూప్యతము'లను పేరుతో - ఇష్టముగా పిలువబడుచున్నవి—అని 'చ్యుతజాతి' సామాన్య లక్షణమును విశ్లేషించెను.

ఇక్కడ, విశ్వేశ్వరు డిచ్చిన, తాత్కాలిక — ఉదాహరణము - 'గిరి ర్భుక్త మగ్నిమాన్ దేవదత్తేన' [అనువది] = దీనికి - దేవదత్తునిచే నిప్పుతో నిండిన పర్వతము మ్రింగబడినది' - అని అర్థం. కాని, ఆ అర్థం ఎలా సరిపోతుంది ? కనుక. ఈ వాక్యము 'అనాసన్నము' [ఆసత్తి రహితము]. దీనిలోని పదాలు అన్వయానుకూలముగ. దగ్గరగా లేవు. కనుక 1. దేవదత్తేన — భుక్తం 2. గిరి — 'అగ్నిమాన్' (=1 దేవదత్తునిచే—భుజింపబడినది, 2. పర్వతము నిప్పుతో నిండి యున్నది)—అని, కలగూరగంపగా, వాక్యంలో కలిపియున్న పదాలను, అన్వయాను కూలముగ మార్చి, చెప్పుకొనినచో, 'ఆసత్తి' యున్నట్లగును.

**N. B.** : వాక్యమనగా—'వాక్యం స్యాత్‌యోగ్యతా (అ) కాంక్ష (అ) సత్తి యుక్తః పదోచ్చయః'—(సా. ద.), 'పదసమూహో వాక్యం' [తర్కకౌముది].

1. యోగ్యత= ఆకాంక్ష 3 ఆసత్తి — అను, ఈ మూడింటితో గూడిన పద—సముదాయమే 'వాక్యము'. లేక 'పదసమూహమే వాక్యము' అనియు నందురు.

1. "యోగ్యతా" శాబ్ద బోధకారణ విశేషః. సతు పదార్థానాం పరస్పర సంబంధే బాధా భావః" అని సాహిత్య దర్పణము. శబ్దముల వలన తెలియవగిన పదార్థ జ్ఞానమునకు, ఒక కారణమైన దానిని 'యోగ్యత' అందురు. అది, 'పద & అర్థముల యొక్క పరస్పర — అన్వయమును సంగతముచేయు, ఒక అర్థశక్తి. 'అన్వయ' మనగా, వాక్యము నందలి, కర్త—కర్మ—క్రియ—మొదలగునవి అన్యోన్యము అనుకూల్యము కల్గియుండుట

2. 'ఆకాంక్ష'—'య త్పదం వినా య త్పదాన్వయ బోధోన భవతి, తత్ త్పదవత్తా ప్రతీతి పర్యవసానవిరహః' 'ఇత్యాలంకారికాః'. అని, 'శబ్ద కల్పద్రుమ' నిఘంటు వివరణ. అనగా—వాక్యాన్వయ సిద్ధికొరకు ఒక పదము వేరొక పదము నపేక్షించుట, లేక, క్రియనుబట్టి. కర్తృ. కర్మాదులను, విశేష్యమునుబట్టి విశేషణ ములను, రాబట్టుటకై చేయు ప్రయత్నము కూడ 'ఆకాంక్ష' కాదగియున్నది. 'ఆకాంక్ష ప్రతీతి పర్యవసానవిరహాః" సా. ద.

3. "ఆసత్తిః—యత్పదార్థస్య య త్పదార్థే నాన్వయోఽ పేక్షితః తయో రవ్యవధానే నోపస్థితి కారణమ్"—అని సిద్ధాన్త ముక్తావళి.

ఆసత్తిః=దగ్గర సంబంధము. అన్వయానుకూలముగ పదములు దగ్గరగా నుండుట—అని భావము. కనుకనే 'కారణం సన్నిధానం తు పద స్యాస త్తిరుచ్యతే' అనగా, వాక్యమున, ఒక పదము నిప్పుడు చెప్పి, మిగిలిన పదాలను వెంటనే చెప్పక, మరల ఎప్పుడో చెప్పిన, దానిలో 'ఆసత్తి' యుండదని భావము.

శ్లో. ముక్తాత్మక మతిస్వచ్ఛం తార నాయక భూషితమ్॥
హారం ధన్యాః ప్రపశ్యన్తి కాన్తా హృదయ సంగతమ్॥ శ. క. 4-5,1

అతి స్వచ్ఛం—ముక్తా+ఆత్మకం—తార నాయక భూషితమ్ = అతి నిర్మల మైన — ముత్యాలతో కూర్పబడి — నాయకమణితో నలంకరింపబడిన, హారం= ముత్యాల గొలుసును, కాంతా హృదయ సంగతం=ప్రియురాలి ఎదమీదికెక్కి— ఎదు రైనపుడు, (ఆ దృశ్యమును) ధన్యాః — ప్రపశ్యన్తి=ఎంతో ధన్యత గాంచిన అదృష్టవంతులు మాత్రమే, బాగుగా, చూడగల్గుచున్నారు.

స్వచ్ఛ—ముక్తా మణిభూషితహారము, ప్రియురాలి ఎదనెక్కి, ఏపురేపునపుడు, ఆ సౌందర్య భంగిమను, ఏ కొందరో ధన్యాత్ములు మాత్రమే చూడగల్గుచున్నారు— సుమా. అనగా, ఆ సందర్శన భాగ్యము అందరికి దక్కదని భావం.

ఇక్కడ, 'హారం'లోని 'ఆ'ను, చ్యుతం చేసిన, 'హరం' అని మిగులును. అప్పుడు—ము క్త+ఆత్మకం=మోక్షదాతయు, అతిస్వచ్ఛం= మిక్కిలి నిర్మలమగు రూపుకలవాడును, తార-నాయక-భూషితమ్=నక్షత్రాలకు—నాయకుడైన — చంద్రు నిచే—అలంకరింపబడినవాడును (చంద్రశేఖరుడును), కాంతా—హృదయసంగతమ్= పార్వతిని—పార్శ్వమున ఎదలో—నిముడ్చుకొన్నవాడును (అర్ధనారీశ్వరుడు) — అగు హరం=ఈశ్వరుని. ధన్యాః- ప్రపశ్యన్తి = ఎంతో పుణ్యం చేసుకొన్న కొందరు పురుషులు (మానవులు) మాత్రమే—కాంచగలరు—అను అర్థాంతరము కూడ వచ్చి యున్నది.

'హారం'లోని, ద్విమాత్రికమగు 'ఆ'ను చ్యుతం చేయుటచే, ఇదియు 'మాత్రాచ్యుతకము'నకు ఉదాహరణమగుచున్నది.

శ్లో॥ దశాంతరస్థితాన్ భావాన్ కలాతీతా నపి స్ఫుటమ్।
కేవల జ్ఞానతో యోగీ ప్రత్యక్షా నివ వీక్షతే॥ దే. క.

దశా+అంతరస్థితాన్=అవస్థా విశేషము (సమాధి) వలన—కల్గిన, కలా+అతీతాన్=శాస్త్రములను—అధిగమించిన, భావాన్-అపి—భావములను కూడ, యోగీ=ధ్యాననిష్ఠుడు, కవ[బ]ల జ్ఞానతః—ఆత్మజ్ఞానమువలన, ప్రత్యక్షాన్— ఇవ = ఎదుట కన్పడుచున్నట్లుగా, స్ఫుటం—వీక్షతే=బాగుగా—చూచుచున్నాడు.

**N B.** మున్మొదట, ఈ శ్లోకంలోని మూడు పాదాలకు ముందు, 'దేశాంతర—కాలాతీతాన్—కేవల జ్ఞానతః' అని ఉండగా, వాని మొదటి హల్లులమీది, 'ఏ—ఆ—ఏ' అను దీర్ఘమాత్రలను చ్యుతం చేయుట వలన, 'దశాంతర— కలాతీతాన్ — కవలజ్ఞానతః'గా మారినవని, మనము ముందు గమనింపవలెను. ఇక, మారక ముందున్న అర్థము.

దేశ+అంతరస్థితాన్=ఇతర దేశములలోనున్న, కాల+అతీతాన్=భూత - భవిష్యత్-వర్తమాన కాలముల-నతిక్రమించిన, భావాన్-అపి = ద్రవ్యాది పదార్థములను గూడ, యోగీ=యోగాభ్యాసము చేసినవాడు, కేవలజ్ఞానతః =ప్రత్యేకమగు - తన దివ్యదృష్టితో, స్ఫుటం-ప్రత్యక్షాన్-ఇవ-వీక్షతే=బాగుగా- ఎట్ల ఎదుట కంటికి కన్పడునట్లుగా-చూచుచున్నాడు—అని ద్వితీయార్థము.

ఒకే శ్లోకమున, వరుసగా, 'ఏ - ఆ - ఏ' అను మూడు దీర్ఘమాత్రలు చ్యుతములై, రమ్యమగు అర్థాంతర ద్యోతకము లైనందున, పూర్వోక్తోదాహరణములకంటె, ఇది భిన్నమైన, 'మాత్రాచ్యుతక' విశేషమని, విశ్లేషించి, తెలిసికొనగలము.

శ్లో. పద్మాసనం విదధతీ ముఖభాసా మనోహరా।
జనయన్తీ స్మరం భర్తుః భాసతే నితరాం 'రమా'॥ చ. చి. 4-28

పద్మాసనంపై గూర్చుండి, తన ముఖకాంతులతో, మనస్సు నాకర్షించుచున్న లక్ష్మి [రమా], తన భర్తకు, కామ వికారమును[స్మరం]ను కల్గించుచు, బాగుగా [నితరాం] ప్రకాశించుచున్నది.

ఇక్కడ, మొదట, 'రమా' అనికాక, 'రామా' అని ఉండగా, అప్పుడు అ

విశేషణసాదృశ్యముచే వచ్చిన అన్యార్థము :— పద్మ చిహ్నములగల కుర్చీలో కూర్చుండి, తన ముఖవర్చస్సుతో అన్యుల మనస్సులను అపహరించుచున్న సుందరి [రామా]తన యజమానికి, మిక్కిలి కామోద్రేకమును కల్గించుచు, మెరయుచున్నది.

రామా=అందగత్తె, సుందరి. "సున్దరీ రమణీ రామా...." అని అమర కోశము.

'రామా'-'రా' [=ర్+ఆ]లోని దీర్ఘమాత్రయగు 'ఆ'ను చ్యుతం చేయగా, 'రమా'పై రమ్యమగు రెండవ అర్థముతో రమణించుచున్నది.

ఇక్కడ, అజిత సేనాచార్యుని 'అలంకార చిన్తామణి'లోని క్రింది విశిష్టోదాహరణము కూడ, పరిశీలింపదగినది.

శ్లో. సమజం ఘాతుకం బాలం క్షణం నోపేక్షతే హరిః
కా తు కం స్త్రీ హిమే వాంఛేత్ సమజం ఘాతుకం బలమ్॥
అ. చి 2–137

హరిః- ఘాతుకం — స[సా]మజం-బ[బా]లం — క్షణం—న- ఉపేక్షతే= సింహము (తనను) నొప్పించు. ఏనుగుల-సైన్యమును - ఒక్కక్షణము కూడ, - (అశ్రద్ధతో) ఉపేక్షించి, ఊరుకొనదు. హిమే-కా-తు- స్త్రీ -కం-వాంఛేత్ = చలి కాలమున-ఎట్టి-వనితయైనను—ఎవనిని—కోరును? (అని ప్రశ్న). సమజంఘా-తు—బ[బా]లం—కం=సమానములైన—పిక్కలుగల స్త్రీ— అయితే— బలము గల — ఎవనినో ఒకనిని (అనగా—ఒక కొడుకును బలం=బాలమ్) కోరుకొనును.

వి. మొదట 'బాలం'లోని 'ఆ'కార మాత్రను చ్యుతం చేయగా, 'బలం' అయి, 'సేన' అను అర్థమును తెల్పును. చివర, 'బలం'లో 'ఆ' మాత్రను చేర్చిన, బాలం (అయి)=బాలుని, కొడుకును తెల్పును. అట్లే 'సమజం'లో 'ఆ' మాత్రను చేర్చిన, 'సామజం'=ఏనుగును—అనే అర్థాన్ని తెల్పును. తర్వాత, 'ఆ' మాత్రను తొలగింప, 'సమజం' కాగా, దానిని ప్రక్కనున్న 'ఘా' అను దానితో కలిపి, 'సమజంఘా'—అని పదచ్ఛేదం చేసి, అర్థము చెప్పుకొనవలెను. 'తు' — పాద పూరణమున, లేక నిశ్చయార్థమున వాడబడినది.

ఇక్కడ, ఉచ్చారణ కాలంలో మాత్రాచ్యుతిని చేసికొనవలెను. అర్థవివరణమున మాత్రము 'మాత్రాచ్యుతి' ఉండదు. కాని సంయోగం ఉంటుంది. మొత్తం మీద 'సహజం—సామజం, బలం—బాలం' రెండుచోట్ల కూడ 'మాత్రాచ్యుతి' జరిగిన దని గమనింపవలెను.

శ్లో. భూతియోజిత భర్తవ్యః కృపణా క్రాన్తమణ్డలః।
మహాపద శుభావాసః త్వత్సమః కుపతిః కుతః?॥ హే. కా.

ఇక్కడ, మొదట 'కృపాణా క్రాన్త మండలః' అని ఉండగా, 'పా'లోని దీర్ఘాన్ని—'అ'ను చ్యుతం చేయుటవలన, 'కృపణ క్రాన్తమండలః" అయిన'దని గమనింపవలెను.

"....విటః సేవ్యః కులీనస్య తిష్ఠతః పథికస్య సః"

ఇక్కడ, 'వి'టః (=బంటుకాడు)లోని 'ఇ'కార మాత్రను తొలగించిన, 'వటః' [=మర్రిచెట్టు] మిగిలి, అర్థాంతర సంగతిచే, 'మాత్రాచ్యుతక' మగుచున్నది.

గమనిక : ఇంకను తదితర మహాకవు లనేకుల కావ్యాల నుండి, అనేక చ్యుతకాది, ఉదాహరణములు సంకలనము చేయబడినవి. అతివిస్తర భీతిచే విసర్జింపబడినవని మనవి. "అతి సర్వత్ర వర్జయేత్" అని కదా సూక్తి.

# బిన్దు చ్యుతకమ్

శ్లో॥ అన్యోఽర్థో విస్ఫుటో యత్ర బింద్వాది ప్రచ్యుతా వపి।—
ప్రతీయతే విదః ప్రాహుః తద్"బిన్దు చ్యుతకాదికమ్"॥

యత్ర=ఎక్కడ, బింధు + అది—ప్రచ్యుతౌ + అపి = బిందు, విసర్గ, అక్షర....మొదలైనవి—తొలగింపబడినప్పటికి, అన్యః +అర్థః= మరియొక — అర్థము, విస్ఫుటం—ప్రతీయతే=చిక్కు లేక స్పష్టముగా— తెలియబడినది అగునో, తత్=బింధు చ్యుతక+ఆదికం=అది-బిందు చ్యుతకము ... మొదలగునది (అగును) అని, విదః— ప్రాహుః=పండితులు—పల్కిరి అని లక్షణము.

"....కాంతో యసావస్తి, బాలేం దుఃఖేన భవతి సదాః"—దు. కా.

ప్రియుడు, నేత్రానందకరుడునగు బాలచంద్రుడు ఆకాశమున (ఖే) ఎల్లపుడు కన్పడదుసుమా!—అని మొదటి అర్థము. ఇక్కడ 'బాలేందుః'లో మధ్యనున్న బిందువు(ం)ను తొలగించి, తర్వాతనున్న 'ఖేన .......'తో కలిపి, విభజింపగా, 'బాలే! దుఃఖేన ...' అగుచున్నది. అపుడు, 'ఓ బాలామణీ!' నేత్రానందము కల్గించు ప్రియుడు, నేడు, దుఃఖేన-సదా-భవతి=దుఃఖంతో-ఎల్లపుడు – బాధించు కొని యున్నాడు—అను ద్వితీయార్థము కూడ, సంగతమగుచున్నది. ఈ 'ం' అను స్వారము. లేక బిందువు చ్యుతమగుటచే, 'చ్యుతబిందుక"మైనది.

వి. ఇది 'వ'కార చ్యుతితో 'వ్యంజన చ్యుతకము' కూడ కావచ్చును.

శ్లో॥ సుశ్యామా చన్దనవతీ కాన్తా తిలకభూషితా
కస్యైషా నఙ్గభూః ప్రీతిం భుజంగస్య కరోతి న?॥ వి. ము. 4-61

సుశ్యామా=యౌవన మధ్య యందున్న(స్త్రీయు), చందనవతీ = మంచి గంధము పూసికొని, కాన్తా = కోరదగిన, తిలకభూషితా = బొట్టుతో నలంకరింప బడిన, అనంగభూః = కామోద్రేకమును కల్పించుచున్న, ఏషా = ఎదుట కన్పడు చున్న ఈ యువతి, కస్య—భుజంగస్య = ఏ-విటునికి, ప్రీతిం-న = కరోతి ? = సంతోషమును—కలిగింపదు ?

వి. కస్య+ఏషా+అనంగభూః' - వృద్ధి+ సవర్ణదీర్ఘ + పరసవర్ణములు చేయగా, = 'కస్యైఽషానఙ్గభూః' కాగలదు.

ఇక్కడ, '(అ) నంగభూః'లో 'న' తర్వాత నున్న బిందువు [ం] ను చ్యుతం చేయగా, 'నగభూః' అని మాత్రమే మిగులును. ఈ స్థితిలో రెండవ అర్థము.

'సుశ్యామా-చందనవతీ - తిలకభూషితా – కాన్తా = చెట్లతో ఆకుపచ్చనై, చందన—తిలక-వృక్షములతోగూడి-ఇంపు సొంపు మీరియున్న, ఏషా-నగభూః = ఈ (కనబడి) పర్వత (ప్రాంత) భూమి, అనగా-మలయపర్వత పంక్తి, కస్య— భుజంగస్య-ప్రీతిం-న-కరోతి = ఏ-సర్పమునకు-సంతోషమును-కల్గింపదు? అనగ, ప్రతి దానికి, తప్పక ప్రీతిని కల్గిస్తుందని భావము.

గమనిక . ఇక్కడ, '(అ)నంగభూః'లోని అనుస్వార[ం]ను తీసివేయగా,

'నగటా'ః అయినట్లుగానే. 'ఋబంగస్య'లోని 'o' సున్నను కూడ, తీసివేయగా 'ఋజగస్య' మిగులును.

వి. 'ఋజగ, ఋజంగ, ఋజంగను' పదాలు, పాముకు పర్యాయ పదాలని 'అమరకోశము'.

(సర్పః పృథాకు ర్భుజగో ఋజంగో—హిర్భుజంగమః....', ఈ 'ఋజంగ' పదానికి 'సర్పము, విటుని ( = జారుడు, అంకుకాడు ...) నానార్థములు.

∴ [అ]నంగటాః, ఋజంగస్య' పదాలలోని 'బిందువులు' చ్యుతము లగుటచే, ఈ రెండును 'బిన్దు చ్యుతకము'నకు ఉదాహరణములై నవి.

శ్లో. మకరందారుణం తోయం ధత్తే త్వత్పుర ఖాతికా
పాండురం క్వచి దుద్బిన్దు చలన్మకరదారుణమ్ । అ. వి. 2-136

ఓ రాజా! త్వత్-పురఖాతికా = నీ యొక్క - నగరం చుట్టు ఉన్న అగడ్త [కందకము], మకరంద+అరుణం-తోయం=ధత్తే = [ఒకచోట] తేనెతో - ఎఱ్ఱనైన-నీటిని కల్గియున్నది. పాండురం = పద్మాలతో నిండియున్నది. క్వచిత్ = వేరొకచోట, ఉత్-బిన్దు-చలత్+మకర- దారుణం — పైకి-నీటిబొట్లను- విసరుచున్న మొసళ్ళతో-భయంకరముగా-కూడ ఉన్నది సుమా !

రాజుగారి కోటను చుట్టుముట్టియున్న కందకము, ఒకచోట తేనెవలె అరుణమైన జలమును తామరపూలను గలిగి, ప్రశాంతముగ నున్నను, వేరొకచోట, నీటిని పైకి వెదజల్లుచున్న మొసళ్ళతో నిండి, భయంకరముగ నున్నది.

ఇక్కడ, మొదటి పాదంలో 'మకర దారుణం' అని పూర్వము ఉండగా, దానిలో బిందువు(o)ను చేర్చి, 'మకరం దారుణం'గా చేయబడినది. అట్లే, చివరి పాదంలో 'చలన్మకరం దారుణం' ఉండగా, దానిలోని 'సున్న'ను చ్యుతం చేసి, 'చలన్మకర దారుణం'గా చేయబడింది. ఎట్లైయినను తేడా లేకుండ, రెండవ అర్థం సరిపడుతుంది.

మొత్తంమీద 'బిందువు' ఉన్నపుడు, చ్యుతమైనపుడు కూడ, రెండర్థాలు చక్కగా, సరిపడి యుండుట, ఈ 'బిన్దుచ్యుత' కోదాహరణ ప్రత్యేకత.

శ్లో. విశిష్ట ద్రవ్య ఘటితం దోషాన్త గమనోచితమ్ ।
సేవ్యమానం మహారుగ్భిః అగదం తవ్వి ! రోచతే । క. క. 4-5-1

తన్వి !–ఓ వనితా! విశిష్ట ద్రవ్యఘటితం = సువర్ణ-రత్న- ఆది విశేషము లతో గూడి, దోషా+అన్త గమనోచితం = బాహువులలో- కదలిపోవుటకు వీలైన, మహారుగ్భి - సేవ్యమానమ్ = గొప్ప రత్నకాంతులతో - తొలకాడుచున్న, అంగదం = భుజకీర్తి, బాహుపురి. రోచతే = ప్రకాశించుచున్నది, లేక, (నాకు) రుచించుచున్నది.

సువర్ణ, రత్న ఖచితమై, భుజములందు తొలకాడుచు, మహాకాంతులతో నొప్పుచున్న భుజకీర్తి (దండకడియము) ప్రకాశించుచున్నది.

'అంగదం'లోని బిందువును చ్యుతం చేసిన, 'అగదం' ( = ఔషధము) అగును. అప్పటి-అన్య-అర్థము · విశిష్ట ద్రవ్యఘటితం = పాదరసం మొ. విశేష ద్రవ్యములతో తయారుచేయబడి, దోష+అన్త గమనోచితం = కఫ, వాత, పిత్త ములను దోషములను పోగొట్టుటకు సమర్థమై, మహారుగ్భి - సేవ్యమానం = గొప్పదగు రోగములు గలవారిచే-సేవింపబడుచున్న, అగదం = ఔషధము, మందు, రోచతే = ఇష్టముతో భుజింపబడుచున్నది—

ఇట్లు బిందువుచ్యుతమైనప్పటి అన్యార్థం కూడ సంగత మగుటచే, నిది 'బిందుచ్యుతకము'.

శ్లో. జనయన్తః సుఖం నిద్రాం జనానాం నిజసేవయా
కబలాః మార్దవోపేతాః జయన్తి రుచిశాలినః చ. చి. 4-17

తమను సేవించిన జనులను, హాయిగా నిద్రింప జేయుచు, మెత్తనై, కమ్మని రుచి గలిగిన, అన్నపు ముద్దలు [కబలాః] జయము నిచ్చుచున్నవి.

మొదట 'కంబలాః' ఉండగా, దానిలోని బిందువును తొలగించుటచే, 'కబలాః' అయినది.

రెండవ అర్థము : మెత్తగా, మెరయుచున్న కంబళ్ళు (చలికాలమున) తమను సేవించిన జనులకు, సుఖనిద్రను కలుగజేయుచున్నవని—భావము.

'కంబలాః' నుండి, బిందువు [ం] తొలగి, 'కబలాః' అగుటచే 'బిందు చ్యుతకము'.

(3)

శ్లో. అసద్బిందుమదిరాభాన్తి ముఖై రమరవారణాః
ఘ[ం]టా ఘటనయా వ్యోమ్ని విరచన్తః శ్రియా స్రుతాః
అ. చి. 2-135

రెండు గండస్థలములు, ఒక తుండము, ఈ మూటినుండి, మద — జలమును కార్చుచు, మేఘఘటతో సమానముగా, ఆకాశమున తిరుగుచున్న దేవతల ఏనుగులు. తమ ముఖాలతో ప్రకాశించుచున్నవి.

ఇక్కడ, ఉచ్చారణ కాలంలో బిందువు [ం] లేకున్నను, అర్థం చెప్పేటపుడు సమయంలో ఉంటుంది. ద్వితీయార్థం అనేక విధాలుగా శ్రుత జ్ఞానమును ధారణ చేయుచు, ఘంటా నినాదములు చేయుచు, ఆకాశమున విహరించుచున్న, ఈ శ్రేష్ఠ దేవతలు [అమర-వారణాః] జ్ఞానంతో కూడిన తమ ముఖములతో శోభించు చున్నారు.

వి. 1. ఇక్కడ 'ఘంటా ఘటన'లో మొదటనున్న బిందువు 'చ్యుతం' చేయబడి, అర్థాంతరాన్ని తెల్పినందున 'బిందుచ్యుతకము.'

2. 'అమర—వారణాః'లో 'వారణ' ఉత్తరపద మగుటచే, శ్రేష్ఠారమును మాత్రమే చెప్పుచున్నది. "సింహ శార్దూల నాగాద్యాః పరేశ్రేష్ఠార్థ గోచరాః" అని అభియుక్తోక్తి. 3. ఘటా-ఏనుగుల గుంపు.

శ్లో. ద్వీపం నందీశ్వరం దేవాః మందరాగం చసేవితుమ్
సుదంతీంద్రైః సమంయాన్తి సుందరీభిః సముత్సుకాః అ.చి. 2-134

ఈ శ్లోకం 'బిందుమత్తు [బిందుమాన్] నకు ఉదాహరణము.

ఓ సుదతీ ! ఈ దేవతలు ఇంద్రునితోపాటు, తమ తమ దేవాంగనలను తీసికొని, సముత్కంఠ గల్గినవారై, నందీశ్వర ద్వీపమున, మందర పర్వతము నందు క్రీడించుటకు పోవుచున్నారు.

ఇక్కడ, 'సుదతీంద్రైః - నదీశ్వరం-మదరాగ....' స్థానములలో, బిందువు నుంచి, 'సుదంతీంద్రైః - నందీశ్వరం- మందరాగం....' అని, ఉచ్చారణ కాలమున 'బిందువు'తో కూడినట్లుగా వ్రాయబడినందున, ఇది 'బిందుమాన్'కు ఉదాహరణము.

పై బిందువులను చ్యుతం చేసిన, 'ఓ దేవీ ! ఈ దేవతలు గొప్ప ఏనుగుల నెక్కి, దేవాంగనలతో, మత్తుపదార్థము [మద-రాగం] ను సేవించుటకు, సముద్రమున [నదీ+ఈశ్వరమ్] నున్న ద్వీపమునకు పోవుచున్నారు.

వి. బిందువును గ్రహించి, ఉచ్చరింపబడినపుడిది 'బిందుమాన్' అగును. కాని, అర్థం చెప్పునపుడు మాత్రం, బిందువు విడివిపెట్టబడినందున, ఇది 'బిందు చ్యుతకము' కూడ కావగియున్నదని గమనింపవలెను.

శ్లో. యథా సత్ప్రసవః స్నిగ్ధః సన్మార్గ విహితస్థితిః
తథా సర్వాశ్రయః సత్య మయ[ం]మే వకులద్రుమః దే. క.

అయం-మే-వకులద్రుమః = ఈ-నా-పొగడచెట్టు, యథా = ఎట్లు, సత్ + ప్రసవః-స్నిగ్ధ.-సత్+మార్గ విహిత స్థితిః = మంచి జాతిపూలతో - చక్కని సీడ నిచ్చుచు - మంచి త్రోవలో నున్నదో, తథా = అట్లే, సత్యం = నిజముగా, సర్వ+ఆశ్రయః = [ఎండలో త్రోవను పోవుచు అలసినవారు] అందరికి - ఆశ్రయము నిచ్చుచు [ఆనందమును కూడ కల్గించుచు]న్నది.

నా పొగడచెట్టు ...పూలతో సాంద్రమై, సన్మార్గమున నున్నదై, నిజంగానే, అందరికి ఆశ్రయమిచ్చి, సంతాపమును పోగొట్టి, కాపాడుచున్నది.

వి. ఇక్కడ, 'సత్యమయ[ం]మే వకుల ద్రుమంలోనున్న బిందువును చ్యుతంచేసి, దాని ప్రక్కనున్న దానితో కలిపి, చదివిన, 'సత్యమయ మేవ కుల ద్రుమః" అగును. అపుడు— 'సత్ప్రసవః—స్నిగ్ధః— సన్మార్గ విహిత స్థితిః = సత్సంతానంతో—స్నేహంతో—సన్మార్గము నెంచుకొని సంచరించుచున్న, అయం— ఏవ = ఇతడొక్కడే, సత్యం = నిశ్చయముగా, కులద్రుమః = (నా) వంశవృక్షమై, సర్వ+ఆశ్రయః = అందరికి-ఆధారభూతుడై, ఉన్నాడు.

వి. పై సర్వ సద్గుణ సంపన్నుడగువాడే, నా వంశానికి మూలాధారమై, అందరికి ఆశ్రయమిచ్చి, పెన్నిధి యైనాడు— అను రెండవ అర్థం కూడ, సరిపడు చున్నది. మొత్తంమీద బిందువు (ం) ఉన్నను, చ్యుతం చేసినను, రెండర్థాలు రావడం, సరిపోవడంతో, ఇదియు 'బిందు చ్యుతక' ఉదాహరణా స్తరము.

శ్లో. చకాస్తి బిన్దుచ్యుతకాతిచాతురీ ఘనాశ్రు బిందుచ్యుతి కైతవాత్తవ।
మసారతారాక్షి 'ససార' మాత్మనా తనోషి 'సంసార' మసంశయం
యతః  నై.

విద్వ దౌషధమైన 'నైషధము'ను రచించిన శ్రీహర్షుడీ శ్లోకమున, బిందు యుక్తమైన 'సంసార'ము నుండి బిందువును చ్యుతంచేసి, దానిని 'ససార'ముగ చేయుట విశేషగ్రాహ్యము.

శ్లో॥ సహ(ం)సా నలినీ తారా శారితా గగనావనిః
శోభతే భూమి పాలానాం సభా చ విబుధాశ్రితా। హే. కా. 5-4-72

'కావ్యానుశాసన' కర్తయగు హేమ చంద్రుడీ శ్లోకమున, మొదట 'సహంసా....'గానున్న దానినుండి, బిందువును చ్యుతంచేసి, 'సహసా' చేసి అర్థ ద్వయంతో సమన్వయించెను.

# విసర్గ చ్యుతకమ్

శ్లో. అగస్త్యస్యమునేః శాపాత్ బ్రహ్మస్యన్దన మాశ్రితః
మహాసుఃఖాత్ పరిభ్రష్టః నహుషః సర్పతాం గతః॥ వి. ము. 4-64

మహా+అసుః—నహుషః = గొప్ప—చైతన్యము గల— 'నహుష'దను రాజు. బ్రహ్మస్యన్దనం—ఆశ్రితః = బ్రహ్మరథమును — ఎక్కిన వాడైనను, అగస్త్యస్య-మునేః--శాపాత్ = అగస్త్యుడను—మహర్షి యొక్క—శాపము [తిట్టు] వలన, ఖాత్—పరిభ్రష్టః = ఆకాశము (స్వర్గము) నుండి-(వెలివేయబడినవాడై) జారి, భూమిపైబడి, సర్పతాం—గతః = సర్పరూపము-నొందెను.

శ్లోకంలో 'మహాసుఃఖాత్....' మధ్యలోనున్న విసర్గము(ః)ను చ్యుతంచేసి, తరువాతనున్న 'ఖాత్'తో కలిపిన, మహాసుఖాత్ [=గొప్ప సుఖము నుండి] అను పదము ఏర్పడును.

∴ నహుషుడు గొప్ప - స్వర్గసుఖము నుండి భ్రష్టుడయ్యెను — అను అన్యార్థము కూడ సరిపడి, 'విసర్గచ్యుత' మగుచున్నది.

**N. B.** నహుషుడు 'ఆయువు' అనువాని కుమారుడు. ఒకప్పుడు 'విశ్వ రూప'డను వానిని, అన్యాయ్యముగ చంపిన పాపమునకు భయపడిన దేవేంద్రుడు, తన సింహాసనమును పరిత్యజించి, పారిపోయెను. అప్పుడు మహర్షులందరు మానవ మాత్రుడగు 'నహుషు'ని, మాన్యగుణశాలినిగా వెదకి తెచ్చి, తమ తమ యంశములను వానిలో జొప్పించి, ఖాళీగానున్న స్వర్గసింహాసనమున, ప్రతిష్ఠింపజేసిరి. కాని, ఇంద్ర పదవితో గర్వించిన నహుషుడు, దేవేంద్రుని భార్య యగు శచీదేవిని కామించి, ముని వాహమున నెక్కి, ఆమె కడకు పోవుచు, కామోద్రేక త్వరతో 'సర్ప-సర్ప' [=త్వరగా ముందుకు సాగుము] అని, అగస్త్యుని కాలితోతన్ని, అతని శాపముచే, సర్పరూపము నొంది, పిమ్మట, ధర్మజుని ప్రత్యుత్తరములనువిని, శాపవిముక్తుడైన 'పురాణగాథ' నిక్కడ, అనుసంధించు కొనవలెను.

శ్లో. మంద్రైః కలాపినా మేతే పక్షిణాం ధరణీ రుహాః

విరుతైః స్వాగతా నీవ వారివాహాయ తన్వతే॥

ఏతే—ధరణీరుహాః = ఈ చెట్లు, కలాపినాం— పక్షిణాం—మంద్రైః-విరుతైః = నెమలి పక్షుల యొక్క—గంభీర- శబ్దములతో, వారి-వాహాయ= నీటిని - మోయు మేఘముల (రాక) కొరకు, స్వాగతాని—తన్వతే—ఇవ=స్వాగతాంజలి - ఘటించు చున్నవా? అన్నట్లున్నవి.

చెట్లు తమపైనున్న నెమలి పక్షుల కూతలతో, మేఘములకు స్వాగతములు పల్కుచున్నట్లున్నవని, కవి ఉత్ప్రేక్షించెను.

వి. ఇక్కడ 'మంద్రైః - కలాపినాం'అను రెండు శబ్దముల మధ్యనున్న విసర్గ(ః)ను చ్యావితంచేసి, మిగిలిన వానిని కలిపిన 'మంద్రైకలాపినాం' [=ధీర గంభీర—ముఖ్యస్వరముగల... ] అగుచున్నది. అపుడు చెట్లు నెమళ్ళ యొక్క .... స్వరములతో స్వాగతించుచున్నవను ద్వితీయార్థము కూడ సంగతమై 'విసర్గచ్యుత' మగుచున్నది.

శ్లో. పయోదసమయే జాతే ప్రచలాః కీరరాజయః

పశ్యామనా విదధతే వ్యపక్షైః హరితా దిశః

అథనా—పయోదసమయే—జాతే=వేరు—వర్షాసమయము — వచ్చినంతనే



ప్రచలాః-కిరరాజయః = ఉల్లాసముతో ఊగులాడుచున్న - చిలుకలగుంపు, పక్షైః — దిశః — హరితాః — వితదతే = తమ రెక్కలతో — దిక్కులనన్నిటిని, — ఆకుపచ్చగా — చేయుచున్నవి, పశ్య = చూడుము.

వర్షాకాలము వచ్చినంతనే, ఆకాశమున బారులు తీరిన చిలుకలు, తమ రెక్కలతో, అన్ని దిక్కులను, ఆకుపచ్చగా చేయుచున్నవి — చూడుమని హెచ్చరిక.

వి. ఈ శ్లోకంలో 'ప్రచలాః + కిరరాజయః' మధ్యలో నున్న విసర్గను 'చ్యుతం'చేసి, కలిపిన 'ప్రచలాకిరరాజయః' కాగా, మరల. దానిని 'ప్రచలాకి— రరాజ—యః'గా విడదీసిన, వచ్చు రెండవ అర్థము :

యః — ప్రచలాకీ = ఏ — నెమలి, పయోదసమయే — రరాజ = వర్షాకాలమున- వాసి కెక్కెనో, ఆ నెమలి, అయినా — నేడు శరదృతువురాగానే,....తనరెక్కలతో దిక్కుల నన్నిటిని పచ్చగా చేయుచున్నది.

వర్షాకాలమున వర్ధిల్లిన నెమలి, శరదృతువు రాగానే, తన రెక్కలతో దిక్కులను పచ్చగా చేయుచున్నది — చూడుమని ద్వితీయార్థము. ∴ విసర్గ చ్యుతము.

# వ్యఞ్జన చ్యుతకమ్

శ్లో. భిక్షవో రుచిరా స్సర్వ రసాః సర్వజనప్రియాః
క్షమాయా మభిసంపన్నాః దృశ్య న్తే మగధే పరమ్॥ వి.ము.4-69

భిక్షవః = బౌద్ధ సన్యాసులు, రుచిరాః — సర్వరసాః = ఇష్టమైనవారు — సర్వ జనుల యందనురాగరసము కలవారు, (కనుక) సర్వజనప్రియాః = సకల మాన వులకు ఇష్టమైనవారై, క్షమాయాం — అభిసంపన్నాః — ఓర్పుతో (భూమిలో) — ఏ లోటులేనివారై, మగధే — పరం — దృశ్య న్తే = వి(వి)హార దేశమున — అధికముగా, — స్వేచ్ఛగా — తిరుగుచు కన్పడుచున్నారు.

ఈ బౌద్ధులు విహరించుట చేతనే, మగధదేశమునకు, విహార — బిహార — బీహార — దేశమను పేరులు వచ్చినవి. ఉత్తరాదివారు, ఒఢ్రులు, వంగాలువారు మొ॥

వారు'వ–బ'లకున్న భేదమునుపట్టించుకొనరు. ∴వివేకానంద–బివేకానంద,రవీంద్ర-రబీంద్ర... అని పల్కుదురు.

ఇక్కడ, 'భిక్షవః'లో 'భి' (భ్+ఇ)లో నున్న 'భ్'ను చ్యుతం చేసిన 'ఇక్షవః' [చెరకు గడలు] మిగులును. ఈ చెరకుగడలు, మధురములై, సమస్త రసగుణయుక్తములై, సర్వప్రజలకు ఇష్టమైనవై, భూమిపై సమృద్ధముగా కన్పడు చున్నవి–అని ద్వితీయార్థము.

∴ 'భిక్షవః'లోని 'ఇ'కారశూన్య – హల్మాత్ర 'భ్' మాత్రమే చ్యుతమై నందున 'వ్యంజన చ్యుతకము'.

శ్లో॥ సత్యశీలో దయోపేతః దాతా శుచి రమత్సరః
జనః సర్వాత్మనా సేవ్యః పద ముచ్చైరభీప్సతా॥ దే.శ.

సత్యశీలః—దయా+ఉపేతః=సత్యస్వభావము గలవాడు, కరుణతోకూడిన, వాడును, దాతా–శుచిః–అమత్సరః=దానము చేయువాడు– పవిత్రుడు, మాత్సర్యము లేనివాడును, అయిన, జనః= బుద్ధభగవానుడు, ఉచ్చైః– పదం– అభీప్సతా, — సర్వ+ఆత్మనా–సేవ్యః=ఉన్నత–స్థానమును–పొందగోరువానిచే,-అన్ని విధముల సేవింపదగినవాడు. సత్యశీలాది సర్వగుణాల కాలవాలుడగు బుద్ధుడు, అభివృద్ధి నాకాంక్షించు వారందరికిని ఆరాధ్యుడు.

ఇక్కడ 'జన'ః [జ్+ఇ]లోని, అకారరహితమగు 'జ్' [జకారమును] చ్యుతం చేసినందున, 'ఇనః' (=ప్రభువు, స్వామి) మిగులును. పై విశేషణసామ్య మునే, సర్వగుణాలతో కూడిన, ఈ 'ప్రభువు' [ఇనః] కూడ, సర్వజనారాధ్యుడగు చున్నాడని ద్వితీయార్థం.

హల్మాత్రము, అర్ధమాత్రకమునగు 'జన'లోని, కేవల'జ్' = జకారము మాత్రమే, లుప్తమైనందున, ఇది వ్యంజన చ్యుతకము. 'వ్యంజనం త్వర్ధమాత్రకమ్' అని, పూర్వమే చెప్పబడినది. కొందరు దీనిని 'అర్ధమాత్రాచ్యుతకము'గా కూడ వ్యవహరించిరి.

శ్లో. అంగదా సహజోదార మేఘనాద విభీషణః
వేలాయా మకలంకాయాం శ్రావణోఽయం విరాజతే శ.శ. 45-11

**అయం**—శ్రావణః= ఈ -శ్రావణ మాసము, అకల (శం) కాయాం — వేలాయాం=దోషరహితమగు-సమయమున, అఙ్గభూ-సహజ+ఉదార- మేఘనాద-విభీషణః=మన్మథునకు-సహోదరియగు-గొప్ప-మేఘధ్వనితో - భయంకరమగుచు, విజృంభతే=బాగుగా చెలరేగుచున్నది.

నిష్కళంకమగు సమయమున, మన్మథునివలె కామోద్రేకమును కల్గించు మేఘధ్వనితో, భయమును గల్గించుచున్నదై, ఈ శ్రావణ మాసము విజృంభించు చున్నది.

N. B. :- మేఘము, దాని గర్జనలు, వియోగి జనులకు కామోద్రేకమును గల్గించి, భయపెట్టుచుండునని - కామశాస్త్ర బోధ. కనుకనే, మహాకవి కాళిదాసు 'మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తిచేతః".... అని, 'మేఘ సన్దేశ' కావ్య మున వెల్లడించెను.

ఇక్కడ, 'శ్రావణః' [శ్+రావణః]లోని హల్మాత్రమగు 'శ్'ను చ్యుతం చేసిన 'రావణః' మిగులును. అప్పుడు- అయం-రావణః= ఈ - రావణాసురుడు, వేలా+అయామక-లంకాయాం= సముద్రపు చెలియలికట్ట తీరమున - విస్తారముగ వ్యాపించిన, — 'లంకా' నగరమున, అంగభూ-సహజ-ఉదార- మేఘనాద— విభీ షణః= (యథాక్రమముగ) కొడుకుగాను-సోదరుడు (తమ్ముడు)గాను - గొప్పగా ప్రసిద్ధి నొందిన - ఇంద్రజిత్తు - విభీషణులను వారితో కలిసి, — విజృంభించు చున్నాడు.

N B. · అంగ-భూః=తన శరీరము నుండి - పుట్టినవాడు, కొడుకగు 'ఇంద్రజిత్తు'. స-హజః.... తనతోపాటు [వెనుక లేక తర్వాత]పుట్టిన తమ్ముడు 'విభీషణుడు'.

చెలియలి కట్టచే దీర్ఘముగ చుట్టబడిన-లంకా నగరమున, కొడుకగు ఇంద్ర జిత్తు [మేఘనాథు]డు,తోను, తమ్ముడగు విభీషణునితోను,రావణుడు చెలరేగుచున్నా డని 'ద్వితీయార్థము'.

'శ్రావణః-[=శ్రావణః]లోని, హల్మాత్రమగు 'శ్' అను వ్యంజనము (హల్లు) చ్యుతమగుటచే, ఇది 'వ్యఞ్జన చ్యుతకము.'

శ్లో. జగ్లేక యాఽపి పోత్కంఠరం కిమప్యాకుల మూర్ఛనమ్।
విరహేఽంగనయా కాన్తం సమాగమనిరాశయా। అ.చిం. 2-138

వియోగము నొందిన ఒక స్త్రీ, ఇక భర్తృ సమాగమము జరుగదేమో ? అను నిరాశతో, కలత చెంది, సొమ్మసిల్లి గద్గద కంఠంతో దుఃఖించెను.

'జగ్లే'—అనునది 'గ్లై—హర్షక్షయే' ( = దుఃఖింపుట) అను ధాతువు యొక్క, భూతకాలిక 'లిట్' రూపము. ఈ 'జగ్లే' (జ్-అ. గ్-ల్-ఏ) నుండి, 'ల్' [అను వ్యంజనం. హల్మాత్రం] తొలగించిన, 'జగే' మిగిలి. 'గానం' చేసెను", పాడెను అను ద్వితీయార్థం వచ్చును. ఎట్లన-భర్తృ సమాగమ నిరాశతో విరహోత్కంఠిత యగు ఒకానొక స్త్రీ కలత చెంది, తహ తహతో. మూర్ఛన [సంగీతము నందు క్రమముగా సప్త (7) స్వరముల యొక్క ఆరోహావరోహణములు] చేయుచు, గానము చేసినది.

జగ్లే ( = దుఃఖించెను) నుండి. 'ల్' అనువ్యంజనము లుప్తం కాగా, 'జగే' మిగిలి, గానము చేసెను—అను అన్యార్థము చక్కగా సరిపడుచున్నది.

∴ **వ్యంజన చ్యుతకము**

శ్లో॥ రాజన్! కమలపత్రాక్ష. తత్తే భవతు చాక్షయమ్।
ఆసాదయతి యద్రూపం కరేణుః కరణైః వినా॥

కమలపత్రాక్ష !—రాజన్ = కమలలోచనుడవగు—రాజా! కరేణుః='కరేణుః' అను శబ్దము (నుండి), కరణైః—వినా = హల్మాత్రములగు 'క-ర-ణ' అను అక్షరాలను తీసివేయగా, యత్—రూపం—ఆసాదయతి=ఏ-ఆకారమును- పొందుచున్నదో, తత్—తే—అక్షయం—భవతు—చ = అది (దాని అర్థము)-నీకు—సమృద్ధిగా- సంభవించుమగాక!—అని ఆశీర్వచనము. అదెట్లు?

'కరేణుః'—అను శబ్దమును విడదీసిన, దానిలో 'క్—అ,ర్—ఏ—ణ్-ఉ-ః' అను ఏడు [7] అక్షరములున్నవి. ఈ ఏడింటినుండి 'క్-ర్—ణ్' - అను మూడు హల్లులను (కరణైః-వినా) తీసివేసినచో, 'అ+ఏ-ఉ-ః' అను నాలుగు అక్షరాలు మిగులుచున్నవి. వీనిని క్రమంగా. సంధిచేసి, కలిపిన,'ఐ = అయ్+ఉ-ః' = ఆయుః (=ఆయుస్సు) అనురూపము సిద్ధించును. అట్లు, 'ఆయుస్సు నీకు సమృద్ధిగ సంభవించుమగాక!' అనగా 'దీర్ఘాయుష్మాన్ భవ!' అని ఆశీర్వదించినట్లగును.

పూర్వ శ్లోకాలలో, ఒకే వ్యంజనం [హల్లు] చ్యుతం కాగా, ఇక్కడ 'క్-ర్-ణ్' అను మూడు హల్లులు చ్యుతమగుట విశేషము.

∴ ఇది 'బహువ్యంజనచ్యుతచిత్రము'

మరియు, దీనిలోని కొన్ని అక్షరాలను 'చ్యుత' పద్ధతి ద్వారా 'లుప్తం' చేయగా, మిగిలిన వానిని కలిపి 'అయుః' అను 'నవశబ్ద నిర్మాణము' కూడ చేయ బడినదని-గమనింపగలము.

# స్థాన చ్యుతకమ్

**(Dropp ng of the Place)**

**N. B.** : ఈ 'స్థానచ్యుతక చిత్రము'న, కర్త-కర్మ-క్రియలే కాక, వాని విశేషణములు మొదలగునవి కూడ, తమ తమ స్థానములలో నుండక, గజిబిజిగా నుండి, అన్వయ క్లిష్టత కల్గించు చుండుటవలన, అర్థావగాహనకు ఆటంకము కల్గు చుండును. ఎట్లనగా—

శ్లో. హరః క్షయీ తాపకరః సురేశః
కాన్తోహరిః గోత్రరిపుః వివస్వాన్।
చన్ద్రో ద్విజిహ్వాశ్రిత ఇ త్యపేక్ష్య
లక్ష్మ్యా వృతఃపాతు విధి ర్గతన్త్రి వి.ము.4-68

హరః-క్షయీ, సురేశః— తాపకర. .... ఈశ్వరుడు క్షీణించుచున్నాడు, దేవేంద్రుడు తాపమును కల్గించుచున్నాడు,....,—అని యథాక్రమముగా అర్థం చెప్పుకొన్నచో, అసంబద్ధంగా ఉంటుంది

∴ చెల్లాచెదరుగ, స్థానభ్రష్టములై పడియున్న పదాలకు, మొదట సరియైన అన్వయక్రమం ఏర్పరచుకొని, అర్థ సమన్వయం చేసుకోవాలి. అదెట్లనిన—

1. హరః- ద్విజిహ్వ+ఆశ్రితః-శివుడు [చూచెదమా?] రెండు నాల్కలతో చాడీలు చెప్పువారి మాటలను వింటాడు [శ్లేషతో-రెండు నాలుకలుగల సర్పములకు ఆశ్రయమిచ్చి యున్నాడు.] 2. వివస్వాన్ – తాపకరః = సూర్యుడన్నచో —

నొప్పిని కల్గిస్తాడు (పేడిని కల్గింమను.) 3. సుర+ఈశః - గోత్రరిపుః = దేవేంద్రుడు—వంశనాశకరుడు [పర్వతముల (గోత్ర) రెక్కలను నరుకుట వలన — వానికి శత్రువు ] 4. విధి – శాన్తః=బ్రహ్మ-కదలలేని- నపుంసకుడు. [నిమ్మకు నీరెత్తినట్లు, ప్రశాన్తంగా పడిఉంటాడు.] ఇతి=ఇట్లని [దేవత-లందరిలో నున్న, అవలక్షణాలనన్నీ గణించి, గుణించి,] ఉపేత్య= [వీరి-నందరిని] విడిచిపెట్టి(న), లక్ష్మ్యా-వృతః-హరిః. జగన్తి-పాతు=లక్ష్మీదేవిచే వరింపబడిన - శ్రీమన్నారాయణుడు-సర్వలోకములను-సంరక్షించుగాక!

వరణీయులగు సర్వదేవతల — అవలక్షణాలను ఆకళించుకొని, వారి నందరిని వదలి, లక్ష్మీదేవిచే ఎన్నుకొనబడిన విష్ణువు, సర్వలోకాలను సంరక్షించుగాక !

ఆయా దేవతలందు, కవిశ్లేషతో అనేక దోషాల నారోపించి, చమత్కరింపచేకాక, శ్లోకంలోని పదాలను క్రమం తప్పించి, చెల్లాచెదురుగా నుంచినందున 'స్థానవ్యత్యకము'.

N. B. : ఇట్లు, అన్వయ క్లిష్టతకు ఆలవాలమైన, ఈ స్థానవ్యత్యకము నంగీకరింపని ఆలంకారికులు, దీనికి 'అస్థానస్థపదదోష'మని పేరుపెట్టి, దోష ప్రకరణమున పడవైచిరి.

శ్లో. ద్రవ్యం పంచవిధం జాతిం చతుర్వింశతిధా విదుః।
గుణం ద్వేధా చ నవధా కర్మతాన్తాదపుంగవాః॥ క.త. 4-5-9

శ్లోకంలోని వరుసనుబట్టి, 'ద్రవ్యము' పంచ(5)విధమని, జాతి చతుర్వింశతి (24) ధా... అని. అర్థం చెప్పబోవటం అనుచితమౌతుంది. కనుక, అక్రమంగా ఉన్న పదాలను, అన్వయక్రమంలో పెట్టి, అర్థం చెప్పుకోవాలి. ఎట్లన — 1. ద్రవ్యం నవధా = ద్రవ్యము (పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు— అని) — తొమ్మిది విధాలుగా (నున్నది). 2. గుణం—చతుర్వింశతిధా = (రూప, రస, గంధ, స్పర్శ....ఇత్యాదిగా) గుణాలు ఇరువదినాలుగు విధాలు. 3. కర్మ—పఞ్చవిధం = ఉత్క్షేపణ, అవక్షేపణ, ఆకుంచన, ప్రసారణ—గమనములు-గా—కర్మపంచ[5]విధము. 4.జాతిం—ద్వేధా = పర,అపర— అను నామధేయాలతో జాతి రెండు విధాలని 'విద్వన్మోద తరంగిణి' వివరణ.

(ఇతి)చ—ఇట్లని, కాణాద—పుఙ్గవాః = కణాదమహర్షి చెప్పిన వైశేషిక న్యాయశాస్త్ర పండితప్రకాండులు, విదుః = ఎరుగుదురు.

శ్లోకంలోని కర్తృ, కర్మ.... మొదలగు పదాలన్నీ, తమ తమ సెలవులు తప్పి, అస్థానములలో పడియున్నందున, ఇది 'స్థానచ్యుతకము'నకు ఉదాహరణ మైనది.

శ్లో. అంబర మంభసి పత్త్రిపురారిః పీత మహీశగణస్య దదాహ।
యస్య వధూస్తనయం గృహమబ్ధి పాతుస వో హరలోచనవహ్నిః॥
వి. పు 4-74

అమ్బరం అంభసి, పత్త్రిం—అ రాతిః.... = ఆకాశము-నీటిలో, పత్త్రిము-శత్రువు... ఇత్యాదిగా అర్థం చెప్పుట కూడా 'అసంబద్ధ ప్రలాప' మగును. కనుక, 1. యస్య—అంబరం—పీతం = (భగవంతుడగు) ఏ విష్ణువు యొక్క వస్త్రము — పసుపు వన్నె గలదో (పట్టుబట్టయో), ('యస్య'ను అనువృత్తము చేసికొనినచో, అర్థము సులభావగాహమగును.) 2. యస్య—గృహం—అంభసి = ఎవని = ఇల్లు — నీటిలో పాలసంద్రమున ఉన్నదో!) 3. యస్య—పత్త్రిం—అహి + ఇన— గణస్య — అరాతిః = ఎవని—వాహనము-పాముల యొక్క—ప్రభు—(అహి + ఇన)- సమూహమునకు—శత్రువైన గరుత్మంతుడో, 4. యస్య—వధూః - అప్ + జా = ఎవని-భార్య - సముద్ర జలమున బుట్టిన-లక్ష్మియో' 5. యస్య-తనయం- హరలోచన- వహ్నిః- దదాహ = ఎవని-కుమారుడైన మన్మథుని—ఫా[ల]లాక్షుని (శివుని)- కంటిచిచ్చు - కాల్చివేసెనో, సః-వః-పాతు = ఆ విష్ణు భగవానుడు-మిమ్ములను [మమ్ములమగూడ] కాపాడుగాక!

శ్లోకంలోని పదాలన్నియు స్థానభ్రష్టములగుటచే, ఇదియు 'స్థానచ్యుతకమే'. ఇది 'వైష్ణవం'కాగా, శైవపరమైన దానిని కూడ పరిశీలించండి.

శ్లో. గౌరీశఖం భూధరజాహనాథః
పత్రం తృతీయం దయితోపవీతమ్।
యస్యాంబరం ద్వాదశలోచనాఖ్యః
కాష్ఠాసుతః పాతు సదాశివో వః।

దీనిలోని పదములు స్థాన భ్రష్టములై యున్నవి. అయితే, 1-2 పాదముల లోను, 3-4 పాదములలోను అన్వయ క్రమంగానుండుట గమనార్హము.

'యస్య'ను పునరుక్తంచేసి, అన్నిటికిని అన్వయింపవలెను. ఎట్లన —

1] యస్య-గౌః-పత్రం = ఎవనికి-ఎద్దు (నంది)—వాహనమో?
2] యస్య-తృతీయం—ఈక్షణం=ఎవనికి-మూడవ-కన్ను కలదో,
3] యస్య-భూధరజా-దయితా=ఎవనికి-పర్వతపుత్రి (పార్వతి)-భార్యయో,
4] యస్య-అహినాథః-ఉపవీతమ్=ఎవనికి— నాగరాజు - యజ్ఞోపవీతనమో (జందెము)
5] యస్య-కాష్ఠాః-అంబరం=ఎవనికి-దిక్కులే-వస్త్రమో,
6] యస్య-ద్వాదశలోచనాఢ్యః-సుతః= ఎవనికి 12 కన్నులుగల కార్తికేయుడు - కుమారుడో, (సః) సదాశివః-వః-పాతు= ఆ ఈశ్వరుడు - మిమ్ములను- రక్షించు గాక !

పదములు తమ తమ నెలవులు తప్పియుండుటచే, ఇది యొక 'స్థాన చ్యుతకము.'

శ్లో॥ కాన్తా రుచిం మునిజనస్తరుణో౽వియోగీ కామశ్చ రత్నమణి రుజ్జ్వల కంకణేన
ధత్తేపయోధరయుగే కుచభూషణేన హారేహారే హిమకరేమకరే కరే చ॥ మురభాం

పద్యంలోని పదాలు అస్థానపతితము లగుటచే, 'కాన్త రుచిని మునిజనము ........' ఇత్యాది అర్థం అసంగతముగ నున్నది. కనుక నొకక్రమములో అన్వయించాలి. ఎట్లన— కాన్తా—హారే-రుచిం-ధత్తే=భార్య — ముత్యాలహారమునందు [హారే] అనురక్తిని చూపుతున్నది. అట్లే 2. మునిసంఘము విష్ణువునందు (హరే)ను, 3. అవియోగీ-తరుణః—హిమకరే=ఎడబాటు చెందని యువకుడు — చంద్రుని యందును. 4. కామః-మకరే=మన్మథుడు — [తన ధ్వజ చిహ్నమైన] మొసలి యందును. 5. రత్నమణిః— ఉజ్జ్వలకంకణేన [సహ]—కరే= రత్నమణి ప్రకా

శించుచున్న కడియము [గాజు]తో పాటు—వేలియందును. (చ=మురి యు) 6. కుచ భూషణేన—(సహ)పయోధరయుగే—చ=రత్నమణి స్తనభూషణమగు హారంతో పాటు చన్నుల జంటయందును, రుచిం-ధత్తే=[అహా వచనంతో—పై వన్నియు ఆహా విశేషములతో] అనక్తిని చూపుచున్నవి.

అస్థానపతితములైన పదములు 'స్థాన చ్యుతకము'నకేగాక, మొదట అన్వయము నందింపకున్నను, తర్వాత నొక క్రమంలో నుండి, అన్వయ సౌలభ్యము నందించినవి అట్లే 'హారే—హరే' అయి 'మాత్రాచ్యుతకము'నకు, 'హిమకరే' నుండి క్రమంగా ఒక్కొక్క అక్షరాన్ని తొలగించుటచే, అక్షరచ్యుతకమునకు కూడ ఉదాహరణములు కాదగినవైనవి.

శ్లో. కాశేనః పాతు మాం పత్రం పర్యంక స్తత్కులా దభూత్।
మాతా పుత్రీ సపత్నీ చ మేనా యస్య దివోభువః॥ దా.చ.

పద్యంలోని పదాల వరుసనుబట్టి, 'కాశేనుడు నన్ను రక్షించును గాక! ఆ కులము నుండి పత్రము పర్యంకము పుట్టెను ....... ఇత్యాది అర్థము అయోగ్య మగును. కనుక, పద్యంలో అక్రమంగా, వరుస తప్పియున్న పదాలకు దండాన్వయం' కల్పించి, అర్థము చెప్పుకొని, సరిచేసి కొనవలెను. అదెట్లనిన—

1. యస్య—పర్యంకః—కాశేనః1=ఏ దేవుని యొక్క — పడక — గరుత్మంతుడో !,
2. యస్య—పత్రం—తత్-కులాత్2 = ఏ దేవుని-వాహనము - గరుడ పక్షియో ?,
3. యస్య-పత్నీ—మా 3=ఏ దేవుని యొక్క—భార్య-లక్ష్మీదేవియో?,
4. యః- ఇనా 4- పుత్రీ = ఏ దేవుడు - మన్మధునితో - సంతానవంతు డయ్యెనో ?,

5. యః-భువః-దివః-మాతా = ఏ వేలుపు - భూమికి, స్వర్గమునకు, - ప్రమాణకర్తగా, అభూత్ = అయెనో, సః 6-మాం 7 పాతు = అట్టి విష్ణుదేవుడు న్నన్ను రక్షించుగాక! అను ముఖ్యార్థమును రాబట్టుటకు, ఎంతో శిరోవేష్టన ప్రాణాయామము చేయవలెను.

వివరణము : 1. కం(=వాయుం) అశ్నాతి ఇతి=కాళీ= గాలిని మేయునది గనుక 'కాళి' అనగా పాము. కాళీనాం ఇనః (=పాములకు—ప్రభువు)= కాళీనః= ఆదిశేషుడు, అని విగ్రహ వాక్యము.

2. శేషాంకులం= తత్కులమ్= ఆ పాముల యొక్క — సమూహము, తత్—కులం అత్తిఇతి=తత్కులాత్=ఆ పాముల— సమూహమును — తినువాడు గనుక, తత్కులాత్=గరుత్మంతుడు.

3. మా+ఇనా = మేనా. ఈ 'గుణ' సంధిని విడదీయగా వచ్చినది 'మా= లక్ష్మి. "ఇందిరా లోకమాతా 'మా' రమామఙ్గల (ళ) దేవతా—" అని — అమర కోశము.

4. ఇః = మన్మథుడు. 'ఇకారః పతి రత్నార్చి ష్వనంగేచంద్రరోచిషి"- అని విఃంటువు. 'ఇః' హరిశబ్దంవలె, 'ఇ'కారాన్త ప్రథమా విభక్తి. 'ఇనా '- హరిణా వలె, 'ఇ'శబ్ద, తృతీయా-విభక్తి.

5. మాతా—మా(మానే= కొలుచుట) అను ధాతువునకు 'తృత్' (తృచ్) ప్రత్యయం కలుపగా, వచ్చిన రూపము. మాతా=కొలుచువాడు.

N. B. : ఈ 'మా' ధాతువునకు, కొన్ని ఉపసర్గలు, ప్రత్యయములు చేర్చుటవలన, 1. ప్రమాతా, 2. నిర్మాతా, 3. ప్రమాణము, 4 మానము-, 5. మానవతి—మొ. పదాలు పుట్టినవి.

6. 'సః' అను తచ్ఛబ్దరూపము ఉండుటచే, 'యః' = యచ్ఛబ్దము, లేకున్నను, ఉన్నట్లే భావింపవలెను. 'యత్తదోః నిత్య సంబంధః' అని శాస్త్రకారుల సంప్రదాయము.

7. 'మామ్-మా' అనునవి 'అస్మద్' [ = నేను] శబ్దము యొక్క ద్వితీయా విభక్తి ఏకవచన రూపములు. (ఏక)మామ్—మా [ద్వి,వ.]ఆవామ్—నౌ[బహు.వ.] అస్మాన్-నః.

N B. పదములు తమ తమ నెలవులు తప్పియున్నందున 'స్థాన చ్యుతకము :

శ్లో. రామస్య భగినీ సీతా తస్య పత్నీ సపత్నజా
పార్వతీపతి గోవిన్దః కా లస్య కుటిలా గతిః ।

'రాముని చెల్లెలు సీత, .... పార్వతీపతి గోవిందుడు ....' అని చెప్పుటకు సాహసింపగలమా! కనుక, తికమకగా, స్థానం తప్పి పడియున్న–'సమస్య' లోని, ఆయా పదాలకు, అన్వయక్రమము నన్వేషించి, అర్థసమన్వయం చేయాలి.

ఇపుడు, శ్లోక–ఉత్తరార్ధ-పదచ్ఛేదము నిట్లు చెప్పుకొనవలయును.'పార్వతీ+ ఈపతి గోవిందః, కా, అలస్య కుటిలా, గతిః' అని.

ఈ-పతి–గోవిందః = లక్ష్మీదేవియొక్క–భర్తయైన-విష్ణువు, (విజయతే = సర్వోత్కృష్టుడై యున్నాడు-) అనునది శ్లోకంయొక్క ముఖ్యార్థము.

రామస్య = స్థితికర్తయగు విష్ణుదేవునికి, పార్వతీ = గౌరీదేవి, భగినీ = సోదరి, తస్య = ఆ [రామావతారము నెత్తిన విష్ణువునకు] అనగా శ్రీరామునికి, సపత్నా–జా = [శత్రువులగు రావణ, కుంభకర్ణాదులను చంపుటకు] శత్రుత్వముతో పుట్టిన, సీతా = సీతాదేవి, పత్నీ = భార్య. అలస్య–కుటిలా-గతిః– కా ? = మంద స్వభావముచే—వంకరమైన—నడక-ఏది?-అని ప్రశ్న. దీనికి-'కాలస్య- కుటిలా– గతిః' అనునదే సమాధానము. ఎట్లన, కాలస్య = సమయము, యముడు, శని .... వీరియొక్క, గతిః = నడక, కుటిలా = వంకర–కపటము– మాయ– తో కూడిన దని–భావము.

అనగా, సమయం ఎప్పుడూ ఒకే విధంగా ఉండదు. అది, ఎప్పుడు, ఎక్కడ, ఏ విధంగా, వంకర టింకరగా మారుతుందో ? ఎవరికీ తెలియదు. అని అర్థం. అట్లే–'కాల'శబ్ద నానార్థాలలో చేరిన, యముడుగాని, శనైశ్చరుడుగాని, ఎప్పుడు, ఎవరిని, ఎక్కడ, ఏ విధంగా పట్టి పీడిస్తారో కూడ తెలియన్న మాట.

∴ పదములు అక్రమముగా నున్నందున 'స్థానచ్యుతకము'.

వి. ఈ = లక్ష్మీదేవి. ఈ–పతిః–లక్ష్మియొక్క–భర్త = విష్ణువు.

'ఈ' శబ్దము 'గౌరీ' శబ్దమువలె 'ఈ కారాంతము. కా+అలస్యకుటిలా – గతిః?'–ప్రశ్నకాగా, కాలస్య–గతిః—కుటిలా = కాల— గమనము — వంకర మైనది-అను సమాధానము 'ప్రశ్నోత్తర చిత్రాలంకారమునకు కూడ ఉదాహరణ మగుచున్న'దని గమనింపగలము.

# అక్షర చ్యుతకమ్

(Dropp ng of the letter)

శ్లో. మహానపి సుధీరోఽపి బహురత్న యుతోఽపి సన్
విరసః కుపరీవారో నదీనః కేన సేవ్యతే?॥ వి.ము. 4-65

నదీనః( = నదీనాం ఇనః = నదీనః = నదులకు ప్రభువైన) = సముద్రము, మహాన్–అపి = ఎంత గొప్పవైనను, సుధీరః+అపి = మిక్కిలి బలము–ధైర్యము గలదైనను, బహు–రత్నయుతః+అపి–సన్ = అనేక–రత్నములకు ఆకరము–కూడ – అయినదైనప్పటికి,(ఆ సముద్రము), విరసః = (విరుద్ధరసము గలదై) ఉప్పగా నుండునది. కు పరీవారః = కుత్సితములైన మొసళ్ళు మొదలగు జలచర జంతువులతో నిండియున్నదగుటచే, కేన–సేవ్యతే = ఎవనిచే–సేవింపబడుచున్నది? (ఎవరును సేవింపరని భావము)

సముద్రము ఎంతో వైశాల్యము, బలము, గాంభీర్యముగలది, రత్నాకరము అయినదైనను, ఉప్పగా నుండుట, మొసళ్ళు, తిమింగిలము మొ. క్రూర జంతువులచే నిండియుండిన దైనందున, ఆ సంద్రమును సేవింప, నెవరును ముందుకు రారు.

ఇక్కడ, 'నదీనః'లో మొదటనున్న 'న' అను అక్షరమును, పూర్తిగా, చ్యుతం చేయుటవలన, 'దీనః' ( = లోభి. దరిద్రుడు) మిగులుతోంది. శ్లోకంలోని విశేషణాలను, ఈ లోభి (దీనః)కి కూడ. అన్వయించినచో, ఎంతో గొప్పవాడు, ధైర్యవంతుడు, అనేక శ్రేష్ఠ వస్తువుల (రత్నముల) గలవాడైనను, ఆ లోభి, సరసుడుగాక, విరసుడైనందున, చెడ్డవారితో చెలిమి చేయుటవలన, ఎవరు కూడ.అతని దరిచేరి, సేవింపరని భావము.

'నదీనః'లోని అద్యక్షరమగు కేవలం హల్మాత్రంగాక, (అకారముతో గూడిన) 'న'అను అక్షరాన్ని చ్యుతం చేయుటవలన 'దీనః' ( = లోభి) మిగిలి, రెండవ అర్థం కూడ, స్ఫుటంగా స్ఫురింపుట వలన, ఇది 'అక్షరచ్యుతకము'నకు ఉదాహరణమైనది. (అక్షరేచ్యుతం యత్ర–తత్ = అక్షరచ్యుతకమ్)

శ్లో. సుశీలః స్వర్ణగౌరాంగః పూర్ణచంద్రనిభాననః
సుగతః కస్య న ప్రీతిం తనోతి హృది సంస్థితః॥ వి.ము. 4—66

మంచి స్వభావము—బంగారు రంగుగల్గి, నిండువెలలో సమానమైన మొగము గల్గి, హృదయమున స్థిరముగా నిలుపబడి, ధ్యానింప బడుచున్న 'బుద్ధదేవుడు' (సుగతః) ఏ ప్రాణికి ప్రీతిని సంతరింపకుండును? అనగా, అందరికి ప్రేమను పెంచి, పంచుచున్నాడని భావము.

ఏ 'సుగతః' పదంలోని మధ్యాక్షరమగు 'గ' అను అక్షరాన్ని చ్యుతం చేసిన 'సుతః'(=కొడుకు) మిగులును. ఇప్పుడు, పై విశేషణముల నన్నిటిని, ఈ సుతునకు కూడ, అన్వయించిన, సత్ప్రవర్తన, పసిమిఛాయ, చంద్రునివలె గుండ్రని మొగము గలిగి, ఎల్లపుడు తల్లిదండ్రుల, బంధుమిత్రుల-ఎదలలో తొలగాడుచున్న కుమారుడు [సుతః] ఎవరికి సంతోషమును గల్గింపడు ? అనగా-అందరికి ఆనందాన్ని అందిస్తాడని భావము.

ఏ. పూర్వం 'పదీనః'లో, 'ఆది' — అక్షరచ్యుతి జరుగగా, ఇక్కడ 'సుగతః'లో, మధ్యాక్షరమైన 'గ' చ్యుతమగుట విశేషము.

శ్లో. అధునా మధుకరపతినా గిలితోఽప్యపకార దమ్పతీ యేన।
త్రాత స్సపాలయేన్మాం గలి(లి)తవికారో వినాయకో లక్ష్మ్యాః॥ సురభాం.

ఏ అధునైన మధుకరపతితో అపకారదామ్పత్యము గ్రస్తమయ్యెనో.......? ఈ అర్థం సరిపడదు.

∴ సరియైన అర్థాన్ని చెప్పి, సమన్వయింపుట వలననే పాండిత్య ప్రకర్ష ప్రకటితమగును.

అ'ధు'నా = 'ధు'కారము తొలగింపబడిన, మ'ధు'కరపతినా=మధుకరపతి మధ్యనున్న 'ధు' తొలగింపగా మిగిలిన, మ(ధు)కరపతినా = గొప్ప మొసలిచే, అ'ప'కార—దమ్పతీ='దంపతీ' శబ్దమునుండి 'ప'కారము తీసివేయగా— మిగిలిన, దం(ప)తీ=ఏనుగు, గిలితః+అపి=కరవబడినదైనను, యేన—త్రాతః=ఏ దేవునిచే—రక్షింపబడెనో, [నః=అ] లక్ష్మ్యాః= లక్ష్మీదేవియొక్క, గలిత'వి'కారః—'వి'నాయకః='వినాయక' శబ్దం నుండి 'వి' ని చ్యుతం (గలితం) చేయగా, మిగిలిన నాయకః=భర్తయైన విష్ణువు. మాం-పాలయేత్—నన్ను రక్షించుగాక!

వి. ఇక్కడ, 1. 'మ[ధు]కరపతినా' 2. 'దం[ప]తీ' 3. [వి]నాయకః— అను శబ్దములనుండి, క్రమంగా 'ధు—ప—వి' అను మూడక్షరాలు చ్యుతం చేయ బడుటచే, క్లిష్టార్థం తొలగి, రమణీయార్థం ప్రతిపాదితమైనది. పూర్వోదాహరణలలో 'ఒకే అక్షరం' చ్యుతం కాగా, ఇక్కడ మధ్యాక్షరాలు రెండు, ఆది అక్షర మొకటి, మొత్తం మూడు అక్షరాలు చ్యుతాలై, రెండవ అర్థాన్ని సరిపుచ్చటం— గమనార్హ విశేషము.

శ్లో. ప్రతిపక్షరతానేక విధ రాగ ప్రియేక్షణా
వియోగినీ మనోబాధాం అదధాతి 'శిఖండితా'॥ క. క. 4-5-7

ప్రతిపక్ష—రత+అనేకవిధ— రాగ—ప్రియ+ఈక్షణా=ప్రతియొక్క రెక్క యందును—ఉన్న—నానావిధ—వర్ణముల వలన— ఎంతో ప్రేమతో చూడదగిన, శిఖండితా=మయూరత్వము [నెమళ్ళు ఎక్కువగా నుండుట], వియోగినీ— మనః + బాధాం=భర్తలకు దూరముగా నుండి ఎడబాటు నొందిన స్త్రీలయొక్క— మనస్సులకు—[ఎంతో] బాధను, అదధాతి=కలిగించుచున్నది.

ప్రతి రెక్కలోను ఎన్నో రంగులను వెలార్చుచు, ప్రేమతో చూడదగు చున్న, అనెమళ్ళగుంపు, ఎడబాటు నొందిన స్త్రీల మనస్సుల నెంతో బాధించు చున్నది.

ఇక్కడ—'శిఖండితా'లో, మొదటనున్న 'శి' అను అక్షరాన్ని తీసివేసిన 'ఖండితా' మిగులును. అప్పుడు, ప్రతిపక్ష........ప్రియేక్షణా=సవతులతో సర్వ విధముల సంభోగించి, [తెల్లవారగనే తన దగ్గరకు] వచ్చిన, ప్రియుని యందలి అన్యనాయికా రతిచిహ్నములను కూడ చూచిన, ఖండితా = 'ఖండిత' అను, ఎడబాటు చెందిన ఒక నాయిక, మనోవ్యథతో క్రుంగి, కృశించిపోవుచున్నది — అని రెండవ అర్థము.

ఈ 'శిఖండితా'లోని 'శి' అను ఆద్యక్షరాన్ని చ్యుతం చేయగా, మిగిలిన 'ఖండితా' [= 'ఖండితా' అను నాయిక] కు, ఈ ద్వితీయార్థము కూడ సరిపడు చున్నది.

N. B. : 1. స్వాధీనపతిక 2. వాసకసజ్జిక 3. విరహోత్కంఠిత, 4. విప్రలబ్ధ 5. 'ఖండిత' 6. కలహాంతరిత 7. ప్రోషితభర్తృక 8. అభిసారిక—అను,

ఈ ఎనిమిదిమంది 'శృంగార నాయికలు'గా, కావ్యశాస్త్రములందు వర్ణింపబడి యున్నారు. ప్రస్తుత 'ఖండిత' వారిలో ఒక నాయిక.

గడచిన రాత్రి మరియొక నాయికతో సర్వవిధముల సంభోగించి, ఆ రతి చిహ్నములతోనే, ప్రాతఃకాలమున తన గదప దగ్గరకు వచ్చిన నాయకుని జూచి ఈర్ష్యతో కోపము చెందిన నాయికను 'ఖండిత' యందురు.

అజితసేనాచార్యుడు, ఈ 'అక్షరచ్యుతక' విషయమున, ప్రశ్నోత్తర రూపమున గూడ, నైకవిధ చమత్కృతిమ చిత్రాల జాగరములను సృష్టించెను. వానికి ప్రత్యుత్తరములను కూడా శ్లోకములలోనే నిబంధించిన అతని—ఆశ్చర్యకరవిజ్ఞానము నొకసారి పరిశీలించండి.

శ్లో. కః పంజర మధ్యాస్తే? కః పరుషనిస్వనః?
కః ప్రతిష్ఠా జీవానాం? కః పాఠ్యోఽక్షరచ్యుతః?॥ అ.చి. 2-139

శ్లో. శుకః పంజర మధ్యాస్తే కాకః పరుషనిస్వనః।
లోకః ప్రతిష్ఠా జీవానాం శ్లోకః పాఠ్యోఽక్షరచ్యుతః॥ అ. చి. 2-140

ప్ర. 1. పంజరమునందున్నదేది? 2.కర్ణకఠోరంగా శబ్దించునదిఏది? 3.జీవులకు ఆధారమైనదేది? 4. అక్షరంచ్యుతమైనా, చదువదగినదేది? అని నాలుగు ప్రశ్నలీశ్లోకంలో వేయబడగా, తర్వాతి శ్లోకంలో ప్రత్యుత్తరాలున్నవి.

సమాధానాలు : 1. పంజరము నధిష్ఠించియున్నది 'చిలుక' [ = శు—కః] కఠినంగా శబ్దించేది 'కాకి' (కా—కః) 3. జీవుల కాశ్రయదాత 'లోకము' (లో-కః) 4. ఏదో ఒక (లేక 2,3,4....) అక్షరాలు చ్యుతాలైనా చదువదగినది 'శ్లోకము' (శ్లో—కః) సుమా!

వి. శ్లోకంలోని నాలుగు ప్రశ్నలు 'కిం' శబ్ద—పుంలింగ— ప్రథమావిభక్తి—ఏకవచన—'కః'తో ప్రశ్నింపబడియున్నవి. ఈ ప్రశ్న వాచకమగు 'కః'కు ముందు, లుప్తాలైన 'శు—కా—లో—శ్లో'అనునాలుగక్షరాలను.పై 'కః'కుముందుక్రమంగా'దత్తం' చేసిన, 'శుకః—కాకః—లోకః—శ్లోకః' అయి, పై నాలుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరము లగుట విశేషాంతరము.

మరియు, పై నాలుగక్షరాలు 'చ్యుత'మగుటచే 'చ్యుత చిత్రము'గను, మరల ఆ నాలుగక్షరాలు 'దత్తము' లగుటచే 'దత్తచిత్రాలు'గను, మొదట 'చ్యుతాలై' తర్వాత 'దత్తా'లగుటచేత 'చ్యుతదత్తాక్షర' చిత్రముగా భావమ్మనని కూడ, అన్యాప దేశంగా ప్రతీయమానం చేయటం, అజిత సేనాచార్యుని ప్రత్యేకత.

శ్లో. కే మధురారావాః? కే పుష్పశాలినః?
కే నోహ్యతే గన్ధః? కే వలేనాఖిలార్థదృక్?॥ అ చి. 2-141

శ్లో॥ కేకినో మధురారావాః, కేసరాః పుష్పశాలినః
కేతకేనోహ్యతే గన్ధః, కేవలే నాఖిలార్థదృక్॥ అ. చి 2-142

ప్రశ్న : 1. మధురంగా శబ్దించునవి ఏవి ? 2. పూలచెట్లు ఎట్లు ఉండును? 3. ఉత్తమ గంధాన్ని ధరించునదేది ? 4. దేని విస్తృతితో జీవుడు సర్వజ్ఞు డగును ?

వి. పూర్వం 139 వ శ్లోకంలో చెప్పబడినవన్నీ, ప్రశ్నకు ముందున్న 'ఏకాక్షర చ్యుత' కాముడు కాగా, ఇది — ప్రశ్నకు పరంగానున్న 'ద్వ్యక్షర చ్యుతకం.'

పై నాల్గింటికి ప్రత్యుత్తరాలు 1. కేకినః (=నెమళ్ళు)– తియ్యగా ధ్వనించు చుండును. 2. పూలచెట్లు కింజల్కములు (కేసరాః)తో నిండియుండును. (నాగకేస రములు) 3. మొగలిపూవు (కేతకము) ఉత్తమ గంధంతో నొప్పారు చుండును. 4. జీవుడు కేవల (విశ్వము) జ్ఞానంతోనే 'సర్వజ్ఞు' డౌతాడు.

వి. 1. మధుర+అరావాః–'కే?'=తీయగా శబ్దించునవి ఏవి? ఈ ప్రశ్నలో మొదట 'కే (కినః)' అని యుండగా, 'కినః' అను రెండక్షరాలు 'చ్యుతాలై' 'కే' మిగిలి ప్రశ్నార్థకమైనదని భావించుట ఒక విశేషము. మరియు, దీనిలో పరముగా మన్న, 'కినః' అను రెండక్షరాలు 'చ్యుత'మగుట విశేషాంతరము. ఇట్లే తర్వాత కూడ తలంపవగును. 2. 'కే (సరా.) పుష్పశాలినః?'లో 'సరాః' అను రెండక్షరాలు చ్యుతి చెంది, 'కే పుష్పశాలినః?' అయినట్లున్నది 3 కే(తకే)నోహ్యతే గంధః – నుండి 'తకే' అను రెండక్షరాలు చ్యుతిచెంది, 'కేనోహ్యతే గంధః' అయినది. 4. 'కే'(వ) వలేనాఖిలార్థదృక్' మాత్రము అట్లే ఉంచి, సంయోగంతో అర్థాంతర

ద్యోతకమగుట విశేషము. ['వ-బ'లక భేదముకో, బలేన=బలముకో— అని సమర్థించుట దుర్ఘటముగా తచ్చును)

**N. B.** : ఈ శ్లోకంలో ప్రశ్నార్థక 'కే' అను అక్షరం తర్వాత 'కినః— నరాః—కకే' అను రెండక్షరాలు దత్తాలగుటచే 'దత్తచిత్రం'గాను, మొదట ఇవి చ్యుతాలై, తర్వాత, 'దత్తా' లగుటచే 'చ్యుతదత్తాక్షరాలు'గా కూడ, ప్రతీయమానములగుట విశేషాంతరము'గా గ్రహింపవగును.

1. శ్లో. కా స్వరభేదేషు? కా రుచిహా రుజా?।
   కా రమయేత్ కాన్తం? కా తారవిస్వనా?॥ అ చి. 2–143

2. శ్లో. కా కలీ స్వరభేదేషు, కామలా రుచిహారుజా।
   కాముకీ రమయేత్కాన్తం కాహలా తారవిస్వనా 2–144

3. శ్లో. కాకలా స్వరభేదేషు కామలా రుచిహారుజా।
   కాముహూరమయేత్ కాన్తం కాహలా తారవిస్వనా॥ 2-145

143. 1. సమస్త స్వరాలలో ఉత్తమమైనదేది ? 2. శరీర లేక మానసిక కాన్తిని నష్టపరచు రోగమేది? 3. పతి నెవతె ప్రసన్నుని చేసికొనును ? 4. ఉన్నతంగా, గంభీరంగా శబ్దం చేయునది ఏది?—ఇవి నాలుగు ప్రశ్నలు.

2. 144 ఈ నాలుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరములు .- 1. స్వరభేదాలలో 'కాకలీ' [సూక్ష్మమైన అవ్యక్త మధురధ్వని] అను స్వరము ఉత్తమమైనది. 2. 'కామెర' అనువ్యాధి (కామలా—రుజా), దైహిక — మానసిక రుచిని నష్టపరచును. 3. కామిని [కాముకి] పతిని ప్రసన్నుని జేసికొని క్రీడించును. 4 'కాహల' ['బాకా'-అను ఒకానొక వాద్యం] గొప్పగా శబ్దించును.

వి. శ్లోకంలోని 4 ప్రశ్నలకు, 'కా' తర్వాత, రెండక్షరాలు కలిపి [దత్తం చేసి] ప్రత్యుత్తరాలుగా ప్రకటింపబడినవని, గమనింపవలెను.

మరియు, 1. 'స్వరభేదేషు 'కా' '—అను ప్రశ్నకు 'కలీ' అను రెండు అక్షరాలు కలిపి, 'కాకలీ' కాగా, మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తరమైనది. 2. రుచిహా—రుజా—'కా'?లోని 'కా'కు 'మలా' అను రెండక్షరాలు చేర్చగా, 'కామలా' రెండవ ప్రత్యుత్తరమైనది. 3. కాంతం 'కా' రమయేత్—లోని 'కా'కు 'ముకీ'

చేర్చగా, 'కాముకి' అయి, 3 వ ప్రత్యుత్తరమైనది, 4. కారని న్వనా లోని'కా'-లోని 'కా'కు, 'హలా' చేర్చగా, 'కాహలా' తయారై 4 వ ప్రశ్నకు ప్రత్యుత్తర మైనది.

N. B. : ఇక్కడ, మొదట 1. 'కా-కలీ' 2. 'కా-మలా' 3. 'కా-ముకీ' 4. 'కా—హలా' అనియుండగా, వానిలోని చివరి రెండక్షరాలు చ్యుతాలు చేయగా 143వ శ్లోకంలో ప్రశ్నలైనవి. తర్వాత 144వ శ్లోకంలో 'కా' తర్వాత, ఆయా రెండక్షరాలను దత్తం చేయగా, పై నాలుగు ప్రత్యుత్తరములగుట మరొకవిశేషము. ముందుగనే, 'రెండక్షరాలు' చ్యుతమగుటవలన, ఇది'ద్వ్యక్షరచ్యుతక ప్రశ్నోత్తర, మైనది.

145. ప్ర : 1. స్వరభేదాలలో ఉత్తమ స్వరం ఏది? 2. దైహిక— మానసిక కాంతిని పోగొట్టు రోగమేది? 3, మాగిమాటికి మగనితో రమించునది ఎవతె? 4. కొట్టబడినదై, పెద్దగా మ్రోగునది ఏది? అని 4 ప్రశ్నలు.

ఈ శ్లోకంలోని 'కాక[లా] స్వరభేదేషు—' మొదలగు నాలుగు పాదాల లోని ప్రశ్నలలో, మూడవ అక్షరాలను 1 'లా', 2 'కా' 3 'హా' 4 'లా' అనుఅక్షరాలను చ్యుతంచేసి, వాని స్థానమున, 144వ శ్లోకంలోని. మూడవ అక్షరాలగు 1 'లీ' 2 'లా' 3 'కీ' 4 'లా' అనువానిని చేర్చగా, 1 కాకలీ 2 కామలా 3 కాముకీ 4 కాహలా-అను నాలుగు పదాలు తయారై ప్రత్యుత్తరములగుట — మరొక ప్రత్యేకత.

N. B.: ఇట్లు, పైన చూపిన అజిత సేనాచార్యుని 'చ్యుతచిత్రా' లన్నియు, 'దత్త'చిత్రాలుగా, 'చ్యుతదత్త చిత్రాలు'గా కూడ, ప్రతీయమానములై, చమత్కార చంద్రమును చర్చించుచున్నవి. పై 139 వ శ్లోకంలో 'కః' అనునది ప్రశ్నార్థకం కాగా, 141వ శ్లోకంలో 'కిం' శబ్ద—పుంలింగ—ప్రథమావిభక్తి— బహువచనము 'కే' అనునదియు, అట్లే, 143, 144 శ్లోకాలలో 'కిం'శబ్ద- స్త్రీలింగ-ప్ర. వి. ఏకవచన మగు 'కా'ను ప్రశ్నవాచకంగా వినియోగించడం కూడ, ప్రత్యేక — గమనార్హము 139వ శ్లోకంలో ఒక అక్షరం కాగా, 142, 144 శ్లోకాలలో రెండక్షరాలు: 145 వ శ్లోకంలో మరల ఒక అక్షరం 'చ్యుతం-దత్తం - చ్యుతదత్తం 'అగుట మరొక ప్రత్యేకతను ప్రకటించుకొన్నది

శ్లో. కాముకః శ్రయతే నిత్యం కాముకిం సురతప్రియామ్
కాన్తానసే.—వదే దాసీం చతురక్షరి విచుతిమ్। 2-146

కాన్తాననే [-కాన్త-ఆననే!] = అందమైన ముఖముగలదానా! కామి యగు పురుషుడు [కాముకః] సంభోగ ప్రియుండగు కామినిని, సదా ఆశ్రయించు చున్నాడు—కాగా, నీవిప్పుడు, దీని మూడుపాదాలలోని, నాలుగు అక్షరాలను తొలగించి, [జాగ్రత్తగా] ప్రత్యుత్తరింపుము.

వి. 1. శ్లోక పాదత్రయంలోని రెండవ అక్షరాలను తొలగించాలి. అనగా—1. కా[ము]కః 2. సు[ర]తప్రియాం 3 కా[మి]కీం 4. కా[న్తా]ననే-ల లోని నాలుగు అక్షరాలను తొలగింపగా, 'కాకః,-సుతప్రియాం- కాకీం - కాననే', నిత్యం, శ్రయతే=కాకి - సంతానోత్పత్తిని గోరు - ఆడు కాకిని—అడవిలో— ఎల్లపుడు, అనుభవించుచున్నది — అను అర్థము కూడ చక్కగా సరిపడు చున్నది.

2. దీనిలో ఏకోత్తరమగు, అనగా ఒకటి తర్వాత - రెండవదగు అక్షరం చ్యుతమైనది. అంతేకాక, 4వ పాదంలో, 'కాననే — చర-రతిం' అనునది కూడ, అక్షరచ్యుతివలన ఊహా గమ్యమగుచున్నది. కాననే! కుత్సితమైన మొగము గల దానా! రతిం-చర=హాయిగా సంభోగము నాచరించి సుఖపడుము -అను విశేషార్థ ములు కూడ ప్రతీయమానములగుచున్నవి.

**N B.** - జైనాచార్యుడగు అజిత సేనుని 'అలంకార చిన్తామణి' గ్రంథంలో ఇట్టి విశేషాంతరము లెన్నియో కలవు అవి శ్రమైక సాధ్యములు, — బోధ్యము లును. అందుచే, వానిలో కొన్నింటిని మాత్రమే, కతిపయ — పాఠకులకై నను ఆనంద ము కల్పించుటకై, ఉదాహరించి, అధికలేఖన ప్రసంగము చేసినందుకు క్షన్తవ్యులము.

శ్లో॥ పాయాత్ కుమార జనకాఖ్య ఉమావిలాసః
శంఖప్రభ శ్చ విధనేశ గవీశయానః।
గంగాం చ పన్నగధరం చ పినాకహస్తః
అద్యాక్షరేణ సహితో రహితోఽథవా త్వామ్॥

కుమార జనకాఖ్యః = కుమారస్వామికి తండ్రిగా చెప్పబడినట్టియు, ఉమా విలాసః = పార్వతితో విలసిల్లువాడును, శంఖ—ప్రభః చ=శంఖమువలె—తెల్లనైన కాంతిగలవాడును, విధనేశ—గవీశ—యానః= యముడు, నందీశ్వరుని పై పయనించు

వారును. గఙ్గాం–చ, = గంగాదేవిని, పన్నగ–ధరం చ=పాములను [కూడ] — ధరించువారును. పినాక–స క్తః='పినాక' మను పేరుగల ధనుస్సునందు–ఆస క్తికల వారును, అస్య + అక్షరేణ – సహితః = [పై విశేషణములన్నిటి యొక్క] మొదటి అక్షరము(ల)తో–కూడివవారునగు, శంకరుడు (క ర్త)స్త్వాం–పాయాత్ = నిన్ను–రక్షించుగాక.

అథవా=అట్లు కాకపోయినచో, అస్య+ అక్షరేణ–రహితః = (పై విశేష ణము లన్నిటి యొక్క) మొదటి–అక్షరము(ల)ను – చ్యుతం (రహితం) చేయగా, మిగిలిన, (కు)మార జనకాఖ్యః=మన్మథునికి తండ్రిగా చెప్పబడినట్టియు, (ఉ)మా-విలాసః=లక్ష్మితో–విలసిల్లువారును, (శం)ఖ-ప్రభః=ఆకాశమువలె-నల్లని కాంతి గలవారును, (ధ)నేశ–[=ధన+ఈశ]– (గ)వీశ [=వి+ఈశ]-యానః=సర్వ ధనాధిపతి యగు కుబేరునితో, పక్షుల కధిపతి యగు గరుత్మంతునితో కలిసి వెళ్ళు వారును. [గం]గాంచ=భూమిని, (పన్)నగ-ధరం-చ=గోవర్ధన పర్వతము నెత్తి-ధరించినవారును, [పి]నాక-స క్తః = ఆకాశము నందలి పై కుంతపురమునందు — ఆస క్తికలవారును-అగు విష్ణువు-నిన్ను-రక్షించుగాక!

N. B. : శ్లోకంలోని సర్వవిశేషణముల యొక్క ఆది (మొదటి)-అక్షరా లను 'చ్యుతం' చేయుటవలన "అక్షరచ్యుతక"మైనది. ఇట్లు, 'చ్యుత చిత్ర' సాహి త్యంతో 'హర–హరుల' [శివ- కేశవుల] రక్షణ, ఒకేసారి వర్ణింపబడటం విశేషాన్తరం. దీనిలోని ఐతిహ్యములను గూడ అవగాహన చేసికొనవలెను.

శ్లో. యస్మా దాసీత్ కుమారః, కువలయ దలవత్-లీలయో వాహగఙ్గాం
వామా యస్యాంగసంగా, పిహిత జనచయో, యో గవీశధ్వజోఽపి,
లంకే శాద్యేక నాధో, హిమకర రుచిభృత్, భూవిశేషాశయోఽసా
వర్ణస్యాద్యస్య లోపాత్ - అపహరతు హరిః [రః] పాతకం
వః స్మరారిః॥

N. B. : పై శ్లోకంలోని విశేషణముల, ఆదివర్ణ సాహిత్య-రాహిత్యాలతో శివ-కేశవులు మీ పాపమును హరింతురు గాక!- అను కోరిక, లేక ఆశీర్వాదము ముఖ్యాంశమని గమనింపవలెను.

(6)

అద్యస్య-వర్ణస్య-లోపాత్ = మొదటి - అక్షరము యొక్క - చ్యుతివలన వచ్చిన అర్థము - యస్మాత్-[కు]మారః-అసీత్ = ఎవని (విష్ణువు) వలన - మన్మథుడు-పుట్టెనో, అనగా-మన్మథునికి తండ్రియు, [యః = ఎవడు], [గం] గాం-కువలయదల[ళ]వత్-లీలయా-ఉవాహ = భూమిని - కలువ-రేక పద్మ - పత్రము వలె-విలాసముగ-వహించెనో, [వా] మా-యస్య - అంగసంగా = లక్ష్మి - ఎవని యొక్క-వక్షఃస్థలము నంటి యుండునో, (పి)హిత జనచయః = జనసమూహము నకు మేలు (హిత-) చేకూర్చువాడో, యః-[గ]వీశ - ( = వి+ఈశ) ధ్వజః + అపి = ఎవడు గరుడధ్వజుడు-అయినను, (లం)కేశ ( = క+ఈశ)+అది + పతి నాథః = బ్రహ్మకు (క), శివునకు (ఈశ)-ముఖ్య ప్రభువో, (హి) మకర - రుచి భృత్ = మకరకుండల= కాంతిగలవాడో, (భూ) వి=శేష + అశయః = గరుత్మంతుడు-[వి], అదిశేషుడు (శేష)శయ్యగా గలవాడో, స్మర + అరిః = (దీనిలోని 'స్మ'ను చ్యుతంచేసి, 'ము'ను దత్తం చేయగా వచ్చిన, 'మురారిః' = 'ముర' అనే రాక్షసుని సంహరించిన, అసౌ-హరిః-వః-పాతకం - అపహరతు = ఇట్టి విష్ణువు - మీ యొక్క-పాపమును-అపహరించును- (పోగొట్టు)గాక !

ఇక, అది వర్ణచ్యుతి లేనపుడు వచ్చు రెండవ అర్థము:—

యస్మాత్-కుమారః—అసీత్ = ఎవనివలన — కుమారస్వామి — పుట్టెనో, (యః) గంగాం—కువలయదలవత్—లీలయా—ఉవాహ = (ఎవడు) గంగాదేవిని — కలువరేకువలె—విలాసముగా—ధరించెనో, వామా- యస్య-అఙ్గసఙ్గా = (అందగత్తెయగు) దుర్గ-ఎవని—శరీరార్ధభాగము—నాశ్రయించినదో, అనగా - ఎడమ భాగమున పార్వతిని ధరించినవాడును, పిహిత—జనచయః = (ప్రళయ కాలమున) ప్రజలనందరిని నాశనము చేయువాడును (లయకారుకుడును), యః—గవీశ—ధ్వజః + అపి = ఎవడు—నందీశ్వరుడు—జెండాపై గుర్తుగాగలవాడు—అయినప్పటికి, లంకా+ ఈశ + అది+పతినాథః = రావణాదులకు—ముఖ్యప్రభువో, లేక, రావణాదులను జంపిన — రామునకు ముఖ్యప్రభువో (రామేశ్వరుడో), హిమకర—రుచిభృత్ = చంద్ర— కాన్తి గలవాడును, భూవిశేష—అశయః = భూమిలో నొక విశేషభాగమగు కైలాసము — నిలయముగా గలవాడును,—అగు, స్మర+అరిః—హరః = మన్మథునికి- శత్రువైన ఈశ్వరుడు, వః—పాతకం అపహరతు.

N.B. : ఈ శ్లోకము నందలి విశేషణము లన్నిటిలోను ('స్మరారిః' తప్ప)

అక్ష్యక్షరచ్యుతి చే, నిది 'అక్షరచ్యుతి'కి ఉదాహరణము. 'స్మరారిః'లో మాత్రం 'స్మ' అక్షరాన్ని చ్యుతంచేసి, 'ము' అను అక్షరాన్ని, దాని స్థానంలో 'దత్తం' చేయుటవలన, నిది 'చ్యుత - దత్తాక్షరము'నకు ఉదాహరణమైనది. దీనిలో 'చ్యుతచిత్ర, చ్యుతదత్తాక్షర చిత్రము'ల సాయంతో శివ, కేశవుల రక్షణ వర్ణింపబడినది.

శ్లో. త్రైలోక్యే నోపమైతస్యాః సఖే! కిం మతి భాషసే ?
అనంతరా సాఽనాదిర్వా న తృతీయేతి మే మతిః । సురతాం.

N. B. . కాముకుఁడొకడు తన ప్రియురాలికి ఇలలో, కలలో కూడ సాటి వారులేరని, పొగడుకొనుచుండ, మిత్రుడు వానితో నిట్లనెను.

సఖే = మిత్రమా! త్రైలోక్యే—ఏతస్యాః—ఉపమా—న—ఇతి— కిం-భాషసే = ముల్లోకములందును—ఈనీ ప్రియురాలికి-పోల్చదగినది-లేదు—అని—ఏల గొప్పలు చెప్పుకొని తప్పులు వాయించుకొనుచున్నావు? ఏలయనగా—సా = ఆ-నీ- ప్రియురాలు, అనంతరా-అనాదిః —వా = అనంతరుకాలైన కావచ్చును, లేక అనాదియైనది కావచ్చును-అనగా ఈ రెంటింటిలో నేదో యొకటి కావచ్చును. కనుక, ఇక, తృతీయా-న—ఇతి-మే—మతిః = మూడవది మాత్రం-లేదు— అని-నా బుద్ధి దృఢనిశ్చయంతో నున్నది.

N. B. - 1. శ్లోకంలోని 'అనన్తరా — అనాదిః' సాభిప్రాయాలు, అంతర్గూఢార్థాలు గలవి, చమత్కారాలు, బాగుగా ఆలోచిస్తేనేగాని, అర్థంకావు.

2. మిత్రమా. నీవు చెప్పిన 'ఉపమా' పదంలోనే, రెండు పోలికలున్నాయి సుమా? ఎట్లన—ఆ 'ఉపమా'పదం 'అనంతరా' ( = న+అంతరా = మధ్య (అన్తరా) వర్ణమగు 'ప'లేనిదైనచో (ఉ(ప)మా) = 'ఉమా'గా మిగులుచున్నది గదా. అందుచే, ఆ—ఉమా( = పార్వతి) నీ ప్రేయసికి సాటియైనది కావచ్చును. లేకున్నచో, ఆ 'ఉపమా' పదాన్ని 'అనాదిః' = న+ఆదిః = మొదటివర్ణాలు రెండు ('ఉప')చ్యుతం చేసినచో, 'మా'( = లక్ష్మి) మిగులుతుంది. లేక 'ఉమా' పదం నుండి, అనాదిః = ఆదివర్ణమగు 'ఉ'ను తీసివేస్తే, 'మా' మిగులుతుంది. అప్పుడు ఆ 'మా = లక్ష్మి' నీ ప్రియురాలితో సామ్యం సంపాదింపవచ్చు, కనుక, నీ ప్రియురాలు (ఉ(ప)మా) 'ఉమ'తోగాని, (ఉప)'మా'తోగాని సాధర్మ్యం పొందగలదు

కనుక, 'త్రైలోక్యే నోపమైతసాః....” అని పొగడు కోవడం మంచిది కాదని. ఏ చమత్కారంగా, అంతర్గూఢ రసోదయంచేసి, హెచ్చరించినాడు.

అసలు, ఈ 'ఉపమా' అనే పేరు, ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఎలా, ఏమనుకొని పేరు పెట్టినారోగాని, దానిలో 'పెన్నిధి'(పెను+నిధి, దానిని గురించిన పెన్ = పెన్ను (కలము)లో, నిధి, తప్పకుండా ఉన్నది. 'పేరులోనేమ పెన్నిధి ఉన్నది ?” అని కొందరు సంశయాత్ములు, సందేహాలు సందేహాలు వెలిబుచ్చుతారు గాని ...'సంశయాత్మా వినశ్యతి' అనుమాట నిశ్చయము. దాని ముందు, 3-5 స్టార్ హోటల్-ఉప్మా' (ఉప్[ప్పు]—మా) బలాదూర్, దిగదుడుపు. ఆ 'మా' వైకృతము [తెలుగు], అన్యయమునై, మిక్కిలి, మా బాగు మో. ప్రశంసార్థ మును, తమిళ, కర్ణాటాది భాషలలో తల్లిని, సంస్కృతంలో 'లక్ష్మి'ని కూడ తెల్పుతోంది అంతియేకాక, దానితో'మా'[తో] సమానమైనది. లేదు, కాదు, వలదు (మా)అంటూ ఈ నిషేధార్థాన్ని గీర్వాణంగా కూడ చెప్పుతోంది. అలం విస్తరేణ. ఈ క్రింది పద్యాన్ని కూడ ఒక్కసారి పరిశీలించండి.

శ్లో. విదుషాం ప్రమదాయ సోపసర్గా
గరుడాంకస్య ముదే గతోపసర్గా
అపకారవతీ ప్రియాయ శంభోః
'ఉపమా' సా ప్రతిభా త్యనేకరూపా ।

'ఉపమా' = పోలిక, సాదృశ్యము, (Semele) అది ఒక అలంకారమే కాదు. వేదోపనిషత్ప్రభృ కాలంనుండి 'అది అలంకారం'గా అభిజ్ఞాతమై యున్నది. అదియొక ముఖ్య శైలూషి (నట్టువరాలు) వై. సాంస్కృతిక, నాట్య సాహిత్య రంగాలలో చిత్రవిచిత్ర భూమికలను భూషిస్తూ, వర్తిస్తూ, తద్విదాం చేతస్యులను చక్కగా, చిక్కగా, రఞ్జింపజేస్తోంది.

అది 'ఉప'అను ఉపసర్గతో కూడినదై 'ఉప'+మా) పండితుల యొక్క మతి(జ్ఞానము)ను పరీక్షించి, ప్రమోదాన్ని కల్గిస్తుంది. ఆ 'ఉప' ఉపసర్గను 'చ్యుతం'చేస్తే, 'మా'(=లక్ష్మి)గా మిగిలి, గరుడవాహనుడగు విష్ణువుకు సంతోషాన్ని గల్గిస్తుంది. ఇక 'అపకారం'చేస్తే, అనగా 'ఉపమా'లో మధ్యలోనున్న 'ప'కారాన్ని 'చ్యుతం' చేస్తే, 'ఉ [ప] మా'= 'ఉమా' (పార్వతి)గా మిగిలి, శివరంజనం చేస్తుంది, ఇలా, ఈ 'ఉపమ' అనేక విధాలుగా ప్రతిభాసిస్తుందిసుమా!

N. B. : 'ఉప' అను ఉపసర్గను 'దత్తం' చేయుట వలన, ఇది 'దత్తచిత్ర'మునకు, ఈ 'ఉప'ను మధ్యలోనున్న 'ప'ను చ్యుతం చేయుటవలన, 'చ్యుతచిత్రము'నకు కూడ ఉదాహరణ మగుచున్నది కనుకనే రాజశేఖరుడు.

అలంకార శిరోరత్నం సర్వస్వం కావ్యసమ్పదామ్
ఉపమా కవివంశస్య మాతైవేతి మతిర్మమ॥

అలంకార చూడామణి, కావ్యసంపత్ సర్వస్వమునైన, 'ఉపమాలంకారము, కవికుల జనని'యని నా దృఢ విశ్వాసము అని రాజశేఖరకవి విశ్వసించి, చెప్పెను.

# పదచ్యుతకము - గర్భకవిత

**N. B.: ఒకే అక్షరమునుగాక, అద్యంతములందున్న అనేక — అక్షరములను (పదములను), గూడ, 'చ్యుతం' చేయవచ్చును. ఈచ్యుతివలన, ఛందస్సు, వృత్తం కూడ మారి, అర్థాంతరములతో 'గర్భకవిత్వము'నకు కూడ దారి చూపినట్లైను. వస్తుతః ఆ 'గర్భ కవిత్వము' చిత్ర కావ్యమున 'గిజిగాని గూడు' వంటిది.**

ఈ క్రింది శ్లోకమును పరిశీలించండి.

శ్లో. నతనాకి మౌళి మణి మండలీవిభా—
భరభాసురాంఘ్రి సరసీరుహానవా।
తవ శర్మణే భవతు భారతీ భృశం
దృఢజాడ్య ఖండన దినేశభాతతిః॥ దేవేశ్వర—కవికల్పలత

నత-నాకి—మౌళి—మణిమండలీ—విభా—భర—భాసుర+అంఘ్రి-సరసీరుహ+అవనా=నమస్కరించు—దేవతల—శిరస్సులందలి—రత్నసమూహ- కాంతియొక్క— అధిక్యంతో—ప్రకాశించుచున్న—పాద పద్మముల యొక్క ఉనికిగలదియు, దృఢ — జాడ్య—ఖండన—దిన+ఈశ-భా—తతిః= అధిక—మూర్ఖత్వమును — ఛేదించుటలో— సూర్యసమాన—కాంతి—సమూహము గల్గినట్టిదియు, అగు, భారతీ = సరస్వతీదేవి, తవ—భృశం—శర్మణే-భవతుః నీకు—మిక్కిలి-సుఖమును—కల్గించుగాక!

ఈ శ్లోకమున 'స-జ-స-జ-గ' అనుగణము లుండుట వలన, వస్తుతః 'మంజుభాషిణీ' వృత్తమగుచున్నది. 'సజసాజగౌ భవతి మఞ్జుభాషిణీ' (వృ.3-74). ఇప్పుడీ వృత్తంయొక్క 1. ఆదియందును, 2. అంతమందును, 3 అత్యంతము లందును—ఉన్న రెండేసి, రెండేసి అక్షరాలను చ్యుతంచేయుటవలన, ఇతరవృత్తము లగుటకు వీలున్నది. అనగా, ఈ 'మంజుభాషిణీ' వృత్తగర్భమున, మరికొన్ని వృత్తములు గర్భితములై ఉన్నవనుట నిక్కువము. ఎట్లనగా—

ఈ శ్లోక—ప్రతిపాదం యొక్క రెండు అద్యక్షరాలను తొలగించిన, 1. 'ర-న-ర-లగ'ములతో 'రథోద్ధతా' వృత్తమగును. "రాన్నరావిహ రథోద్ధతా లగౌ" (వృ 3-‍8).

శ్లో. నాకిమౌళిమణి మండలీవిభా—
భాసురాంఘ్రి సరసీరుహావనా।
శర్మణే భవతు భారతీ భృశం
జాడ్యఖండన దినేశభా తతిః ।

2. అట్లే, శ్లోక—ప్రతిపాదం యొక్క, చివరనున్న రెండక్షరాలను తొలగించిన, 'న-జ-స-లగము'లతో 'నందినీ' వృత్తమగును. ఉదా :

శ్లో॥ నతనాకిమౌళిమణి మణ్డలీ —
భరభాసురాంఘ్రి సరసీరుహా।
తన శర్మణేభవతు భారతీ
దృఢజాడ్యఖండన దినేశభా ।

3. ఇక, శ్లోకంయొక్క, ఆది-అంతములందున్న రెండు, రెండు అక్షరాలను 'చ్యుతం' చేసిన 'ర-న-ర' గణాలు గల, ఈ క్రింది 'భద్రికా' వృత్తమగు చున్నది.

శ్లో. నాకిమౌళిమణి మండలీ-భాసురాంఘ్రిసరసీరుహా।
శర్మణే భవతు భారతీ-జాడ్యఖండన దినేశభా॥

ఇట్లు, శ్లోకం యొక్క 'ఆది-అన్త-అన్యత్రమ' లందలి రెండేసి అక్షరాలను క్రమంగా ఖండించి, చ్యుతం చేయగా, వేర్వేరు వృత్తములుగా మారినను, ఇవి ఏవియు, అన్యార్థప్రతీతిని ఆరగించుటలేదు. అందువే, ఇవి కూడ 'అక్షరపు, చ్యుతక' భేదములే కాక, 'గర్భ కవిత్వము' కలవి కూడ అగుచున్నవని గమనింపవలెను.

N. B. శ్రీ. శే. రావూరి దొరసామిశర్మగారు, మరికొందరు పండితులు 'సంస్కృతంలో గర్భకవిత్వం లేదు' అన్నారు, కాని, ఈ దేవేశ్వరుని శ్లోకమును, బట్టి, దీని తర్వాత ఉదాహరింపబడనున్న, హేమచంద్రాచుల శ్లోకముల ననుసరించి కూడ, సంస్కృతమున 'గర్భకవిత ఉన్నది'-అని తెలిసికొనగలము. మరికొన్ని ఉదాహరణములు .—

1. ఆచార్య హేమచంద్రుని 'కావ్యానుశాసన'- నవమ (9) ప్రకరణమున చూపిన, క్రింది, 'వర్ణచ్యుత కో'దాహరణము కూడ 'గర్భ కవితా స్తిత్వ — నిదర్శనము.

చ. శ్రితనృశిరః ప్రజారచితమౌళి శిరోమణిమాక్తికై స్తథా
శిఖరుచిరోర్ధ్వ దృక్ప్రుథులలాటతటే తిలకక్రియా చ సా।
స్ఫుటవికటాట్టహాసలలితం వదనం స్మితపేశలం దధత్
అభినవ మీశ్వరో వహతి వేష మహో తుహినాద్రిజార్ధయుక్

'న-జ-భ-జ-జ-జ-ర' గణాలుగల. ఈ సిద్ధచ్ఛంద శ్లోకమున, 'గౌరీవర్ణన' చేయబడినది. ఇపుడీ శ్లోకంయొక్క ప్రతిపాదంలోని ఆద్యక్షరాలు రెండింటిని. అంత్యమందున్న ఏడు (7) అక్షరాలను 'చ్యుతం' చేసినచో, 'స-జ-స-స' గణాలతో, నది 'ప్రమితాక్షరా' వృత్తమై, ఈశ్వరుని వర్ణించును. 'ప్రమితాక్షరా సజససైరుదితా' [వృ. 3-60] ఎట్లన—

నృశిరః ప్రజారచిత మౌళిరో-
రుచిరోర్ధ్వ దృక్ప్రథులలాటతటే
వికటాట్టహాసలలితం వదనం
వష మీశ్వరో వహతి వేష మహో॥

అల్లే, శ్లోకంలో మొదటనున్న ఏడు [7] అక్షరాలను, చివరనున్న రెండు అక్షరాలను, చ్యుతం చేసిన, 'న-భ-భ-ర' గణాలతో 'ద్రుతవిలంబిత' మను వృత్తమై 'గౌరీ వర్ణన' చేయగలదు. "ద్రుత విలంబిత మాహ నభౌ భరౌ" [వృ. 3-49]

రచితమౌళి శిరోమణి మౌక్తికైః
పృథులలాటతటే తిలకక్రియా।
సులలితం వదనం స్మితపేశలం
వహతి వేష మహో తుహినాద్రిజా॥

N. B. : పై 'నతనాకి .......' శ్లోకంలో గర్భితాలైన, అనేక భిన్న శ్లోకాల అర్థాలను అవగాహనం చేసుకొన్న పాఠక ప్రభువులను, మరల ఈ శ్లోకాల యొక్క నానార్థాలతో పేజీలను నింపి, విసుగాకర్షణంచేసి, నొప్పింపుట కిష్టపడక, అర్థవివరణము విడచినందులకు క్షంతవ్యులము. వస్తుతః, ఇక్కడ, నానార్థ వివరణ కంటె, 1. 'అక్షరచ్యుతి'చే నానావిధచ్ఛందస్సు లేర్పడుట, 2. శ్లోకము గర్భకవితా పూర్ణమగుట-అనునవియే ముఖ్యవిషయములని, వానిని గమనింపుటయే పరమార్థమని, వేరుగా చెప్పవలసిన పనిలేదు.

మరియు, 'సంస్కృతమున చంపకమాలావృత్తములేదు' అను - కొందరి వాదమును కూడ, ఈ శ్లోకము పరాస్తము చేసినది.

శ్లోకప్రథమార్థంలోని ఏకాంతరితాక్షరాలను, వేర్వేరుగా, చ్యుతిచేసి, మరల వానిని కలిపి, తృతీయ-చతుర్థ పాదాలతో క్రమంగా, ఉత్తరార్థమును సృష్టించిన, ఈశ్వరశతకకర్త—అవతార కవియొక్క కవితానైపుణ్యమును కూడ నాణ్యంగా పరికింపుడు.

1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 .
శ్లో. ము ధీ సా ర జ్ఞ తా భ వ్య జ య మా సా మ గ శ మః।

1 3 5 7 9 11 13 15 2 4 6 8 10 12 14 16
ము సా జ్ఞ భ జ మా మ శ ధీ ర తా వ్య య సా గ మః॥ అ.ఈ. 91

ఈ శ్లోకం మొదటి సగంలోని ఏకాంతరితాక్షరాలను, అనగా - ఒక్కొక్క అక్షరాన్ని దాటవేయగా వచ్చిన అక్షరాలతో, అనగా 'బేసి' అక్షరాలతో మూడవ

పాదం, నరి అక్షరాలతో నాల్గవ పాదం ప్రభవిస్తుందని భావం అనగా, శ్లోకపూర్వార్ధంలో ఉత్తరార్థం ఏకాన్తరితమై గర్భితమై యున్నదన్నమాట!

ఈశ్వర శతకం-లో అవతారకవి కల్పించిన 'గాథాగర్భ' శ్లోకమును కూడ పరిశీలించండి

శ్లో. అక్షయ్యం క్షీణపాదం నృబుధహతభయం సత్ఫలం ధీరచిత్తం
తుంగం శ్రీ సారరక్షో సురహతి రభసం త్వాంపగాంగం శ్రితం వా।
చర్యాలక్షేణ లోకక్షమ మలయ మహాసంక్రమం స్త్వైర సజ్జం
స్థాణోస్వాబద్ధ సర్వాహవగరిమగుణం కేతు నే హ స్తువన్తి ॥ ఈ 93

హేస్థాణో!=ఓ రుద్రా! ఇహ-త్వాం-కే-న-స్తువన్తి=ఈ ప్రపంచంలో నీమ్న-ఎవరు-స్తోత్రం చేయరు? అందరు స్తుతింతురని భావము. ఎందు చేతననగా-అక్షయ్యం=క్షయ (నాశ) రహితుడవై నట్టియు, క్షీణపాదం=నశించిన సంసారం (పాదః) కల్గినట్టియు, నృ-బుధ-హతభయం=నరులకు, దేవతలకు-భయమును పోగొట్టిన,సత్-ఫలం=సత్పురుషులకు-భుక్తిముక్తి ఫలప్రదాతయు, ధీర-చిత్తం=భక్తులనను గ్రహించు స్థిర-హృదయముగల, తుంగం=అత్యున్నతుడై నట్టియు, శ్రీ సారరక్షో సురహతి రభసం=సంపద్బలంతో సగర్వంగా నున్న రాక్షసులను అసురులను సంహరించుటకు త్వరపడుచున్నట్టియు, చర్యాలక్షేణ=అనేక ఆ చారము లతో (సర్వదర్శనములు తలకొక ఆచరణను దెల్పుటవలన) శ్రితం=సేవింప బడినట్టియు, సగఙ్గం=గంగను ధరించినట్టియు, లోకక్షమం=సప్తలోకములందును సర్వసహుడవై న, అ-లయ, మహా-సంక్రమం=అవి నశ్వరమగునట్లు-బాగుగా చొచ్చుకొని పోవునట్టియు, స్త్వైర-సజ్జం=స్వయంగా నే-సన్నద్ధుడగునట్టి. స్వ+ఆబద్ధ-సర్వ+అహవ- గరిమగుణం = స్వయంగా-చేసిన-సర్వరాక్షసయుద్ధాంలో-శ్రేష్ఠగుణములుగల్గిన,-నిన్ను, ఈ లోకమునందెవ్వరు స్తుతింపరు? అని పూర్వ భాగంతో అన్వయము.

ఇది 'గాథ' గర్భమగుటచే, దానిలో నిమిడియున్నగాథ-
అయ్యంణద బుహభమలం రత్తంగం సారసురహసా సజ్జమ్।
లెం చలణకమల పనమం రజ్జంణో పనహగముణ తుహా॥
ఈ గాథ (ఒక ఛందోభేదము)కు సంస్కృతీకరణ మెట్టిదనిన-
'అర్యనత బుధభ్రమరం రక్తాంగం సారశుభరసానజ్జమ్।
తవ చరణకమల మ నమం రాజ్యం వోవృషభగమనతవ॥

విశ్వస్యహేతు రమరై ర్భహా గీయసే త్వం
విశ్వంభరే శివశివే శ్రీ గుణాత్మ మూర్తే!

చిద్వ్యోమతోఽపి పరమాం ప్రథమాం వద న్తి,

త్వాం యోగినః స్తుతిపరాః ప్రణిధానబుద్ధ్యా॥

ఈ 'వసన్తతిలకా' వృత్తము దుర్గాదేవీ స్తుతిపరమైనది. "ఉక్తా వసన్తతిలకా 'తభజాజగౌగః' (వృ 3-79) "త-భ-జ-జ గణాలు+రెండు గురువులున్నచో "వసన్తతిలకా" వృత్తమగును ఈ వృత్తమును కాశ్యపముని "సింహోన్నత"గా భావించెను.

విశ్వస్య హేతు రుపహంగియపే త్వం విశ్వంభరేశి త్రిగుణాత్మమూర్తే

చిద్వ్యోమతోఽపి ప్రథమాం వద న్తి త్వాం యోగినస్తు ప్రణిధానబుద్ధ్యా॥

N. B. పై "వసన్తతిలకా" వృత్తములోని 6, 7, 8 అనుమూడు అక్షరాలు గల పదాలను "చ్యుతం' చేసిన, మిగిలిన "త.త. జ. గణాలు+రెండుగురువులతో క్రిందచూపిన "ఇంద్రవజ్రా" వృత్తమగును. "స్యా" "దింద్రవజ్రా' యదితౌ "జగౌగః' (వృ 3- 8) పై శ్లోకము 'ఇంద్రవజ్రా" గర్భితమగు "వసన్తతిలకా" వృత్తము. దీని ప్రతి పాదము నుండి మూడక్షరాల పదాలు "చ్యుతాలగుట' చే 'ఇంద్రవజ్రా" వృత్తముగామారి, "శివస్తుతి ని తెల్పుచున్నదని తెలియవలెను.

# అక్షర-వ్యఞ్జన చ్యుతకమ్

శ్లో. విషం భుంక్ష్వ సహామాత్యైః వినాశ ము పయాస్యసి।

నాభ్యాం కేనాపి రాజేంద్ర! కృష్ణాజిన మకంటకమ్॥ చా చ.

రాజా! మంత్రులతోపాటు విషమును త్రాగుము, నాశమును పొందగలవు ... ఇత్యాది అర్థం సరిపోతుందా? ... కనుక,

రాజేంద్ర! రాజ శ్రేష్ఠా!, విషం=పోయిన(విగత) 'ష' కారము గల్గినట్టియు, నాభ్యాం=రెండు "న' కారములతోను; కేన+అపి=(ఇంకను) ఒక "క' కారముతోను; వినా=లేకుండునట్లుగా చేసిన, 'కృష్ణాజినం=రాజ్యమును (?) అకంటకం=విఘ్నంటకముగ, ఎదురులేకుండ, అహాత్యైః-సహ=మంత్రులతోపాటు,భుంక్ష్వ=అనుభవింపుము వినాశం-ఉపయాస్యసి= సర్వనాశనము నొందగలవు. కాదు. వి (గత)- నాశం=పోయిన నాశమును, అనగా, నాశనం నష్టమైపోగా మిగిలిన జయమును పొందగలవు. లేక-వినా="వి"లేకుండా శం=సుఖమును ఉపయాస్యసి=పొందగలవు.

N B. కృష్ణాజినం=రాజ్యం?-ఎట్లగునని ప్రశ్న? ఆ 'కృష్ణాజినం" పదాన్ని విగదీసిన, దానిలో= క్-ఋ-ష్-ణ్-ఆ-జ్-ఇ-న్-అ-మ్" అను పది వర్ణములు గలవు పైన చెప్పినట్లు, ఆ పదినుండి "ష్-ణ్-న్-క్ అను నాలుగు హల్లులను తీసివేసిన, 'ఋ-ఆ-జ్-ఇ-అ-మ్' అను అరక్షరాలు మిగలగా, వానికి సంధులు

చేసి కలిపిన 'రాజ్యం' అగును అట్టిరాజ్యమును అడ్డులేకుండ అనుభవింపుము-అని రాపు గారి నాశీర్వదించుట ప్రస్తుతాంశము

వి. శ్లోకంలో వస్తుతః "కృష్-న" ఉండవలసి యుండగా, "ష"కార సంబంధము చేత "న"-ణ గా మారి, కృష్-ణ=కృష్ణగా మారినట్లు గమనించవలెను.

పూర్వోదాహరణములలో 1,2 వ్యంజనములు మాత్రమే చ్యుతములు కాగా, దీనిలో నాలుగు వ్యంజనములు చ్యుతములు అయినవి. కాగా, వచ్చిన అర్థముకూడ, ఆశ్చర్య-ఆనందకారి యగుచున్నది

## కవి కర్ణపూరుని "అలంకార కౌస్తుభమ్" లోని "సింహావలోక శ్లోకాన్తర గర్భశ్లోకమ్"

శ్లో తేజః కించన (2 త త్తదస్య) పరకం (1 నవ్యాంబుదాభం భజ)
స్నిగ్ధంలోచన (4 లోభదంచ) తురతా (3 లీలావిలాసావలి)।
ఆ శ్చర్యస్తయ (6 తాం రసస్య) సరణిం (5 శ్రీరాధికాప్రౌఢిమ)
ప్రేమార్ద్రీ రుచి (8 రచ్ఛవిస్మ) రవతీం (7 క్రీడాందధద్ధామసు)॥ 7-74.

పై శ్లోకంలోని 1,2,3.... మొ అంకెలతో బ్రాకెట్లలో నున్న పదాలను, క్రమంగా కలిపి, వ్రాసికొన్నచో, ఈ శ్లోకంలో గర్భితమైన మరొక క్రింది శ్లోకం బహిర్గతం కాగలదు

ఎట్లన- శ్లో నవ్యాంబుదాభం భజ త త్తదస్య
లీలావిలాసావలి లోభ దం చ।
శ్రీరాధికా ప్రౌఢిమతాం రసస్య
క్రీడాం దధ ద్ధామ సురచ్ఛవి స్మ। 7-75

ధ్వని ప్రస్థాన ప్రతిష్ఠాపనాచార్య ఆనందవర్ధనుడు "అక్షర- పదచ్యుతి"తో "దేవీశతకం' లో సృష్టించిన సుదుష్కర శ్లోకము.

శ్లో. త్వం సా జ్ఞాసు జగన్మాతః సృష్టం జాతా సువర్త్మను।
ప్రజ్ఞా ముఖ్యా సముద్భాసి తత్ పృథుత్వం ప్రదర్శయః దే 97

ధ్వన్యాచార్యుడీ శ్లోకంనుండి కొన్ని వర్ణాలను, పదాలను, మొదట 'చ్యుతం చేసి, మరల వానిని వేరొకక్రమంలో 'దత్తం' చేసి, అన్యార్థ కల్పనతో, ప్రత్యేకంగా 'ఆర్యా' ఛందోభేదమును ఆవిర్భవింపజేసి, తన ప్రత్యేకతను ప్రదర్శించుకొనెను

ఆ అక్షర-పద 'చ్యుతి'తో, అన్యత్ర 'దానం'తో [illegible] క్రింద వ్రాయబడినది.



శ్లో. అజ్ఞాను జగన్మాతః స్పష్టం జాతా సువ_ర్ణ ను ప్రజ్ఞా।
భాసి త్వం సాముఖ్యానముత్ పృథుత్వం ప్రదర్శయ తత్॥ దే. 98

దీనిని బట్టి, ఆనంద వర్ధనుని నాటికే, 'చ్యుత-ద త్తచిత్రములు గర్వ-కవిత్వాం కురములు గలవని ద్యోతకమగుచున్నది. ఇట్టి, అనేక చిత్రకావ్య కల్పనలతో పాటు, ధ్వనిప్రస్థానానికి ధ్వజమెత్తిన ఉత్తమకావ్య విశేషాన్ని వ్యంజింపజేసిన ఆనన్దవర్ధనాచార్యుడు ఎవరికి ఆనందాన్ని అధికం చేసి, తన నామాన్ని సార్థకం చేసి కొనలేదు? అనగా-శబ్ద, అర్థ, వ్యంగ్య ప్రధానవాదులందరికి తరతమ భేదంతో ఆనందాన్ని పంచి, ప్రదర్శించి, ప్రస్తుతుడైనాడు మన ఆనందవర్ధనాచార్యుడు.

"ఆనన్దవర్ధనః కస్య నాసీ దానన్దవర్ధనః"

ఇట్లే, వాగ్భటుని "కావ్యాను శాసనం" యొక్క, చతుర్థాశ్వాసమందలి "పర హితతత్పరో.... ..." ఇత్యాది శ్లోకం కూడ "గర్వకవిత--సూచక"మని గమ నింపగలము (విస్తరభీతితో వివరింపలేదని మనవి)

# చ్యుత-దత్త-చ్యుతదత్తాక్షరా చిత్రములు

భోజమహారాజీ చిత్రములను "సరస్వతీకణ్ఠాభరణము'న నిట్లు వివరిం చెను.

శ్లో. 1. ప్రహేలి (లి)కా సకృత్ప్రశ్నః సాపి షోఢా చ్యుతాక్షరా।
దత్తాక్షరో భయం ముష్టిః బిన్దుమ త్యర్థవ త్యపి। స.కం. 2-133.
2. క్రీడాగోష్ఠీ వినోదేషు తద్జ్ఞై రాకీర్ణ మంత్రిదే।
పర వ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేలికాః॥ కా ద 3-97

1 భోజరాజీ ప్రహేలికను— 1. చ్యుతాక్షర 2 దత్తాక్షర 3 చ్యుతదత్తాక్షర (ఉభయం) 4 ముష్టి 5. బిన్దుమతి 6 అర్థవతి—అని ఆరు (6) విధాలుగా విభజించి దణ్డి మహాకవి 'కావ్యాదర్శం' లో చెప్పిన 'ప్రహేలికా ప్రయోజనముల నిట్లను వదించెను.

2 ఈ ప్రహేలికలు శబ్దాది క్రీడలందును, పండిత ప్రకాండుల గోష్ఠులందును, మనస్సునకు వినోదమును కల్గించుటలోను, లేక క్రీడా గోష్ఠులలో, మనస్సున వేడుకగల్గించి, ఆశ్చర్యపరచి, ఆనందమును అందించుటకును ఉపయోగపడుచున్నవి. మరియు, ప్రహేలికా ప్రయోగ జ్ఞానముగల పండితుల సభలలో, అంతటను వ్యాప్తి జెందిన రహస్యార్థాలోచన చేయుటయందును, పరులకు పరమాను రాగమును కల్గించి నను, స్పష్టార్థమును మాత్రము కల్గింపనీయక, అత్యంత మోహమున (అజ్ఞాన

మున) పదవేసి, సందిగ్ధమనస్కులను చేయుటలో గూడ, ఈ ప్రహేలికా చిత్రములు పరమ ప్రయోజనము నందింపగలవు.

అలంకారికులు కొందరు ప్రత్యేక చిత్రాలంకారములుగా ప్రపంచించిన చ్యుత-దత్త-ఉభయ చిత్రాలను, భోజమహారాజు ప్రహేలికా న్తర్గతాలుగా ప్రపంచించి, ఇట్లు దాహరించెను.

శ్లో॥ పయోధరభరాక్రాన్తా సన్నమన్తీ పదే పదే।
పద మేకం న కా యాతి? యది హారేణ వర్జితా। స.కం. 2–359.

పయః ధర-భర+ఆక్రాన్తా=నీటితో నిండి కుండలబరువుతో నున్న-'కావడి బద్ద', పదే-పదే-సన్నమన్తీ=అడుగడుగున-ఊగులాడి, వంగుచు, (కా)హారేణ వర్జితా-యది = కావడి మోయువాడు-లేకున్నచో, ఏకం-పదం-న-యాతి=ఒక్క-అడుగుకూడ-ముందుకు పోజాలవిది–కా=ఏది? అని ప్రశ్న.

అనగా-పయోధరముల (నీటితో నిండిన కుండల) బరువుతో మున్నది. 'కావడి', ఆ కావడిని మోయువాడు లేకున్నచో (కాహారేణ-వర్జితా), ఒక్క-అడుగు కూడ ముందుకు సాగజాలదు-అని చెప్పవలసి యుండగా, ఈ 'కాహారేణ'లోని "కా"ను చ్యుతం చేయుట వలన-"హారేణ వర్జితా" మిగిలి, "ఉన్నత స్తన (పయోధర) భారంతో, అడుగడుగున తొట్రుపడుచు చంద్రహారము లేకున్నచో (ఆమె) ఒక్క అడుగుకూడ ముందుకు—పోజాలదు" అను అన్యార్థముతో చెప్పబడినది.

శ్లోకంలోని విశేషణాలు యువతికి, కావడిబద్ద (విహంగికా)కు, రెంటికి సరిపడినవి 'కాహారేణ' ఉండవలసియుండగా, 'కా' అను అక్షరమును చ్యుతంచేసి, 'హారేణ' అని చెప్పుటవలన, ఇది 'చ్యుతాక్షర'మైనది

N B ఈ విషయమున, 'సాహిత్య దర్పణ' కారుడగు 'విశ్వనాథు'ని యొక్కయు, తద్వ్యాఖ్యాత యొక్కయు మతములు కూడ మాన్యములే

శ్లో. రసస్య పరి పంథిత్వాత్ నాలంకారః ప్రహేలికా।
ఉక్తివైచిత్ర్య మాత్రం సా చ్యుత–దత్తాక్షరాది కా॥ సా ద.

"రస పరి పుష్టినడ్డగించుట వలన, చ్యుతి–దత్తాక్షరాది రూపమైన 'ప్రహేలిక' అలంకారము కాదు. అది ఉక్తివైచిత్ర్యము'ను మాత్రమే తెల్పును అని విశ్వనాథుని వివరణ కాగా, 'రస పరి పంథియగుట దోషమైనను, ఉక్తివైచిత్ర్యముతో, దీని నుద్ఘాటించిన, ప్రాచీనులగు భోజాదులు అలంకారముగా పరిగణించిరి. అని అన్యుల అభిభాషణ. "వైచిత్రమలంకారః అని 'సౌందర్యమలంకారః" అని

కొందరు అలంకార సామాన్యలక్షణమనుటచే,విశ్వనాధుడుచెప్పిన 'ఉక్తివై చిత్ర్యము' పై ప్రహేలికలలో నుండుటవలన-దీనికలంకారత్వము సిద్ధించుచున్నదని, కొందరు నవీనులు.

ఇక, సాహిత్య దర్పణ వ్యాఖ్యాత వివరణ.

శ్లో. మాత్రాబిందుచ్యుతికే ప్రహేలికాకారక క్రియా గూఢే!
ప్రశ్నోత్తరాది దాన్యత్ క్రీడామాత్రోప యోగ మిదమ్॥

మాత్రాచ్యుతక, బిందు చ్యుతకములు, ప్రహేలికలు, కారక—క్రియా గూఢ చిత్రములుగా, మరియు ప్రశ్నోత్తరాదులు ఇవన్నియు క్రీడామాత్రోప యుక్తములు. అని, ఉద్ఘాటించిన వ్యాఖ్యాత, 'ఆది' పదగ్రాహ్యముల నిట్లువివరించెను

"1............చ్యుతాక్షరా=అయుక్తై కాక్షరా, దత్తాక్షరా=ఉక్తాధికాక్షరా, చ్యుత దత్తాక్షరా=ఏకాక్షరం చ్యావయిత్వా, తత్స్థానే దత్తావరాక్షరా ..........' అనియు నిర్వచించెను.

N.B. అనగా-1. అయుక్త ఏకాక్షరా=చేర్చబడని ఒక అక్షరం గలది, అనగా, ఒక అక్షరం చేర్చబడవలసియుండగా, దానిని చేర్చక, చ్యుతంచేసి చెప్ప బడినది 'చ్యుతాక్షరా' అగుచున్నదని తెలిసికొనవలెను.

1ఎ. ఒకే అక్షరం 'చ్యుతం' అగుట-అని, ఇక్కడ చెప్పబడినను,తర్వాతి అలం కారికులు, ఏకాధికాక్షరచ్యుతి, పదచ్యుతి చేసి, అర్థాంతరములను, వృత్తభేదములను (గర్భ కవిత్వమును) కూడ కల్పించి, చూపినట్లు ఇతః పూర్వమే వివరించి యున్నాము. ఆ ఏకాక్షరం కూడ ఆద్యక్షరమేకాక, మధ్యాక్షరం లేక అన్త్యాక్షరం కూడ కావచ్చును.

2 ఉక్త-ఏక—అధికాక్షరా-అనగా, ఒక అక్షరాన్ని అధికంగాచేర్చి చెప్పుట అనగా, అది "దత్తాక్షర" అగుచున్నది

3 ఒక అక్షరమును (ముందు) తొలగించి, దాని స్థానమున, మరొక అక్షర మును దత్తం చేయుట (ఉంచుట) వలన "చ్యుత దత్తాక్షరా"అగుచున్నదని భావం

ని. ఇతర వివరములను, ముమ్ముందు ఉదాహరణములందు గాంచగలరు.

# 1. చ్యుతాక్షరా

శ్లో॥ భవాన్ హి భగవా నేవ గతో భేదః పరస్పరమ్ ।
మహ త్యాగ దయాయుక్తః సత్యభామా విరాజితః ॥

ఓ రాజా! భవాన్-భగవాన్-ఏవ = నీవు-(నిజంగా) భగవంతుడ-వే సుమా! హి=ఎందుచేతననగా, పరస్పరం-భేదః-గతః = మీ యిద్దరిలో (రాజ-భగవంతులలో) ఉన్న-తారతమ్యము (తేడా) పోనే పోయినది ఏలయనగా—నీ వన్నచో— మహ-త్యాగ-దయా-యుక్తః=ఉల్లాస-దాతృత్వ-కరుణా గుణములు కలవాడవు. (మరియు) సత్య-భామా – విరాజితః = నిష్కపట-నాయికలతో లేక, యథార్థమగు-కాంతితో (భా), సంపదతో (మా) విరాజిల్లుచున్నావు అట్లే, భగవంతుడు కూడ, మహత్యా-గదయా-యుక్తః =[భగవంతుడు] "కౌమోదకీ అను పేరు గల గొప్పగదను ధరించియుండును. మరియు కృష్ణావతార సమయమున-సత్యభామా-విరాజితః = సత్రాజిత్తు కూతురగు "సత్యభామ తో ప్రకాశించినవాడును. లేక నిష్కపటలగు [గొల్ల] భామలతో క్రీడించిన వాడును.

కనుక "భవాన్-భగవాన్" మీరిద్దరు, శిష్ట విశేషణ-పదచ్ఛేద భేదంతో, మహత్యాగ దయాయుక్తులే, సత్యభామా విరాజితులే, మీ యిద్దరిలో ఏ మాత్రం తేడా లేదన్నమాట కాని, రెండవ "భగవాన్" పద మధ్యంలో "గ"కారం ఉండటమే తేడా గనుక, ఆ 'గ' అనే అక్షరాన్నికూడ 'చ్యుతం" చేస్తే, "భ(గ)వాన్' కూడ "భవాన్ అవుతాడు పదచ్ఛేద భేదంతో, శ్లేషతో, చమత్కృతములైన రెండర్థాలు కూడ సరిపడుచున్నవి కనుక, ఇదియు ఒక విధంగా "చ్యుతాక్షరా చిత్ర మగుచున్నది.

2. శ్లో॥ భవిత్రీ రంభోరు! త్రిదశ వదన గ్లాని రధునా
స తే రామః స్థాతా న యుధి పురతో లక్ష్మణ సఖః ।
ఇయం యాస్య త్యుచ్చైః విపద మథ తే వానరచమూః
లఘి ష్ఠేదం షష్ఠాక్షర పదవిలో పాత్ విత పునః ॥ అ.కు.

శ్లోకము సీతారావణ సంవాదపరము మూడు పాదాలలో రావణుడు తన గొప్ప తనమును చెప్పుకొనగా, నాల్గవ పాదం సీతా ప్రత్యుత్తరం

రంభోరు!-అధునా - త్రిదశవదన గ్లానిః - భవితా=ఓ సీతా!-నేడు దేవతల మొగమున-బడలిక [దుర్బలత్వము, హాని....] బయల్పడనున్నది లక్ష్మణ సహః-నః-తే-రామః = లక్ష్మణునితో గూడిన-ఆ-నీ-శ్రీరాముడు, యుధి-పురతః స్థాతా-న=యుద్ధమున-ముందు-ఉండువాడు-కాడు. (ఇక ఉండడు సుమా!) అథ = అటు పిమ్మట, ఇయం-తే-వానర చమూః = ఈ-నీ-సైన్యమైన కోతిమూక, ఉచ్చైః-విపదం - యాస్యతి=గొప్ప-ఆపదను-పొందగలదు-అని పై మూడు పాదాలలో రావణుడు రాముని కి రాబోవు అవస్థను, సీతకు చెప్పగా, నాల్గవ పాదము సీతా ప్రత్యుత్తరము. ఎట్లన—(హే) లఘిష్ఠ=ఓరీ నీచాతి నీచుడా! ఇదం = ఇప్పుడు నీవు చెప్పిన, మూడు పాదాలలోని, షష్ఠ+అక్షర-పర-విలోపాత్=ఆరవ అక్షరము నకు-తర్వాతిది (పరముగా)గా లెక్కింపబడు అనగా-ఏడవ(7) అక్షరమును-చ్యుతం చేసి, పునః-పఠ=మరల ఒకసారి చదువుకొనుము అప్పుడు నీవు చెప్పిన దానిలోని, అసలైన రహస్యార్థము, జరుగబోవునది ఏమియో, నీకే తెలియగలదు-అని సీత చకారగుళ్ళు [ఛి, ఛీ] విసరినది.

వి. 1వ పాదములోని 7వ అక్షరం "త్రి". దీనిని తీసివేసిన, "దశవదన గ్లానిః" మిగులగా, దాని అర్థం-దశగ్రీవుడవైన నీకే హాని(చావు) తప్పదన్నమాట!

1. త్రిదశులు= 'బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యము" లనెడి నాల్గువయో దశలలో, మూడవదగు యౌవన దశలోనే ఉండు దేవతలు.

2 వ పాదములోని 7వ అక్షరం "న' ము, తీసివేసిన, రామః-స్థాతా= శ్రీరాముడు యుద్ధమున సంసిద్ధముగ(Ready)గ ఉండగలడు 3 వ పాదములోని 7వ అక్షరం "వి"ని, లుప్తంచేస్తే, వానరసేన 'ఉచ్చైః పదం-యాస్యతి"=ఉన్నత స్థితిని జయమును పొందగలదు సుమా !

ఈ మాత్రం అర్థం తెలుసుకోలేక శబ్దాడంబరం ప్రదర్శించి, "లఘిష్ఠు"డ వైతివి సుమా !

శ్లోక-పాదత్రియంలో 7వ అక్షరాలను "చ్యుతం' చేస్తే, విపరీతమైన,అన్యా ర్థము ప్రతీతమగుటచే, ఇది "చ్యుతాక్షరా"గా పేర్కొనబడినది.

# 2. దత్తాక్షరా చిత్రమ్

1 శ్లో. సువర్ణమాయతం కృత్వా కరమూలే వినిక్షిపేత్ ।
అతినీల మతి స్థూలం య స్తం వే త్తి న కోవిదః॥ చా.చ

సువర్ణం-ఆయతం-కృత్వా.... = బంగారాన్ని-పొడిగించి....అంటే అర్ధం పరివడదు. కుశాగ్రబుద్ధితో అర్ధాన్ని కూడదీసుకోవాలి. ఎట్లనగా-

సువర్ణం=హ్రస్వముగానున్న "సు" అను అక్షరమును, ఆయతం-కృత్వా= దీ ర్ఘమగునట్లుగా-"సు' కు దీ ర్ఘంకలపి, "సూ"గా చేసి, కర-మూలే-వినిక్షిపేత్= (దానిని) "కర" అనుశబ్దానికి-ముందు-ఉంచవలెను అట్లు చేయగా వచ్చునట్టి అతి నీలం=మిక్కిలి నల్లనైనట్టియు, అతిస్థూలం=మిక్కిలి లావుగానుండునట్టి, తం= ఆ పదార్థమును, యః-వే త్తి=ఎవడు-కనిపెట్టి తెలుసుకొనుచున్నాడో, నః (ఏవ)- కోవిదః=వాడే-పండితుడు. (దానిని తెలుసుకోవడం అంత కష్టమన్నమాట) కవి శ్లోకంలోనే "క్లూ (Clue) ఇచ్చి, రహస్యమును సూచించినందున, సమాధానం కనుగొనటం అంతకష్టంకాదేమో? హ్రస్వంగా ఉన్న "సు" అనే అక్షరానికి దీర్ఘం (ఆయతం) "దత్తం" చేస్తే, "సూ" అవుతోంది. ఆ "సూ' ను "కర ' శబ్దానికి ముందు, మరల "దత్తం" చేసిన, "సూ' +"కర"="సూకర" శబ్దం వస్తుంది. దానికి "పంది" అని అర్థం. ఆ పంది, మిక్కిలి నల్లగా, లావుగా ఉంటుందని సమా ధానం చెప్పి, "పండితుడు" అనిపించుకోవచ్చును.

ని. శ్లోకంలో "సు"కు దీర్ఘత్వదానం, మరల ఆ "సూ"ను "కర"మునకు ముందు "దత్తం" చేయుట-అను రహస్యం బట్టబయలైనది కనుక "దత్త చిత్రము".

2. శ్లో. కా న్తయానుగతః కోఽయం పీనస్కంధో మదోద్ధతః ।
మృగాణాం పృష్ఠతో యాతి శంబరో రూఢయౌవనః ॥ స.క. 2-359

కాంతయా-అనుగతః, పీనస్కంధః, మద+ఉద్ధతః, రూఢయౌవనః,= కామినిచే-అనుసరింపబడుచు, బలిసిన భుజాలతో, మదమత్తుడై నిండు జవ్వనము

గల్గి, మృగాణాం-పృష్ఠతః-యాతి=మృగములను-తరుముచు, వెనుక-వెళ్ళుచున్న, అయం-శంబరః-కః?=ఈ-శంబరు-డెవడో కదా!

కాంత తన వెనుక వచ్చుచుండ, బలసిన భుజాలతో, మదించిన-యౌవనంతో మృగాలను ముందుకు తరుముచున్న ఈ శ(ం)బరుడెవడు?

ఇక్కడ, "శంబరః" అని యుండవలసియుండగా, మధ్యలో 'అనుస్వార అక్షరము'ను "దత్తం" చేసి, "శబరః" అని చెప్పుటవలన "దత్తాక్షర" ప్రహేళికయైనది. శబరః=బోయవాడు, కిరాతుడు. శంబరః=(మన్మధునిచే చంపబడిన ఒక రాక్షసుడు.

3. శ్లో విక్రమేణార్జునముఖాః కృష్ణభూపాల! తేహితాః ।
విక్రమేణార్జునముఖాః కృష్ణ భూపాల! తేహితాః ॥ దా. చ.

ఒక కవీశ్వరుడు "మాడుగుల" మహారాజగు కృష్ణభూపాలుని స్తుతించుచు, చెప్పిన పద్యము. (హే)కృష్ణభూపాల!=మాడుగుల సంస్థానాధీశా! కృష్ణభూపాలకా! విక్రమేణ-అర్జున ముఖాః-తే-హితాః=పరాక్రమంతో-(పాండవ మధ్యముడగు)అర్జునుడు మొ. వారునీకు-సమానులుగా, స్నేహితులుగా-పోల్చదగియున్నారు.

శ్లోకం యొక్క "పూర్వార్ధ-ఉత్తరార్ధములు" రెండును, ఒకే విధంగానుండి మనకు భ్రాన్తిని కల్గిస్తున్నాయి. కనుక, "తే-హితాః" అను పదాల మధ్యలో, అవగ్రహము(ఽ)అను గుర్తును "దత్తం" చేసిన, తేఽహితాః"="తే+అహితాః" అని పదచ్ఛేదం చేయుటవలన; రాజా! విక్రమేణ-తే-అహితాః=పరాక్రమంతో పోల్చినవుడు- నీయొక్క-శత్రువులు, అర్జునముఖాః = తెల్లమొగాలతో వెలవెలబోవుచున్నారని భావం.

వి. "తే-హితాః" ఉండగా, మధ్యలో "అకారప్రశ్లేష" (ఽ)ను "దత్తం" చేయనిచో, మొదట పునరుక్తిభ్రమను కల్గించును. అవగ్రహ (ఽ) దానముతో ద్వితీయార్థం చక్కగా, చమత్కార చందనచర్చితమై వరిపడుచున్నది ఇట్టివే!. "పథ్యేఽపతి (పథ్యేఽ(అ)నతి గదార్తస్య కి మౌషధనిషేవణైః మొ.నవి.

2. "చేతోఽనలం కామయతే మదీయం నాన్యత్ర కుత్రాపి చసాభిలాషమ్! నైషధం "చేతః, నలం, కామయతే," అకారప్రశ్లేష(ఽ)చే "చేతః-నలం-కామయతే మరియు, చేతః-న-లంకాం-అయతే-ఇత్యాది-

3వ శ్లో. విగోవాహో భుజంగాబ్జసగాసా2 అబిలాదృతాః ।
పాస్తు దేవాః సదాఽరుష్టాః విఘ్నన్తు చ భవ ద్రిపూన్ ॥

వి-గోవాహాః= 1 గరుడ2- హంస పక్షులు, 3 ఎద్దు (గోః=నంది) వాహనాలుగా గలవారును భుజంగ+అబ్జ వగాః=1 శేషుడు, 2 పద్మము, 3 కైలాసపర్వతములు పడకలు లేక ఆసనములుగా గలవారును, అబలాదృతాః=అబలలగు 1 లక్ష్మి 2 సరసపతి 3 పార్వతులంచే ఆదరింపబడినవారు. అగు దేవాః=1 విష్ణు 2 విరించి (బ్రహ్మ) 3 వామదేవులు (శివ) అగు దేవతలు, అరుష్టాః=కోపములేని వారై-అనుగ్రహదృష్టితో, పాన్తు=మిమ్ములను రక్షింతురుగాక! శవద్రిపూన్+శ=మీ శత్రుషంఘమకూడ, రుష్టాః=కోపముగలవారై, విఘ్నన్తు=నాశనము చేయుదురుగాక.

N B. మొదట 'సదాఽరుష్టాః" అని ఉండగా, సదా+అరుష్టాః=సదా+అరుష్టాః అను సంధిలో "ఽ" అకారప్రశ్లేషమ దత్తం చేయుట, లేక చ్యుతం చేయుటవలన, రుష్టాః మిగిలి, తర్వాత రెండు అర్థములు సమన్వితములైనందున, దత్త లేక చ్యుత-చిత్రముకూడ కావచ్చును.

1. విశ్చ విశ్చ=వీ; వీ చ గౌశ్చవాహాఃయేషాంతే=విగోవాహాః, గరుడుడు=హంస అను రెండు పక్షులు,నందియు,విష్ణువునకు, బ్రహ్మకు, శివునకు క్రమంగా వాహనములు.

2. "అబలాః"=బలములేని వారనికాదు. పురుషునికంటె కొంచెం బలం తక్కువగల స్త్రీలని భావం ("వశ్' కు నానార్థములు (6) న్నవిగదా!

4. శ్లో. విద్వాన్ కవిః వాదినరః తథాఽవిద్వాన్ భవేత్ యది !
తయోస్తు భేదః సంవేద్యః శబ్దరూపపరీక్షయా ॥ చా.చ.

విద్వాన్-కవిః=పండితుడు, కవియైనవాడు, వాది-నరః-భవేత్=వాదించు స్వభావముగల-మానవుడు-కాగల్గుచున్నారు. అది లోకనైజము, సహ్యమైన ధర్మము కూడ. కాని, ఇక్కడ, అవిద్వాన్-పాండిత్యం ఏమాత్రం లేని పామరుడుకూడ, తథా-భవేత్-యది=ఆ పండితునివలె "వాదినరః" అగుచున్నాడంటే, అప్పుడు ఏమి చేయవలెను! అని ప్రశ్న. (ఏమున్నది? Simple!) తయోః-భేదః-ఉ±ఆ పండిత-పండితమ్మన్యుల (అపండితుల)-తేడా-తెలుసుకోవాలంటే, శబ్దరూప-పరీక్షయా=ఆ 'వాదినరః" అను శబ్దరూపాన్నిగాని, లేక వారు ఉచ్చరించుచున్న శబ్ద స్వరూపాలనుగాని, జాగ్రత్తగా పరికించి, సంవేద్యః=తెలుసుకొని, సమన్వయించుకోవలెనని, సామాన్యార్థం.

ఇక్కడ, "వాదినరః"–అను శబ్దానికి, "వా" అను అక్షరం "ఆది"లోగం నరుడు అని, అన్వార్థం చెప్పకొవినచో అనగా "వా+ఆది-నరః' ="నర" శబ్దానికి ముందు "వా' ను "దత్తం" చేసుకొన్న నరుడుగా, భావించినచో,

'వా-నరః' (=కోతి) అని తేలుతుంది. కనుక, మొదట అర్థం చెప్పకొన్న ట్లుగా, ఆ, అపండిత-మూర్ఖుడు 'వాదినరః' కాజాలడు. అయితే, 'వానరః' మాత్రమే కాగలడు–అను రహస్యము, కిటుకు 'వాదినరః' అను 'శబ్ద' పరీక్షతోగాని, లేక భావ 'రూప' పరీక్ష చేస్తేగాని తెలియటంలేదు. అంటే వాని పాండిత్యాన్ని, సామ ర్థ్యాన్ని తెలుసుకోవాలంటే, వాడు వాడిన శబ్దాలను, వాని ఆకారాలను, పాతకులు బాగుగా పరికించి, పరిశీలిస్తేనే గాని ఆ రహస్యం తెలియదు.

ఇక్కడ 'చ్యుత-దత్తాలు' చేయకుండ, శ్లేష మహాత్మ్యంతో అర్థాంతిరాలు వచ్చినట్లు పైకి కన్పడవచ్చు. కాని, "తథా—విద్వాన్" మధ్యలో అకార ప్రశ్లేష (ఽ) తో, "తథాఽవిద్వాన్=తథా+అవిద్వాన్' చేసి, శబ్దరూప పరీక్ష చేసిన, ఈ "ఽ" అకార ప్రశ్లేష దత్తమైనట్లే మరియు, "వా, ఆదినర,"లో కూడ ఇట్లు దత్తమైన అకార ప్రశ్లేష ప్రకటిత మగును

5. శ్లో. కున్ద కుంజ మముం పశ్య సరసీరుహలోచనే।
అమునా కుంద కుంజేన సఖి! మే కిం ప్రయోజనమ్॥
ఒక చెలికత్తెకు, నాయికకు జరిగిన సంభాషణ.

సరసీరుహలోచనే! ఓ కమలాక్షి! అముం—కుంద—కుంజం-పశ్య=ఈ- మొల్ల పూల-పొదను మాడుము—అని ఒక చెలికత్తె, నాయికకు చెప్పగా, అప్పుడా నాయిక, సఖి!= చెలి! అమునా- కుందకుంజేన-మే– ప్రయోజనం -కిమ్=(నీవు చూపించిన) ఈ–మొల్ల పొదతో-నాకు (గలుగు) ప్రయోజనము-ఏమి ఉన్నది? అని నాయికా సమాధానం కాగా, అర్థము సమన్వితంకాక, అగమ్యగోచరమై, మన మెదడుకు మేత నందిస్తోంది. కనుక, బాగా ఆలోచించి, సరియైన అన్వార్థాన్ని ఆకళించుకొని, సమ న్వయం చేసుకోవలెను ఎట్లు?

ఇక్కడ, "అమునా" అను శబ్దాన్ని "అద" శ్శబ్దముయొక్క, తృతీయా విభక్తి-ఏకవచనంగా భ్రమించి, భావించి, "కుందకుంజేన"కు, విశేషణం చేయుటచే ఈ చిక్కు, చీకు, గందరగోళం వచ్చినది. అట్లుకాక, సూక్ష్మదృష్టితో ఆలోచిస్తే, అ"ము"నా="ము" కారరహిత-మైన-అని అర్థం చెప్పవలసి ఉంటుంది. అప్పుడు,

"ము" కారం ముందు లేని, అనగా "కుంద కుంజేనే"కు ముందు "ము" లేనిదని అర్థం. కాగా, ఇపుడు దానికి ముందు "ము"ను దత్తం చేసినచో,"ముకుందకుంజేన" అయి, ముకుందుడు (కృష్ణుడు) ఉన్న పొద-అను అర్థం రాగలదు. ఆ ముకుందు డున్న పొదరింటిలో, ఆ కృష్ణునితో హాయిగా, స్వేచ్ఛగా, క్రీడించు ప్రయోజనమును పొందగలను సుమా! అను నాయికా సమాధానము సమంజసము కాగలదు.

"కున్దకుఞ్జేన' కు ముందు "ము" అనే అక్షరాన్ని "దత్తం" చేసి, అన్యా-ర్థాన్ని అహ్వానించుటవలన "దత్తచిత్రమగుచున్నది.

శ్లో॥ రావు రామ నృప తా వుదా రతా
భావ్య తేఽత్ర న క దాపి లోపితా!
కిన్తు సాధుభి రలబ్ధవృత్తితా
హ న్త! పూర్వ భవ పాప వృత్తితః॥

ఇది, శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు చేసిన పీఠాపురరాజవర్ణన.

అత్ర—రావు రామనృపతౌ + ఉదారతా=ఈ పీఠికాపురా ధీశ్వరులగు-రావు రామభూపతి యొక్క-ఔదార్యము, కదా+అపి—లోపితా-న-భావ్యతే= ఒకప్పుడు-కూడ-లుప్తం చేయబడినదిగా —భావింపబడినది-కాదు. కింతు=కాని, సాధుభిః —అలబ్ధవృత్తితా = సత్పురుషులచే, లేక, పండితులచే-జీవనోపాయము (బ్రతుకు తెరువు) పొందబడకుండుట,-మాత్రము, హన్త!=అయ్యో! ఎంత ఆశ్చ ర్యం? ఎందువలన?—రాజు గారెంత ఔదార్యంగల వారైనా, వారి దగ్గర మంచివారికి, పండితులకు జీవనోపాధి లభించడం లేదంటే, ఆశ్చర్యం రాదా? దానికి, కారణం ఏమిటి?—

అన్న ప్రశ్నకు, పూర్వభవ-పాప-వృత్తితః=వెనుకటి జన్మలో చేసుకొన్న-(వారి) పాపపు నడకవల్లనే సుమా! వారికి ఆ రాజుగారి యొద్ద ఆశ్రయం దొరకక పోవుటకు కారణం, ఆ సజ్జనులు, పండితులు పూర్వజన్మలో చేసుకొన్న పాపకర్మమే ఒక కారణం కావచ్చు-అని ఒక సమాధానం.

అయితే, ఈ దోషం ప్రభువులదా? పండితులదా? మరి ఎవరిది? అని మరొక సన్దేహంకూడ కలుగవచ్చు. దానికి కారణం-పూర్వభవ-పాప-వృత్తితః=పూర్వము నుండి-పాప(య) శాస్త్రిగారి కిచ్చిన వృత్తి (జీవనోపాధి-యే, ఎక్కువగుట) వలన

ఇక, ఇతరులకిచ్చుటకు మిగలకపోవటం కూడా ఒక కారణం కావచ్చు. లేకపోతే, ముందుగా, ఆ ఆస్థానంలో చేరిన పాపయ్యశాస్త్రిగారు, తరువాత వచ్చిన వారికెవరికి ఆశ్రయమీయకుండ, అడ్డుచెప్పుట వలనకూడ, సజ్జనులకు ఉపాధి దొరకకపోవుటలో మరొక కారణం కావచ్చు. ఏమైనా! బోద్ధారో మత్సరగ్రస్తాః మరియు, పరస్పర యశః పురోభాగః" (ఉపదేశకులు ఈర్ష్యాయుక్తులు; మరియు, అన్యోన్యయశస్సంపాదనలో, ఒకరి కంటె మరొకరు ముందుండవలె ననుకొని, తప్పులెన్ను దోషైక దృక్కులని భావము) కూడ, గదా!

ఈ శ్లోకంలో. ఏ ఒక్క దానిని "చ్యుతం" లేక "దత్తం" గాని చేయలేదు. అయినా, చమత్కృతిలో ద్వితీయార్థం వస్తోంది. అంటే, దానికి కారణం, శ్లేషాలంకార మాహాత్మ్యమే కాక, తత్కవియొక్క, పాండిత్య ప్రకర్షకూడ, కారణాంతరం కావచ్చు.

# 3. 'చ్యుత దత్తాక్షరమ్'

శ్లో॥ స్ఫోటయిత్వా క్షరం కించిత్ పున రన్యన్య దానతః।
యత్రా పరో భవే దర్థః "చ్యుతదత్తాక్షరం" హితత్॥ వి. ము. 4-71

యత్ర—కించిత్-అక్షరం-స్ఫోటయిత్వా=ఏ స్థలమున-ఒక వర్ణమును-తొలగించి, పునః—అన్యన్య—దానతః=మరల-మరియొక అక్షరముయొక్క-దత్తతచేయుట లేక ఉంచుట వలన, అపరః - అర్థః -భవేత్=మరియొక-అర్థము—వచ్చినచో, తత్-చ్యుత దత్తాక్షరం-హి=అది "చ్యుత దత్తాక్షర"మను చిత్రము-గదా—అని పండితుల ప్రచారము.

అనగా, ఒక అక్షరమును తొలగించి, దానిస్థానముననే, మరియొక అక్షరమును ఉంచుటవలన, అర్థాంతరము భాసించినచో, అది చ్యుతదత్తాక్షర' మౌతుంది ఈ "విదగ్ధముఖమండన' కర్త్ర-భావముసే, క్రింది"కవీంద్రకర్ణాభరణ", "సాహిత్య కౌముదీ" గ్రంథములును బలపరచుచున్నవి.

శ్లో॥ సముద్ధృత్యాక్షరం కించిత్ తత్స్థానేఽన్య తదర్పణాత్ ।
యత్రార్థాన్తర మాభాతి "చ్యుతదత్తాక్షరం"తుతత్ ॥ క క. 4-6

శ్లో॥ చ్యోతయిత్వాక్షరం కించిత్ దత్త్వా చాన్యత్ ప్రకాశ్యతే ।
అన్యోఽర్థోయత్ర తత్ ప్రాహుః"చ్యుతదత్తాక్షరం' బుధా ॥ సా.కౌ.

అర్థములు పైవానివలెనే గనుక, పునర్లిఖితములు చేయ+లేదు.

పూర్వం నిరూపింపబడిన "చ్యుతజాతి"లో "త్యాగము", "దత్తచిత్రజాతిలో "దానము" మాత్రమే చెప్పబడగా ఇక్కడ "త్యాగము, (వర్ణాంతర)దానము" కూడ చెప్పబడుట విశేషము.

శ్లో॥ పూర్ణ చంద్రముఖీరమ్యా కామినీ నిర్మలాఽమ్బరా ।
తనోతి కస్య న స్వాన్తం నికామమదనాతురమ్ ॥ వి. ము 4-73

పూర్ణ చంద్రముఖీ- రమ్యా- నిర్మల- అమ్బరా- కామినీ=నిండునెలవంటి మొగముగల్గి-రమణీయమై-స్వచ్ఛవస్త్రధారణ చేసిన-రమణి, కన్య-స్వాన్తం-నికామ-మదన+ఆతురం-న-కరోతి=ఏ పురుషునియొక్క-మనస్సును-మిక్కిలి-కామంతో-బాధపడు దానినిగా-చేయుటలేదు.

పూర్ణచంద్రవదన, రమణీయ, నిర్మల వస్త్రధారిణియగు అందకత్తె, ఏ పురుషుని యొక్క హృదయంలో కామోద్రేకాన్ని కల్గింపకుండా ఉంటుంది? అనగా ప్రతి పురుషుని, కామబాధా పరవశునిగా చేసి, బాధిస్తుందని భావము.

శ్లోకంలో "కామినీ"లో నున్న "క" కారమును "చ్యుతం" చేసి, దాని స్థానంలో "య' కారమును దత్తంచేసిన, అనగా "క్'ను తీసి "య్" హల్మాత్రమును చేర్చినచో, 'కామినీ"-'యామినీ"గా మారుతుంది ఈ యామిని (రాత్రి) ప్రారంభంలో పూర్ణచంద్రునితో భాసిస్తూ, రమ్యమై, మేఘములులేని, నిర్మల-ఆకాశం (అంబరం)తో గూడినదై, పురుషులందరి మనస్సులలోను "హాయిగదోయీ పున్నమిరేయీ" అనిపించుచు, కామబాధను తప్పక నింపుతుంది-అని మరియొక అర్థము.

ని. "క" కారచ్యుతి, తత్స్థానమున "య" కార దత్తత-మాహాత్మ్యంతో ద్వితీయార్థం కూడ, రమ్యంగా రాణకెక్కడంతో, ఇది "చ్యుతదత్తాక్షరము" అయినది.

N. B. 1) కేవలము "హల్లు" చ్యుతమైనచో, అది "వ్యంజన చ్యుతక" ము కావచ్చును. ఆ చ్యుతితోపాటు, తత్స్థానమున అన్యాక్షర దానంతో అర్థాంతరాగమనము కూడ వచ్చిన "చ్యుతదత్తచిత్ర" మగునను తేడాను తెలియవలెను.

మరియు, పరామర్శించి, పరీక్షించినచో, "కామినీ-యామినీ" పరములైన అర్థములు యథాక్రమముగా వస్తున్నా, పైకి, అవి, అనుపయుక్తకథనాలు గానే భాసిస్తాయి అట్లుగాక, వానికి, "చ్యుతదత్తాక్షరత్వము"ను తాత్పర్యము" గాభావించినచో, వానికి ప్రహేలికాత్వము ప్రభవించు చున్నదనికూడ, గమనింపవలెను. ఇంకను, ఇతర విశేషములోనూ "ప్రహేలికాప్రపంచము"న గాంచగలరు.

శ్లో॥ సదా ధనంజయాలీక-యుతో జగతి గోగతిః ।
విదితానమ బాణారిః-పురారి రవతాత్తరామ్॥ క. క. 4-6-2

జగతి=లోకమున, సదా—ధనంజయ+అలీక—యుతః=ఎల్లపుడు—అగ్నిగలనొసటితోకూడినవాడు, గో—గతిః= నందీశ్వరునెక్కి—పోవువాడు, విదిత+అనమ బాణ+అరిః=ప్రఖ్యాత-విషమాస్త్రుడగుమన్మధునికి - శత్రువైన, పుర+అరిః = ఈశ్వరుడు, (ప్రజలనందరిని), అవతాత్—తరామ్=బాగుగారక్షించును గాక!

నొసట అగ్నినేత్రమును ధరించి, నందీశ్వరునెక్కి-పోవు- మన్మధవిరోధియైన (ఆ) త్రిపురాంతకుడు (శివుడు) జగత్తును సర్వదా సంరక్షించును గాక!

ఇక్కడ "పురారి" పదాదియందున్న "ప"ను చ్యుతంచేసి, తత్స్థానమున "మ"ను చేర్చుటవలన, "పురారి-మురారి"గా మారటంతో, విష్ణుసంబద్ధార్థం కూడ వస్తుంది. లోకమున, నెల్లపుడు అర్జున సఖుడైయున్నట్టియు, భూమి యొక్క భారమును పోగొట్టువాడును (గో-భూ-గతిః) విదిత+అసమ-బాణ+అరిః=నిరుపమానముగ ప్రసిద్ధికెక్కిన 'బాణాసురు"నికి (ఉషతండ్రికి) శత్రువైనవాడును, ముర+అరిః="ముర"డను రాక్షసుని చంపినవాడు నగు శ్రీకృష్ణుడు రక్షించునుగాక! అను ద్వితీయార్థం, "ప" కారాన్ని చ్యుతంచేసి, "మ' కారాన్నిదానం చేయుట వలననే వచ్చినది-కనుక "చ్యుతదత్తాక్షరము.

శ్లో॥ శంబరారాతి విజయీ- వాహినీ దయితాలికః ।
వామదేవో విజయతే నతారాపతిలక్ష్మణః ॥ క. క. 4-6-3

శంబర+అరాతి-విజయీ = "శంబరు" డనురాక్షసుని జంపినమన్మథుని జయించినవాడును, వాహినీ-దయితా—అలికః= గంగాప్రవాహమునే అలంక-రింప

బడిన-నొసలుగలవాడును, వతారాపతి – లక్ష్మణః = తారా (నక్షత్ర) పతి (చంద్ర) రూప చిహ్నముతో చంద్ర శేఖరుడైనవాడును-అగు, వామదేవః = మహాదేవుడగు శివుడు, సర్వోత్కృష్టుడుగానున్నాడు (విజయతే)

వు. "వామదేవః" లోని "వ కారమును చ్యుతం చేసి, "ర' (రేఫ) కార దానం చేసిన, "వామదేవః=రామదేవః" కాగా, వచ్చు ద్వితీయార్థము

శంబ-ర+అరాతి-విజయీ=వజ్రము (శంఖము)ను - వైరులపై విడుచు వాడగు ఇంద్రునికి-శత్రువైన రావణుని–జయించినవాడు, వాహినీదయిత+అలి-కః =నదీ భర్తయగు సముద్రమున-సేతువు కట్టినవాడును, సతారాపతి-లక్ష్మణః= తారాదేవి భర్తయగు సుగ్రీవునితో–లక్ష్మణునితో–చెలిమి చేసినవాడును-అగు, రామ దేవః=శ్రీరామచంద్ర ప్రభువు, విజయతే

"వ" కారమును చ్యుతంచేసి "రేఫ"ను దత్తం చేయుట వలన "చ్యుతదత్తాక్షర" మైనది ఇశ్లే, ఈ 'వ" కారచ్యుతి పిదప "క" కారమును దత్తం చేసినచో "కామదేవః" (మన్మధుడు) కాగా, "శంబరుని చంపి,, సేన (వాహినీ) రూపమగు స్త్రీ సంఘ సాహాయ్యంతో జగత్తును జయించి, చంద్రరూప చిహ్నంతో కామోద్రేకమును కల్గించువాడు నగు "మన్మధుడు" (కామదేవుడు) విజయతే-అను అర్థాంతరంకూడ వస్తుంది

N. B. ఈ శ్లోకమున 'వామదేవః" లోని 'వ"ను చ్యుతం చేసి, "ర'ను (హల్మాత్రం) లేక "క'ను దత్తం చేసి, మరొక అర్థాన్ని కల్పించటం, మరొక విశిష్ట విషయం

శ్లో. విదగ్ధః సరసో రాగీ నితంబోపరి సంస్థితః ।
తన్వంగ్యా లింగితః కంఠే కలం కూజతి కో విటః ॥ స.కం. 2-360.

విదగ్ధః–సరసః-రాగీ=మిక్కిలి నిపుణుడు, రసజ్ఞుడు, అనురాగియు, నితంబ +ఉపరి సంస్థితః=మొల–పైకి–ఎక్కి, తన్వంగ్యా-కంఠే-ఆలింగితః = సుందరాంగిచే–కంఠాలింగనము చేసుకొనబడినవాడు, కః=ఎవడు? విటః? =విటుడా? లేక విశేషంగా "ట" కార ధ్వనితో, కలం – కూజతి=కలకల–ధ్వనిచేయుచున్నవాడా? (కః?=ఎవడు?)

9 )

ఇక్కడ "విట" లోని "వి" అక్షరాన్ని చ్యుతం చేసి, తత్స్థానమున "ఘ" అనే అక్షరాన్ని "దత్తం" చేయుట వలన, ఘటః" (=కుండ) అగుచున్నది.

ఆ కుండ బాగుగా కాల్చబడినదై (వి-దగ్ధః) నీటితో నిండి (స-రసః) రంగులతో నొప్పుచు (రాగి) పిరుదునెక్కి, (ఆ) సుందరిచే కంఠం దగ్గర, గట్టిగా పట్టుకొనబడి, కలకలధ్వని చేయుచున్నది అది ఏది? "ఘటః=కుండ" అను సమాధానం కూడ సరిపడుచున్నది.

"వి" చ్యుతి, "ఘ" దత్తత-లు రెండును ఉండుట వలన "చ్యుతదత్తాక్షరము".

శ్లో. బంధువర్గైః సనాథేన విజనాథేన సంగతా।
విచరన్తీ సదా రణ్యే 'హరిణీ" శోభతే తరామ్॥

ఎల్లపుడు తన జాతి గుంపుతో కలిసి అరణ్యమున తిరుగుచున్న, తన నాథునితో పొత్తుగలిసిన-లేక చెలిమి చేసిన, ఆడులేడి (హరిణీ) బాగుగా ప్రకాశించుచున్నది.

పద్యంలోని కర్తృ పదమగు "హరిణీ' నుండి "హ" కారమును చ్యుతం చేసి, దాని స్థానమున "క" కారమును దత్తం చేసిన "కరిణీ" (ఆడుఏనుగు) అవుతుంది.

అరణ్యమున, కరి-ఘట (గుంపు`తో కలిసి తిరుగుచున్న నిజ భర్తను కలిసి కొన్న ఆడఏనుగు మిగుల శోభిల్లుచున్నది—అను మరియొక అర్థము ప్రతీతమై, అది, చ్యుత దత్తాక్షరోదాహరణ మగుచున్నది.

శ్లో. శీతలైః నిజ సంస్పర్శైః గాత్రే రోమాంచ మావహన్ ।
ఆమోదం కిం చ రచయన్ "వందనో"ఽయం విరాజతే॥ చ.చి.2-110.

పల్లవి, తన (పుత్ర) గాత్ర పరిష్వంగముతో, తల్లిదండ్రుల శరీరమున గగుర్పాటు (రోమాంచం)నే గాక, సంతోషమును కూడ సంభవింపజేయుచున్న కుమారుడు (నన్దనః చక్కగా రాణిల్లు చున్నాడు.

ని "నందనః"లోని "న' కారమును చ్యుతం చేసి, తత్ స్థానమున, "చ" కారమును దత్తంచేసి, చేర్చిన, "చందనః" (=మంచి గంధము)గా మారి, తన పల్లవి తాకిడితో, మానవ శరీరమున గగుర్పాటును, సువాసనను గల్గించు చున్న

చందనము రాజిల్లు చున్నది-అను అర్థాంతరము కూడ వచ్చి, "చ్యుత దత్తాక్షరము" అగుచున్నది

శ్లో. కూజన్తి కోకిలాః సాలే - యౌవనే ఫుల్ల మంబుజమ్ ।
కిం కరోతు (తి) కురంగాక్షి - వదనేన విపీడితా ॥ సా ద.

కోకిలా :– సాలే-కూజన్తి = కోకిలలు - సాలవృక్షము (మద్దిచెట్టు) నెక్కి-కూయుచున్నవి యౌవనే-అంబుజం-ఫుల్లం = జవ్వనమున - పద్మము– వికసించినది. వదనేన-విపీడితా—కురంగాక్షి—కిం-కరోతు (తి)= మొగముచే—పీడింప బడిన-అహరిణేక్షణ- ఏమి-చేయగలదు ?

సాల వృక్షమున కోయిలలు కూయుట అప్రసిద్ధము, కవి సమయ విరుద్ధము, కనుక, దానికి 'ర'ను 'దత్తం' చేసిన 'రసాలే' అగును. తియ్యమామిడి చెట్టుపై (రసాలే) కోయిలలు కూయుట సంగతమగును. వస్తుతః 'రసాలే' అని చెప్పవలసియుండగా, రేఫ చ్యుతం చేయబడి 'సాలే'అని చెప్పబడినది. అట్లే, 'వనే' అని చెప్పవలసియుండగా, 'యౌ' దత్తం చేసి 'యౌవనే' అని చెప్పబడినది. కాని, యౌవనమున తామరపువ్వు వికసింపదు కనుక, దానిలోని 'యౌ' ను చ్యుతం చేయ 'వనే' మిగిలి, 'నీటియందు' అను అర్థముతో సరిపడుచున్నది. 'మదనేన'అని చెప్పవలసియుండగా 'వదనేన' అని చెప్పుటచే, మొదటి 'మ' చ్యుతమై, 'వ' దత్తమైనది. కాని, ఇప్పుడు 'వదనేన' ఉండుట వలన 'వ'చ్యుతమై 'మ' దత్తమై,ప్రియ వియోగముతో, మదన పీడితురాలైన, ఆహరిణాక్షి ఏమిచేయగలదను అర్థంకూడ సార్థకమగుచున్నది.

కనుక, ఈ శ్లోకము 'దత్త-చ్యుత-చ్యుత దత్తాక్షము' లను మూడు చిత్రములకు ఉదాహరణమగుచున్నది.

N B ఈ శ్లోకంలో ఉన్నదున్నట్లుగానే, అర్థం చెప్ప కొంటే, వచ్చే నష్ట మేమిటి? అను ప్రశ్న రావచ్చు కాని, అది అనుపయుక్తంగా, అసంగతంగా కూడ కన్పడుతుంది. ఆ 'అనుపయుక్తత్వా'నికి ప్రతీకారంగా, 'చ్యుత దత్తాక్షరత్వ'మే శరణ్యమౌతుంది సాలమున కోకిలలు కూయవు కనుక 'ర'ను దత్తం చేసి 'రసాలే' అని చెప్పిన అర్థతాత్పర్యాలు అనుకూలంగా అవుతాయి. అట్లే 'యౌ'ను చ్యుతం చేయుట వలన, మరియు 'వ'ను చ్యుతం చేసి, 'మ'ను దత్తం చేయుట వలన, అర్థ

తాత్పర్యాలు కూడ చక్కగా అమరగలవు. ఉన్నదున్నట్లుగా చెప్పిన 'అసంగతి' అను దోషంగా కూడ లెక్కింపవలసి వస్తుంది. 'ఉక్తివైచిత్ర్యమే'గదా 'అలంకార' లక్షణం. కనుక, 'చ్యుతదత్తాక్షరత'ను ఉపయోగిస్తేనే 'అనుపయుక్తత, అసంగతి' అను దోషాలు పోయి, చమత్కారం చెన్నొందుతుందని కూడ గ్రహింపవలెను

శ్లో. ఉపరి గతం హి సవర్ణం హృత్వా కరతో దదాసి రంతుం మే।
ధన్యః సరోజయుగలం త్యక్త్వా స్తనయుగ మథా స్పృశత్ కృష్ణః॥
సురభాం.

సందర్భము : శ్రీకృష్ణుడు రాధతో నిట్లు చెప్పుచున్నాడు.

రాధా ! నీతో సమాన రుచిగల (సవర్ణం) పైనున్న పద్మాల జంటను(సరోజ యుగలం) చేతితో లాగి, నాకు క్రీడించుట కిచ్చుచున్నావు. అథ=తర్వాత, అట్లే, సవర్ణం—హృత్వాం 'సరోజయుగలంలోనున్న' 'స' అను అక్షరాన్ని 'చ్యుతం' చేసి, 'ఉ' పరిగతం=దానికి ముందు 'ఉ' అనే అక్షరాన్ని చేర్చిన, 'ఉ' రోజయుగలం= స్తన ద్వంద్వముకాగా, దానిని క్రీడింప నిచ్చుచున్నావని భావించి, చేతిలోనున్న రెండు పద్మాలను త్యజించి, ధన్యుడైన కృష్ణుడు స్తనద్వంద్వమును స్పృశించెను.

'సరోజయుగలం'లోని 'స' ను చ్యుతం చేసి, తత్స్థానమున 'ఉ' ను దత్తం చేయుటతో, అన్వర్థం కూడ సరిపడి, 'చ్యుతదత్తాక్షర' మగుచున్నది.

శ్లో. చిత్తభూ విత్త భూ మత్త భూ పాలకో-
పాసనా వాస నాయాస నాళి శ్చిరమ్ ।
సాధుతా సా ధుతా సాధితా సాధితా
కిం తయా చింతయా చింతయామ శ్శివమ్॥

అప్పయ్యదీక్షితులవిదిగా ప్రసిద్ధమైన ఈ శ్లోకం, శబ్దాలంకార-పునరుక్తి భూయిష్ఠమై, దురవగాహార్థంతో, దుర్నిరీక్ష్యంగా కన్పడుతుంది. దానిని సుష్ఠుగా విభజించి, సరియైన అర్థం చెప్పుకోవాలిగదా! ప్రయత్నింతము ఎట్లన-

చిత్తభూ, విత్త-భూ,-మత్త, భూపాలక=మన్మథునిచేతను, ధనముచేతను, (అధిక) భూమి (రాజ్యం) చేతను, మత్తెక్కిన-రాజులయొక్క, ఉపాసనా-వాసనా+ ఆయాసనాళిః=ఆశ్రయించుటలో, సంస్కారముయొక్క కష్టములచేత, చిరం=చాల కాలముగా, సా-సాధుతా-ధుతా = ఆ-మంచితనము (కాప్త)—భిన్నమైపోయినది

ఇట్లు, మదన, ధన, భూములతో మత్తెక్కి ప్రజలను పీడించిన, రాజులనాశ్రయించుటకై, తిరిగిన తిరుగుళ్ళతో, ఆయాసం అధికమై, మంచితనంకాస్త, మంటగలిసి, మసియైపోగా, అధితా=చింతావ్యాకులత్వంతో, రోగాలతో రొష్టుపడటం మాత్రం, సాధితా=సంపాదింపబడినది. (ఇప్పుడిక-) తయా-చిన్తయా-కిమ్?-ఆ పూర్వపు-తలపువలపు ఆలోచనలతో-ఏమి ప్రయోజనము? కనుక, మనశ్శాంతికై, శివం-చిన్త యామః=పరమేశ్వరుని (ఉపాసనను) గురించి-ఆలోచింతము.

ఇలా, విభజించి, అర్థం చెప్పుకోవడం శ్రమాపాదకమైనా,అలా శ్రమించి, విభజించుకొంటేనే, అసలైన అర్థం అవగాథమై, ఆనందాన్నిస్తుంది.

ఇక్కడ, గమనింపదగిన విశేషమేమనగా - 'చిత్తభూ....'లోని 'చి'ని చ్యుతంచేసి, 'వి'ని, 'మ'ని, క్రమంగా దత్తంచేసిన, 'విత్తభూ-మత్తభూ' అయి నట్లుగా ఆభాన కన్పడుతుంది అల్లే 'పానరా'లోని 'పా'ను చ్యుతంచేసి, 'వా'నుగాని, 'యా'నుగాని దత్తంచేయుటవలన, 'వానరా-(ఽ)యానరా ...'గా పైకి ఆభాసిస్తుంది. 'ధితా'కు ముందు 'సా'ను దత్తంచేయుటవలన 'సాధితా' అయినట్లున్నది, మరియు 'తయా'కు ముందు 'చిం' చేర్చిన 'చింతయా' అయినట్లుకూడ కన్పడుటచే, ఇది 'చ్యుత దత్తాక్షర చిత్ర' ఆభానగా మాత్రమే ప్రతిస్ఫర్తిస్తుంది.

# విచిత్ర రామాయణ శ్లోకః

శ్లో. సువర్ణ మయుతం కృత్వా ఇతరం యది వాంఛసి।
మృగం తం కురు నో చే(త్+మాం)న్మాం తం వినా నయ రాఘవ!॥ చా చ.

(హే) రాఘవ!=ఓ రామా! సువర్ణం='సు' అనే అక్షరము (వర్ణము)ను, 'అ'యుతం-కృత్వా=(ఆ 'సు' అనే, వర్ణమునకుముందు) 'అ' అను అక్షరంతో కూడు కొన్నట్లుగా-చేసి, ఇత-'రం'=దీని తర్వాత 'రం' అక్షరాన్ని చేర్చాలని, వాం ఛసి-యది=కోరుకొన్నచో, అనగా-ఇట్లుచేయుటవలన వచ్చిన 'అ-సు-రం' అను పదము యొక్క అర్థాన్ని 'రాక్షసుని'గా తలంచినచో, తం=ఆ రాక్షసుని, మరియు, 'తం='తం' అనే అక్షరాన్ని, మృ-గం='మృ' అనే అక్షరం తర్వాత చేరునట్లుగా, చేసి (మృ ఇత్యక్షరః గచ్ఛతీతి=మృగం) అనగా-'తం'కు ముందు 'మృ'ను

చేర్చిన, 'మృతం, కాగా, అనగా-చచ్చిన దానినిగా, కురు=చేయుము-అనగా- ఆ రాక్షసుని చంపుము నో-చేత్=అతనిని, రాక్షసునిగా భావింపకపోయినచో, 'మృతం' నుండి తం--వినా='తం' అనే అక్షరాన్ని లేకుండా తీసివేసి, మృగం (=లేడిని) గానే భావించినచో, తం=ఆ మృగమును (బంగారు లేడిని) ఆనయ=(నాకు) తెచ్చి యిమ్ము

ని. దండకారణ్యంలో పర్ణశాల ప్రక్కన తారాడుచున్న బంగారులేడిని చూచి, సీత రామునితో నిట్లనెను.

నాథా! 'సు' అనే అక్షరానికి ముందు 'అ' అనే అక్షరాన్ని, మరల ఆ 'సు' అక్షరం తర్వాత 'రం' అనే అక్షరాన్ని చేర్చగా, 'అసురం' అనేపదం తయారౌతుంది నీవా కన్పడుచున్న కనక మృగమును రాక్షసుని (అసురం)గా భావించినచో 'తం' అనే అక్షరాన్ని 'మృ' అనే అక్షరానికి తర్వాత చేర్చిన- 'మృతం'గా తయారు కాగా, ఆ (మారీచ) రాక్షసుని చచ్చినవానిని (మృతం)గా చేయుము అనగా-ఆ రాక్షసుని చంపుము ఒకవేళ, ఆ మృగమును రాక్షసునిగా భావింపని పక్షమున ('తం' చేర్చగా వచ్చిన 'మృతం' నుండి, ఆ 'తం'ను తీసి వేసి (తం-వినా) మృగంగా అనగా బంగారులేడియే అని భావించినచో, దానిని పట్టి తెచ్చి, నాకిమ్ము.

దీనిలో 'సు'కు ముందు 'అ'ను, తర్వాత 'రం'ను చేర్చుటవలన'దత్తాక్షరము'. 'తం'ను 'మృ'కు తర్వాత దత్తం చేయుటచే (మృతం) మరొక దత్తాక్షర చిత్రము. పిమ్మట, 'మృతం'లోని 'తం'ను 'చ్యుతం' చేసి, తత్స్థానమున 'గం' చేర్చుట వలన దొంక తిరుగుడుగా 'చ్యుత దత్తాక్షర చిత్రము' కూడ లభించుచున్నది

ఈ శ్లోకం 'ద్రాక్ష, కదళీ, నారికేళ-పాకాలను మించిన 'పాషాణ పాకం'లో పడియున్నది. ఆ పాషాణాన్ని (రాతిని) ఎంతో కష్టపడి, పగులగొట్టి, పాకం పడితే గాని, అర్థానుభవం కావటంలేదు.

## 'సీతా రావణ సంవాద ఝరి'లోని 'చ్యుతదత్త చిత్ర విశేషాలు

మైసూరు పండిత వరేణ్యులు, శ్రీ చామరాజనగర రామశాస్త్రి (20 శ.పూర్వార్ధం) గారు గూఢార్థ, ప్రశ్నోత్తర, చ్యుతదత్త చిత్రాదులతో నిండిన, ఒక అపూర్వ -క్లిష్ట తరమగు 'సీతా రావణ సంవాద ఝరీ' అను గ్రంథాన్ని వ్రాయుచు, 50 శ్లోకా

లతో నగంభాగం పూర్తిచేసి, 'ఈ చ్యుత దత్తాక్షర పద్ధతులతో మిగిలిన భాగాన్ని పూరించిన పండిత ప్రకాండులకు ' సహస్రం నమః" (వేల కొలది వందనాలు) అని కూడ, పండితలోకాన్ని హెచ్చరిస్తూ,ప్రకటించి, ప్రార్థించారు. పిమ్మట, కర్నూలుజిల్లా ఔక్ నివాసి శ్రీ బచ్చు సుబ్బరాయ గుప్తగారు 'అభినవ సీతా రావణ సంవాద ఝరీ' నామంతో పూరించి, ఒక గ్రంథాన్ని ప్రకటించారు. అట్లే శ్రీరామశాస్త్రి గారి శిష్యులు శ్రీ సీతారామ శాస్త్రి కూడ 'సీతా రావణ సంవాద ఝరీ—ఉత్తరభాగః, అనుపేరుతో దానిని పూర్తి చేసినారు

శ్రీ రామశాస్త్రిగారి గ్రంథంలో గూఢార్థ ప్రకటనకుపకరించు, 'చ్యావితాక్షర, అధిదత్తాక్షర, ప్రతి దత్తాక్షర ఆదిగా, అనితర సాధ్యాలైన, అనేక—అపూర్వ చ్యుత దత్తాక్షరా, పద్ధతులను ప్రవేశపెట్టిరి,చమత్కార జనక విశేషాలనెన్నింటినో, స్వవ్యాఖ్యానంగా (తో) చవిచూపి, చవులూరించారు.

ఈ సంవాద రూప-ప్రతి శ్లోకంలోని మొదటి మూడు పాదాలలో రావణుడు చేసిన మృషానామనింద, ఆత్మస్తుతి ప్రదర్శకాలు కాగా, నాల్గవపాదంలో, సీతాదేవి-అక్షరచ్యుతి, దాన, అక్షరాన్తర ప్రవేశాలతో, చ్యుతదత్తాక్షరాది పద్ధతితో, రావణ నిందను, రామస్తుతిని, సంకేతితార్థంతో జోడించి, త్రిప్పికొడుతూ, సమాధాన మిస్తుంది. విస్తరభీతిచే మూడు శ్లోకాలను మాత్రమే ఉదాహరిస్తున్నాము జిజ్ఞాస, కుతూహలంగల పాఠకమహాశయులు పైగ్రంథాలను పఠించి, తెలిసికొనగలరు

శ్లో. ప్రాణేశస్య పలాలవ ద్భుజయుగం తేఽ న త్త్వయుక్తం, కలా
శబ్దే నైవ యుతః ప్రియః న కిల, కిం? తస్మాత్ భవేత్ తే? వద ।
ఖ్యాత్యాఽహం పరలాలనేచ్ఛు రితి సంయుక్తోఽభవం సంతతం
ప్రీతం మే హి ల సద్వచః చ్యుత మిదం తేఽమంజులాకారతః। పి. 48

ఓ సీతా! తే-ప్రాణేశస్య-భుజయుగం-పలాలవత్-అనత్త్వయుక్తం=నీభర్త యొక్క-భుజములు జంట-ధాన్యంలేని పొట్టు, లేక గడ్డివలె-బలములేనిది. నః-ప్రియః-కలాశబ్దేన + ఏవ=యుతః-కిల=అట్టి-నీ ప్రియభర్త కేవలం 'కలా' [=విద్య] అనే శబ్దంతో మాత్రమే పరిచయంగలవాడు [విద్యలురాని అజ్ఞాని]గదా! తస్మాత్-తే-కిం-భవేత్?-వద=అట్టి అసమర్థునివలన-నీకు-ఏమిలాభము-కలుగునో-

చెప్పుము. అహం-సంతతం-పరలాలన + ఇచ్ఛుః- ఇతి-ఖ్యాత్యా - సంయుక్తః- అభవం=[అట్టి విప్రియోజకుడగు రామునివలె గాక] నేను-ఎల్లప్పుడు-ఇతరులను సంతోషపెట్టు-కోర్కె కలవాడను-అను-కీర్తితో-కూడుకొన్నవాడను సుమా అని, రావణుడు-రామనింద, స్వాత్మస్తుతి చేసుకొనగా, [ఓరీ రావణ!] తే-మంజుల+ఆకారతః-చ్యుతం-ఇదం-వచః-లసత్ (చేత్)=నీయొక్క-మనోహర స్వరూపమునుండి-తొలగిన-ఈ [నీ యొక్క]-మాట-అట్లే ప్రకాశించినచో, మే-ప్రీతం-నాకు-ఇష్టమైనదే-గదా!-అని సీతా ప్రత్యుత్తరం.

ఓ సీతా! నీ భర్తయొక్క భుజబలము ఎందుగడ్డి లేక పొట్టువలె, నిస్సారమైనది. అతడు 'కలా' [విద్యా] శబ్దమైతే విన్నాడు, కాని, ఆ విద్యలు ఏమాత్రం ఎరుగని మూర్ఖుడు. కనుక, అతనివల్ల నీకు లభించే లాభమేదో, నీవే కొంచెం ఆలోచించి చెప్పు ఇక, ఆ మూర్ఖుని సంగతి అలా వదిలిపెట్టు ఇక, నాసంగతి అంటావా, నేను పరులకెప్పుడూ పరిపరి విధాల సంతోషం కల్గిస్తూ, పదిమందిలో కీర్తి ప్రతిష్ఠలు తెచ్చుకొన్నవాడను గదా—అని రావణుడు పై మూడు పాదాలలో, రామనింద, ఆత్మస్తుతి చేసుకొనగా, నాల్గవ పాదంలో, సీతాదేవి ఇట్లు ప్రత్యుత్తరిస్తోంది. ఓరీ రావణ! నీ మనోహరాకారంనుండి, నీవు చెప్పిన మాటలు తొలగకుండ, అలాగే స్థిరంగా ఉంటే, అదంతా నా కిష్టమేగదా!-అని సామాన్యార్థం.

ఇక, నాల్గవపాదంలో, సంకేతితమైన అంతర్గూఢార్థం ఏమనగా—రావణా! తే [ఓ] మంజులాకారతః=['తే' తర్వాత మధ్యలో 'అ' [ఓ] కారమును 'దత్తం' చేయుటవలన] నీయొక్క-మనోహరంకాని[అమంజులా]'లా' అనుదానిలోనున్న'ఆ' కారమునుండి, ఇదం-వచః=ఈమాట, చ్యుతం=తొలగి,దాని స్థానమున 'ల'-సత్='లా'కాక 'ల' అను అక్షరము మాత్రమే వెలసియున్నచో, అప్పుడు, అది నాకు ఇష్టమే గదా! అని అంతరార్థం.

అనగా—నీవు చెప్పుకొన్న 'పలాలవద్భుజయుగం....'లోని 'పలాల' శబ్దమునందలి 'లా' అను అక్షరంలోని 'ఆ' అనే దీర్ఘ అక్షరాన్ని తొలగించి దానిస్థానమున 'ల'ను [హ్రస్వాన్ని] మాత్రమే ఉంచిన, అప్పుడు 'పలలవద్భుజయుగం'అవుతుంది. అప్పుడా శ్రీరాముని భుజద్వంద్వము, పలలవత్-కండపుష్టి [మాంసము]తో కూడియున్నది గనుక, మిక్కిలి బలంతో గూడియున్నదని సంకేతితార్థము అట్లే 'కలా' శబ్దంలోని 'ఆ'కారాన్ని తొలగిస్తే 'కల' శబ్దేనయుక్తః=[శ్రీరాముడు] అవ్యక్త

మధురధ్వని [కల]తో కూడినవారను అర్థంరాగలదు మరల, 'పరలా'లనేచ్ఛుః-లోని 'లా'ను 'ల'గా మార్చిన, పరలలనేచ్ఛుః=పరస్త్రీలను కామించువారని అర్థం. ఇట్లు, 'లా'లో దీర్ఘమైన 'ఆ'కారాన్ని చ్యుతంచేసి, 'ల' హ్రస్వాన్ని ఉంచగా, వచ్చిన అర్థాలన్నీ, శ్రీరాముని స్తుతిస్తూ, రావణనిందను చేయుచున్నవి

వి,1, అకారాన్ని చ్యుతం చేయుటవలన 'చ్యావితాక్షరచిత్ర'మైనది. మాత్రా చ్యుతకముకూడ కాదగియున్నది.

[2] మరియు, 'లా' [=ల్+ఆ]నుండి, 'ఆ'కారం చ్యుతం చేయగా 'ల' మిగిలి, మరొక విపరీతార్థాన్ని కల్గించుటవలన, 'చ్యుతచిత్ర'మౌతోంది. అట్లే, 'తేన త్వయుక్తం–తే మంజులాకారతః' అను వాని మధ్యలో, అకార ప్రశ్లేష రేక అవగ్రహము [ఽ]ను 'దత్తం' చేయుటవలన,'తేఽ[అ]నత్వయుక్తంవచః, తేఽ [అ] మంగళాకారతః' అయి, విరుద్ధార్థములు ప్రతీయమానములు అగుచుండుట వలన, 'దత్తచిత్రము'కూడ నగును. ఇంకను, 'లా'విగాని, దానిలోని 'ఆ'కారాన్ని గాని, 'చ్యుతం'చేసి, 'ల'ను దత్తంచేశామని చెప్పుకొన్నచో, 'చ్యుత దత్తాక్షర చిత్రం'కూడ కావచ్చును.

శ్లో. సీతే! హీరయశోగణో, రతిపటూ, రామోచిత త్విణ్ముఖోఽ
రాతి శ్లాఘ్యగుణః సదా, జనకజే! లోకే పరీతప్రభః ।
యుద్ధే రూఢజయోఽ భవం కిల, మయా సమ్మారితా ఘాతుకాః
క్రవ్యాదాధమ! పాప! నీచ! వదనే రే! న శ్రుతిః వర్తితా ॥ అ.సి. 19

సీతే=ఓసీతా! (అహం=నేను) హీర-యశోగణః= స్వచ్ఛమైన-కీర్తి పుంజము గలవాడను, రతి-పటుః=సంభోగము (కొక్కోకశాస్త్రము)న- సమర్థుడను -(కనుకనే) రామా+ఉచిత=త్విట్+ముఖః = సుందరీమణులకు-అనురాగమును గల్గించు-కాంతి-ముఖమునందుగల్గియున్నవాడను' సదా+అరాతి శ్లాఘ్యగుణః=ఎల్ల పుడు-శత్రువుల చేతగూడ-స్తుతింపదగిన-గుణములు గలవాడను (హే) జనకజే!= ఓ జానకీ! లోకే-పరీతప్రభః = లోకమునందంతట-వ్యాపించినకాంతిగలవాడను, యుద్ధే-రూఢజయః=అభవం-కిల=ఎంతటియుద్ధంలోనైనా - విశ్రుత విజయం సాధించినవాడను-గదా! మయా-ఘాతుకాః-సమ్మారితాః=నాచేత-దుర్మార్గులైనేతలు-తుడిచి పెట్టబడినారు సుమా!- అవి రావణుడు పల్కగా, రే!నీచ! పాప! క్రవ్యాద+అధమ!

ఓరీ!- తుచ్ఛుడా!-పాపాత్ముడా!-రాక్షసాధము, (తే) వచనే=నీవు చెప్పుచున్న-మాటలో, శ్రుతిః=(నా యొక్క) చెవి,న-వర్తితా=ప్రవర్తించుటలేదు, అనగా-వినపడటం లేదు-అని పైకి సామాన్యార్థము.

ఇంక, సంకేతితమైన అంతర్గూఢార్థమెట్టిదనగా-

తే-వచనే=నీవు చెప్పిన మాటయందలి, రే= 'ర' అను అక్షరము (రేఫ) యొక్క-స్థానమున, 'వ' శ్రుతిః='వ'కారమే విన్పడుచున్నది. అనగా-నీవు చెప్పిన దానిలో'ర' కారమున్న ప్రతిచోట, ఆ 'రేఫ', నాకు'ర'కారంగా విన్పడక,''వ' అను అక్షరం ('వ' శ్రుతిః)గా, విన్పడుచున్నది. అట్లుకాగా, నీవు చెప్పిన 'హీ'ర'యశో గణః' అనునది, నాకు 'హీ'వ' యశోగణః' (=నశించిన కీర్తిగలవాడు) గాను, 'ర' తిపటు :- 'వ' తిపటుః= అందరికి తలవంచి 'జోహుకుం' అంటూ నమస్కారం చేయుటలో నేర్పరిగాను, 'రా' మోచిత త్విణ్ముఖః- 'వా' మోచితత్వణ్ముఖః=పేరుకు మాత్రమే ఏ కొంచెమో ముఖకాంతి గలవాడుగాను, లేక 'రావణ' నామానికి తగిన భయంకరాకారం కలవాడు (నామైక దేశే నామగ్రహణం")గాను, అకార ప్రశ్లేష (ఽ)ము తీసివేసినచో, 'రా'తి శ్లాఘ్యగుణః- 'వా'తి శ్లాఘ్యగుణః (=కొనియాడ దగిన ఎక్కువ గుణాలు లేనివాడు)గాను, 'లోకే-ప'రీ తప్రథః-అవగ్రహంతో చేర్చి, లోకేఽవ'రీ'తప్రథః= లోకమున పోగొట్టబడిన అందంగలవారుగాను, యుద్దే 'రూ' ఢజయః-లో, అవగ్రహం, 'ఽ' చేర్చిన, యుద్దేఽ'వూ'ఢజయః=యుద్ధంలో, మోయబడినవిజయం (అపజయం) గలవాడుగాను, సంమా'రి'తాః= సమ్మా 'వి' తాః =ఘాతుకులు గౌరవింపబడిన వారుగాను-నాకు విన్పడుచున్నది.

ఇట్లు 'ర' ఉన్న ప్రతిచోట, ఆ 'ర'ను చ్యుతంచేయగా, అది నాకు 'వ'గా విన్పడుటచే, అనగా 'వ' కారం దత్తం చేయుబడి, విపరీతమైన అర్థము స్ఫురించుటచే, ఇది 'ప్రతి దత్తాక్షరము' లేక 'చ్యుతదత్తాక్షరము' అగుచున్నది. 'రామోచిత-త్విణ్ముఖో''ఽ' రాతి శ్లాఘ్యగుణః' మధ్యలోనున్న అకార ప్రశ్లేషము చ్యుతం చేయుటచే 'చ్యుతచిత్రము', 'లోకే పరీతప్రథః—యుద్దే రూఢజయః' అనువాని మధ్యలో కూడ 'ఽ' (అకార ప్రశ్లేషగుర్తు)ను దత్తంచేయుట వలన 'దత్తచిత్రము' కూడ కానగియున్నది 'రతిపటుః+రామా+ఉచిత త్విట్+ముఖః' పదాలను, సంధిచేసి కలుపగా, 'రతిపటూ రామోచిత త్విణ్ముఖః' అయినదని కూడ గమనింపవలెను.

శ్లో. రామాం వాచ్యతి విప్రియోఽతిచలితశ్రీ స్త్వన్విః సీచం వపుః
చిత్రత్కానన సీమ్ని రాక్షసచయాయత్తః స్వయం వేత్సి తమ్
మాం పశ్యాతి విచక్షణోఽస్మి బహుధా చాపైక వీరోఽస్మ్యహం
లబ్ధశ్రీ ప్రచయః కతాఽస్మి, కిమరే! "చే" "లం' బధా నానకృత్॥ సీ. 19

పూర్వాంచలెక్కీరావణుడు (3)• 31/2 చరణాలతో, రామనిందచేయగా, మిగిలిన పాదార్థం సీతాప్రత్యుత్తరం 'రే! 'చే' 'లం' బధాన- అనకృత్=ఓరీ! నీవు 'చ' కారం (చే) చెప్పిన ప్రతిచోట, ఆ 'చ' కారమును 'చ్యుతం' చేసి, 'ల' కారము (ం) ను అనేకమారులు (అనకృత్) చేర్చుము అనగా 'చ' తీసి దాని స్థానమున 'ల' ఉంచుము.

అట్లు 'ల' ను దత్తం చేయగా, 'వాచ్యతి-వాల్యతి'గాను, 'చలిత-లలిత'- సీచం-సీలం, చయాయత్తం- లయాయత్తం, విచక్షణ-విలక్షణ, చాపైక-లాపైక, ప్రచయ-ప్రలయ, గాను మారగా, ఈ విశేషణములు, రామస్తుతి, రావణనిందార్థక ములై, సంకేతిత- ద్వితీయార్థాన్ని వ్యక్తీకరించుచున్నవి.

ప్రతి 'చ' కార చ్యుతి, తత్‌స్థానమున, 'ల'కార దత్తతలపలన, ఇది' 'ప్రతి దత్తాక్షర చిత్ర' మగుచున్నదని తత్కర్త తెల్పెను. మరియు, సామాన్యంగా ఇట్టి చిత్రభూయిష్ఠ పద్యరచన అందరికి సాధ్యంకాదని, వాగ్దేవియే తన వదనం నుండి పల్కించినదని కూడ శ్రీ శాస్త్రి చెప్పుకొనెను విస్తరభీతిచే, ఇతర విశిష్ట శ్లోకాలను వివరింపబూనలేదని మనవి.

## 'చిత్ర రత్నాకర' కర్త 'చక్రకవి' విశిష్టతలు

చక్రకవి (17వ.)యొక్క 'చిత్రరత్నాకర'మొక చిత్రాలంకార సర్వస్వము. ఆతడనేక ప్రాచీన చిత్రాలంకారాలతోపాటు, 'ధర్మదాసా'దులను మించి, కొన్ని నవీనాలంకారములను కూడ విచిత్రంగా సృష్టించి, చిత్రాలంకార ప్రపంచమున నొక సాహిత్య విప్లవమును సందింప, సంరంభించెను. అనేక నూతన చిత్రాలంకార సృష్టికి 'మార్గదర్శి' యయ్యెను.

ఇతడు శబ్దస్వరూప జిజ్ఞాసువులకు, సుఖంగా తద్ జ్ఞానమును కల్గించుటకే 'చిత్రరత్నాకర' రచన చేసెను. ఈ చిత్రాలంకారములను, సులభావగాహనకై, మొదట, ప్రశ్నోత్తరాత్మక శ్లోకాలతో 'అంతర్లాపులు, బహిర్లాపు'లని ద్వివిధగా

విభజించి, విరూపించెను ఎదుటివారి యొక్క లేక ప్రత్యర్థులయొక్క వాగ్బంధం చేయాలనుకొన్నను, స్వపాండిత్య ప్రకర్షను ప్రదర్శింపగోరినను, అట్టివారందరికీ, తన చిత్రరత్నాకరము కంఠస్థము కాదగినదనెను.

చక్రకవి మొదట 28 ముఖ్యచిత్రాల ఆకారములను విభజించి, ఒక్కొక్క దానికి పదిపది ఉదాహరణముల నిచ్చి, ప్రపంచించి, ప్రకటించిన ప్రముఖుడు. చమత్కార, వైచిత్ర్య పూర్ణములగు కొన్ని ముఖ్యమైనవానిని మాత్రమే, పాఠక ప్రముఖుల పరిశీలనకై, ప్రకటించుచున్నాము.

# దత్తచ్యుతాక్షరా ద్యన్తచిత్రమ్

లక్షణం : శ్లో. దత్తచ్యుతాక్షరా ద్యన్తం భవేత్ ప్రశ్నోత్తరంయది।
'దత్తచ్యుతాక్షరాద్యన్తం' త ద్వదన్తి మనీషిణః॥ చి.2–92.
ప్రశ్నోత్తరము'ఆది-అన్తము'లకు యథాక్రమముగ'దత్తచ్యుతాక్షర'మైనచో,ఆచిత్రం 'దత్తచ్యుతాక్షరాద్యన్త' మను చిత్రాలంకార భేదమగును. అనగా, మొదట(ఆదిలో) అక్షరదానము, చివర (అన్తంలో) అక్షరచ్యుతి చేయవలెనని భావము.

N B. ఈ చక్రకవి 'చ్యుతాదులకు' చాలవరకు విడివిడిగా, స్వతంత్ర లక్షణములు చెప్పి ఉదాహరించుట గమనార్హము.

శ్లో. కో రక్షోనికరాంధకార తరణిః?, ధత్తే చ కా మానుషాన్?
నంబుద్ధిః విదుష శ్చకా?, పృథుతరం కీదృక్ తటాకోదరమ్।
భూషాం కాం విదు రాననస్య?, వనితాశ్రోణీస్థలీ కీదృశీ?
నాదా వక్షరయుక్తి ముక్తిత ఇహ త్వాద్యన్తయో రుత్తరమ్॥ చి 2 93

ఈ శ్లోకంలోని ఆరుప్రశ్నలకు, రెండక్షరాలు గల ప్రత్యుత్తరాలు, 'ఆరు' వెదకి, చెప్పుకొనవలెను. మొదటి ప్రశ్నకు 'రామః,' ప్రత్యుత్తరము. "నాదౌ=" న+ఆదౌ' అనుటవలన, మొదటి ప్రత్యుత్తరమునకు, పైన (2 92 శ్లోకంలో) చెప్పిన నియమము వర్తించదు. ఇక రెండవ ప్రత్యుత్తరం- ఆది-అక్షరానికి ముందు "అక్షరదానము"+ "అంత్యాక్షరానికి చ్యుతి" చేయవలెననికూడ, గుర్తుంచుకొనవలెను.

1వ ప్రశ్న- రాక్షససమూహ మనెడు చీకటిని పారద్రోలు సూర్యుడెవరు? ఉత్తరము: రామః (=రాముడు)శ్రీరాముడు రాక్షససంఘాంధకారమునకు సూర్యుడై

చీకటిని పోగొట్టి వెలుగునిచ్చినారు. అనగా–చీకటిని సూర్యుడు పోగొట్టినట్లు క్రూర రాక్షస సంఘమును శ్రీరాముడు సంహరించి, నాశనము చేసెను.

2 ప్ర. మనుష్యుల నెవరతె ధరించుచున్నది? దీనికి ఉత్తరము "ధరా" (=భూమి) ఎట్లు? మొదటి ప్రశ్నోత్తరమగు "రామః"లోని, ఆద్యక్షరమగు "రా"కు ముందు 'ధ' అనే అక్షరాన్ని 'దత్తం' చేసి [ఉంచి], అంత్యమునందున్న విసర్గసహితమగు "మః"ను "చ్యుతం" [లుప్తం] చేయగా వచ్చిన "ధరా" [=భూమి] ప్రశ్నోత్తరమైనది. భూమి తనపై మనుష్యులను ధరించుచున్నది. ఇట్లే అన్నిచోట్ల సమన్వయించుకొనవలెను.

3. పండితుని యొక్క సంబోధనము ఎట్టిది? 'ధరా"లోని ఆద్యక్షరానికి ముందు "బు" దానంచేసి, అంత్యాక్షరమగు 'రా"ను చ్యుతం చేయగా వచ్చిన "బుధ!" [=ఓపండితుడా:] పండితునకు సంబోధనమగును.

4. గొప్పదగు చెరువు మధ్యభాగమెట్లుండును? ఉ సాంబు= [స+అంబు] నీటితో గూడి యుండును. "బుధ!'కు ముందు "సాం" చేర్చి. చివరి "ధ"చ్యుతం చేయగా, "సాంబు" వస్తుంది.

5. మొగమునకు అలంకారముగా దేనిని భావింతురు? ఉ,నాసాం [=ముక్కును] "సాంబు"కు ముందు 'నా చేర్చి, చివరి "బు' చ్యుతం చేయగా "నాసాం" వచ్చినది. కోచెరువలె నున్న ముక్కు, ముఖానికి అందాన్నిస్తుందని భావం.

6. స్త్రీయొక్క పిరుదుల భాగ మెట్లుండును? ఉ ఘనా [=విస్తృతమైనదిగా నుండును] "నాసాం"కు ముందు "ఘ" చేర్చి "సాం"ను చ్యుతం చేయగా "ఘనా" వచ్చును.

ఇట్లు సమాధానంలో శృంఖలారూపంలో వరుసగా మొదటి అక్షరానికిముందు, మరొక అక్షరాన్ని దత్తంచేసి, చివరి అక్షరాన్ని చ్యుతంచేస్తూ పోవుటవలన ఒక నవీన రూపమేర్పడి, ఇది "దత్తచ్యుతకం" లేక "దత్తచ్యుతాక్షరాద్యన్త చిత్ర" మగుచున్నది.

## చ్యుతదత్తాక్షరాన్తాది చిత్రమ్

శ్లో. అస్తే కుత్ర చతుర్ముఖః? జనదయాప్రాప్తౌ భవేత్ కా పునః?
కీదృక్చ గ్రహమండలీ? క్షితిభుజాం కీదృక్ బలౌఘస్తథా? ।
కీదృక్స్యాత్ సుతమః? జనశ్చ భవతి శ్లాఘ్యంపునః కేన వా?
నాదావక్షరయుక్తి ముక్తిత ఇహ శ్వాద్యం తయోరుత్తరమ్॥ చి.2-93

వి పూర్వం రెండక్షరాల ప్రత్యుత్తరాలు కాగా, దీనిలో మూడక్షరములు ప్రత్యుత్తరములగుట విశేషము

1 వ ప్రశ్న : బ్రహ్మదేవుడు ఎక్కడ ఉండును? ఉ. నాలీకే [=పద్మమునందు]

2 వ ప్రశ్న : ప్రజల దయకు పాత్రమగునది ఏది ? ఉ దీనాలీ [= దీన+ఆలీ=దరిద్ర సంఘము] నాలీకే"కి ముందు "దీ ' చేర్చి, అంత్యాక్షరమగు "కే' వి చ్యుతం చేసిన "దీనాలీ' అగును.

3 వ ప్రశ్న : గ్రహ సంఘమెట్టిది ? ఉ. సాదీనా - సాదీ+ఇనా=సూర్యుడు ఆదిగా గలది అనగా - నవ (9) గ్రహములలో సూర్యుడు మొదటివాడు (గాగలది) - అని భావం.

"దీనాలీ"కి ముందు "సా" దత్తం చేసి, చివరి "లీ" చ్యుతమైన రూపమిది.

4 వ ప్రశ్న : (మంచి శరీరం గల, మహిళ ఎట్లుండును? ఉ. సునాసా = కోటేరువలె పొడవైన మంచి ముక్కు కలిగి యుండును. "నాసాదీ' కి ముందు "సు" చేర్చి, చివరి "దీ"వి చ్యుతం చేయగా "సునాసా" వచ్చినది

5 వ ప్రశ్న : రాజుల సైన్య బల సమూహమెట్టిది ? ఉ. నాసాదీ [=తొండము=ముక్కు] తో భక్షించు ఏనుగులు గలది. పూర్వ రాజుల చతురంగ బలములలో గజ బల మొకటి "సాదీనా' కు ముందు "నా ' దత్తద, చివరి "నా" చ్యుతి చేయగా వచ్చినది.

6 వ ప్రశ్న : దేనిచే జనుడు కొనియాడ బడును? ఉ. వసునా [= ధనముచేత] "సునాసా" లోని "సు" కు ముందు "వ" ను దత్తం చేసి, చివరి "సా" ను చ్యుతం చేయగా 'వసునా" వచ్చును ఆది-అన్త-ములను యథాక్రమంగా "దత్త-చ్యుతాలు" చేయగా ఈ ప్రత్యుత్తరములు లభించుటచే, ఇది "చ్యుత దత్తాక్షరాన్తాది చిత్రము' లేక ఆది-అన్తములను క్రమంగా "దత్త-చ్యుతములు" చేయుట వలన - అని మరొక విధంగా చెప్పుకొన్నచో, ఇది "దత్తచ్యుతాద్యన్తాక్షర చిత్రము" అని కూడ చెప్పవచ్చును.

# చ్యుతదత్తాక్షరమ్

లక్షణమ్. శ్లో. పదయోః పరివృత్తిశ్చేత్ వర్ణయోః పరివృత్తితః ।
పదార్థద్వయ సాధర్మ్యే "చ్యుత దత్తాక్షరం" హి తత్॥ చి 2-103

వర్ణములను మార్చుటవలన, పదములుకూడ మారి, ఆ పదార్థములు రెండింటికి సమానధర్మము ప్రస్ఫుటమైనచో, అది "చ్యుతదత్తాక్షరము".

శ్లో. అనేకవర్ణయుక్తాభిః శుధాభిః గోభి రన్వితమ్ ।
విశాలలోచనోపేతం తే కేబ్రూత విపశ్చితః? ॥ చి 2-104

పండితులారా! నానావిధ-అక్షరములు, మంచివాక్కులుగల్గి, విశాలనేత్రాలతో గూడినవి, ఏవో? విచారించితెల్పుడు అని ప్రశ్న. ♠ "వదన-సదనే".

ఇక్కడ "వదనం"లోని 'వ' ను చ్యుతంచేసి, దానిస్థానంలో "స' ను దత్తం చేసిన, "వదనము- సదనము' గా పరివర్తన చెందినది. అంతేకాక, శ్లోకంలోని విశేషణాలుకూడ "వదన-సదనములు" రెండింటికి సమానధర్మములై సమన్వయించుచున్నవి. ఇది పదద్వయ సాధర్మ్యంగల "చ్యుతదత్తాక్షరచిత్రము'

ఒకచో, మొగము [వదనం] అనేకాక్షరాలుగల మాటలను చెప్పుచు, విశాల లోచనాలుకల్గియున్నది. అట్లే 'గృహము" ['సదనం'] కూడ, తెలుపు, ఎరుపు, నలుపు మొ. రంగులుగల ఆవులతోను, విశాలలోచనాలుగల స్త్రీలతోను నిండియున్నది అని శ్లోకంలోని విశేషణాలకు సాదృశ్యం సమన్వితమై పొసగియున్నది.

N B. 1. పై రెండింటిలోను ప్రత్యుత్తరాలు బైట [బహిః] నుండి తెచ్చుటవలన,విని 'బహిర్లాపులు' అనబడును. 2. "గో." శబ్దము పుంలింగమైనచో ఎద్దు, గుఱ్ఱము, సూర్యుడు......., స్త్రీ లింగమైనచో-ఆవు, ఆడుగుఱ్ఱము, భూమి, వాక్కు, దిక్కు........, పుం స్త్రీలింగమైనచో- 'వజ్ర, స్వర్గ, జల, నేత్ర, కిరణ, బాణాదుల నానార్థములవి గమనింపవలెను.

కుమార్గాహిత సంచారాః ద్విషన్తః సుమనోగణాన్ ।
అజస్రం కాంక్షితస్వార్థాః కేఽపి తిష్ఠన్తి "మానవాః"॥ చ.చి. 2-112

కుత్సితమార్గమున ['కు-మార్గ] నడచుచు, పండితులను [దేవతలను కూడ] ద్వేషించుచు, ఎల్లపుడు స్వార్థమునకే పాటుపడుచు, తమపొట్టలను నింపుకొను కొందరు [కే+అపి] "మానవులు' [లోకమునందు] ఉన్నారు.

ఇక్కడ, "మానవాః' లోని "మా' కారాన్ని చ్యుతంచేసి, "దా' ను దత్తం చేసిన, 'దానవాః' [=రాక్షసులు] కాగలరు. "మా' చ్యుతంకాగా, తత్స్థానంలో

"దా"ను, లేక "దా" చ్యుతంకాగా, "మా"ను "ద త్తం" చేయుటవలన, ఈరెండిం టికి సమానధర్మాలు, [సాధర్మ్యాలు] 1 కుమార్గసంచారం, 2 సుమనోగణద్వేషము, కాంక్షితస్వార్థము-లు కాగలవు. రాక్షసులను దుష్టమార్గమున సంచరిస్తూ దేవతలను [సుమనః] ద్వేషిస్తూ, సదా స్వోదరపోషణకాంక్షకలిగి ఉందుట అను సాదృశ్యాలు శ్లేషలబ్దాలు. ఇది "చ్యుతదత్తాక్షరము".

## పూర్ణక్రమ చ్యుతకమ్

లక్షణమ్ : శ్లో. ప్రశ్నేషు ప్రథమం పూర్ణం ఆదిమధ్యాన్త త స్తతః
వర్ణైః చ్యుతైః ఉత్తరం యత్-తత్స్యాత్ పూర్ణక్రమ-
చ్యుతమ్॥ చి. 3-1

శ్లోకంలోని ప్రశ్నలలో మొదటి ప్రశ్నకు పూర్ణముగా వర్ణత్రయాత్మక (మూడు అక్షరాలుగల) శబ్దము సమాధానము గాను, రెండవది మొదలుగా వేయు మూడు ప్రశ్నలకు "ఆది-మధ్య-అన్తము లందలి వర్ణములను" చ్యుతం చేయగా, మిగిలిన రెండు వర్ణాలు సమాధానములైనచో, నది పూర్ణముగా చ్యుతి చెందుటచే "పూర్ణక్రమచ్యుత చిత్ర" మగును.

శ్లో. సంపత్కామాః కీదృశాః? కామ్యద్వ్యః? మణ్యశ్చ కీదృశాః?
కం శ్రితో యుద్ధ కామః స్యాత్? 'సారంభాః' చ క్రిమా త్తరమ్॥ చి.3.2

వి. ఈ శ్లోకంలోనే ప్రత్యుత్తరమగు 'సారంభాః' చెప్పబడినందున 'అంత ర్లాపి'-చిత్రమనబడును దీనిలోని 4 ప్రశ్నలకు 4 ఉత్తరాలు చెప్పవలెను. మొదటి ప్రశ్నకు మూడక్షరాల పదం పూర్ణంగా సమాధానం కాగా, తర్వాతి 2, 3, 4, ప్రశ్న లకు, క్రమంగా, ఆది, మధ్య, అన్త వర్ణాలను చ్యుతం చేయగా మిగిలిన రెండక్ష రాల పదాలు ప్రత్యుత్తరాలు కావలసియున్నవనుట గమనార్హము.

1ప్ర ఐశ్వర్యమును గోరువారెట్లుందురు? ఉ. సారం భాః (=సోమరులు గాక,) ఎల్లపుడు పనులు ప్రారంభించి చేయుచుందురు. ఇక్కడ "సారంభాః" అను మూడక్షరాల పదం, అఖండమై, పూర్ణంగా సమాధానమైనది.

2. మెత్తనైనవి ఏవి? ఉ. రంభాః (=అరటిచెట్లు) సారంభాః-లోని, మొదటి 'సా'ను చ్యుతం చేయగా మిగిలినది.

3. మణులు ఎట్లుండును? ఉ, సా భాః(=స+అ+భాః=కాంతితో కూడి యుండును. "సా(రం)భాః లో మధ్యాక్షరమగు "రం" చ్యుతం కాగా మిగిలినది.

4. దేనిని నమ్ముకొని యుద్ధం చేయబోవుదురు? ఉ. సారమ్ తనయొక్క ధన-సేనా బలమును, "సారం(రాః)" లోని అంత్యాక్షర లోపంతో "సారం' మిగిలినది.

శ్లో. యుద్ధప్రియః కః? దశతి కోవా? అన్య చ కో గుణః?
కో జలస్య చ సంబుద్ధిః? తేషాం "నారద" ఉత్తరమ్॥ చ చి, 3 7.

ఇందలి 4 ప్రశ్నలకు "నారదః" పూర్ణముగా ఉత్తరము

1. ప్ర. కంహ భోజను దెవరు? ఉ. నారదః=నారదమహర్షి.

2. కొరుకునది ఏది? ఉ. '(నా)రదః' నుండి "నా" చ్యుతం చేసిన, రదః (పన్ను) కొరుకును.

3. ఆకాశ-గుణమేది? ఉ. "నా (ర)దః"లో మధ్య "ర"చ్యుతితో "నాదః" (శబ్దము). శబ్దము ఆకాశము యొక్క గుణము ...."శబ్దగుణక మాకాశమ్" తర్క-సంగ్రహం.

4. జలసంబోధనమేది? ఉ. నార(దః)' =నార! = ఓ జలమా! అని నీటి కాహ్వానము. అత్యాక్షరచ్యుతి.

అక్షరాలన్నీ పూర్ణంగాచ్యుతాలగుటచే ఏది "పూర్ణచ్యుతకము".

కిం లక్ష్మీసద్మ? కం దేవాః నమన్తి? ద్యౌ శ్చ కం సృజేత్?
శ్రేణీసమానశబ్దః కః? తేషాం "రాజీవ" ముత్తరమ్॥ చ. చి. 3 - 9

ఏ దీనిలో 4 ప్రశ్నలు, 4 సమాధానాలున్నాయి వానిలో మొదటి ప్రశ్నకు వర్ణత్రయాత్మక 'రాజీవం" శబ్దం పూర్ణంగా ప్రత్యుత్తరం కాగా, ద్వితీయాది ప్రశ్నలు మూడింటికి, పై మూడక్షరాల పూర్ణమగు ఉత్తరం నుండి, ఆది మధ్య, అన్త్యవర్ణాలను తొలగింపగా, మిగిలిన రెండక్షరాలతో గూడిన పదాలు ప్రత్యుత్తరా లగుట విశేషము.

ప్ర లక్ష్మికి నిలయమేది? ఉ రాజీవమ్=పద్మము "లక్ష్మీః "పద్మాలయా" పద్మా ...అ కో. 2. దేవతలెవరికి నమస్కరింతురు? ఉ జీవమ్= బృహస్పతికి[ని] ఆదివర్ణచ్యుతి, "జీవ ఆంగిరసో గురుః-" అ కో. ఈ బృహస్పతి దేవగురువు.

3. ఆకాశము దేనిని సృష్టించును? ఉ (మధ్యవర్ణ "జీ" చ్యుతితో)రావమ్= శబ్దమును. "శబ్దగుణక మాకాశమ్" అని తర్క-సంగ్రహం.

4 పంక్తి (వరుస)కి సమానార్థాన్ని తెల్పు పదమేది? ఉ. (అంత్యాక్షరమగు "వం' ను తొలగింపగా మిగిలిన) రాజీ=పంక్తి, వరుస-అర్థాన్ని తెల్పును.

# అక్షరచ్యుతకమ్

శ్లో. అర్థే నాచ్యుతవర్ణస్య చ్యుతవర్ణ పదస్య చేత్।
అర్థస్య చారు సాధర్మ్యం "అక్షరచ్యుతకం" హి తత్॥ చి. 4–1
పాక మచ్యుత వర్ణేన సాధర్మ్యం కథితం యది।
చ్యుతవర్ణస్య తత్ప్రాహుః అక్షరచ్యుతకం బుధాః॥ చి. 4 - 2.
బిందు మాత్రా వ్యంజనానాం చ్యుతౌ లక్షణ మున్నయేత్॥
ఏవ మచ్యుత బింద్వాద్యైః తేషాం సాధర్మ్య మీర్యతే ॥చి. 4-3.

అచ్యుత వర్ణాలుగల పదములయొక్క అర్థములు, చ్యుతమైన- అక్షరాలుగల పదములకు సంబంధించిన అర్థాలతో, చక్కని సాధర్మ్యమును పొందియున్నచో, అది "అక్షరచ్యుతక" మనబడును.

బిందువు, మాత్రా, వ్యంజనముల యొక్క చ్యుతి జరిగినపుడు కూడ, వాని లక్షణముల విట్లే ఊహింపవలెను. అనగా-1. అచ్యుత బిందువునకు చ్యుత బిన్దువుతోను, 2. అచ్యుత మాత్రయైన దానికి చ్యుతమాత్రముతోను 3. అచ్యుతవ్యంజనము (హల్లు)నకు చ్యుతవ్యంజనముతోను, సాధర్మ్యము లేక సాదృశ్యము చారు తరంగా నున్నచో, ఆయా। బిందు, 2 మాత్రా 3. వ్యఞ్జనచ్యుతకములగునవి భావము.

N. B ఈ నాల్గు చిత్రాలలోని లక్ష్య శ్లోకాలు కేవలం "అంతర్లాపులు" గాని, కేవలం "బహిర్లాపులు"గాని కాక, "ఉభయ రూపము"లని గుర్తింపవలెను.

1. అంతర్లాపులు :- ఆ శ్లోకంలోనే (అన్తః) ప్రత్యుత్తరమున్నచో, అది "అంతర్లాపి",
2. బహిర్లాపులు :— ప్రత్యుత్తరాలు శ్లోకంలోలేనందున, బైట (బహిః) నుండి తెచ్చుకొని చెప్పబడునవి.

మరియు ఈ "అక్షరచ్యుతకము" 1. చ్యుతాది 2. చ్యుతమధ్యము, 3 చ్యుతాన్తము అని త్రి విధము.

1. ఆది-అక్షర చ్యుతకము.

శ్లో. అధిష్ఠితం ద్విజకులైః శాఖిభిః శిఖిభిః లసత్
సుమనోవిసరామోదం పుష్యత్ తద్ భాసతే వనమ్॥ చి.2.4

పక్షి సంఘములు (ద్విజకులైః) పైకెక్కి కూర్చున్న కొమ్మలుగల చెట్లతోను (శాఖిభిః) నెమిళ్ళతోను (శిఖిభిః) ప్రకాశించుచు, పుష్ప సందోహముల (సుమనో-నివహ) సుగంధము (ఆమోదం)ను పోషించి వెదజల్లుచున్న, ఆ "వన' మెంతో అందంగా ప్రకాశించుచున్నది.

N B "వనమ్-సవనమ్' ఈ రెండు దీనికి ప్రత్యుత్తరములు. చ్యుతాక్షరమైన వనమునకు, ఈ శ్లోకార్థము సరిపోయినది ఇక అచ్యుత 'సవనమ్' [= యజ్ఞము] నకు ఎట్లనగా—

ఆయా వేద శాఖల నభ్యసించిన [శాఖిభిః], పిలకలు ధరించిన [శిఖిభిః] బ్రాహ్మణ సంఘాలతో ఆశ్రయింపబడిన [ద్విజకులైః - అధిష్ఠితం] ఆ సవనము [యాగము] పండిత నివహము [సుమనో నివహ] నకు ఆనందామోదముల నధిక ముగా నందించుచున్నది.

ఈ శ్లిష్ట విశేషణములతో "వన-సవనములు" రెండింటికిని చారుతర సాధర్మ్యము సంభవమైనది. "సవనమ్" నుండి "స అను ఆది-అక్షరము చ్యుతమైనది గనుక "చ్యుతాద్యక్షర—లేక, ఆద్యక్షర-చ్యుతక' మగుచున్నది. మఱియు ప్రత్యుత్తరమగు "వనమ్' శ్లోకంలోనే ఉండుటచే, "అంతర్లాపి"యు, "సవనమ్"ను బైట నుండి తెచ్చుకొనుటచే "బహిర్లాపి'యు, అనగా- "ఉభయ రూపము'గా చెప్ప వలెను.

2. చ్యుతమధ్యమమ్ :
మూతనాం భోధరచ్ఛాయః సర్వలోక భయావహః
నిగృహీతః పురా క్షిప్రం కాలః త్రిపుర శాసినా॥ చి.4-11.

ని ప్రత్యుత్తరములు. 1. కాలః(=యమధర్మరాజు ..)2 కాకోలః(=భయంకర విషము) క్రొంగ్రొత్త మేఘముయొక్క కాంతితో పోలిక కల్గి, సమస్త ప్రపంచమునకు భయమును గొల్పుచున్న 'యమధర్మరాజు' (కాలః) పూర్వము, మార్కండేయ-రక్షణ సమయమున, ఆ భక్తుని ప్రార్థనను విన్నంతనే (క్షిప్రం) శివునిచే రక్షింపబడెను (నిగృహీతః). ఇది చ్యుత మధ్యమ వర్ణమునకు (కా(కో)లః=కాలః) వచ్చిన అర్థము.

క్రొంగ్రొత్త మేఘమువలె నల్లని కాంతితో, సర్వజనులకు భీతిని గొల్పుచు, దేవదానవులచే సముద్ర మథనము చేయబడిన సందర్భమున, హఠాత్తుగ వెల్వడిన 'కాలకూట'మను విషము (కాకోలః) ఈశ్వరునిచే త్రాగబడినది.

అచ్యుతపర్ణమైన 'కా(కో)లః'లో మధ్యనున్న 'కో' అను అక్షరము, చ్యుతం చేయబడుటచే, ఇది 'చ్యుతమధ్యమము', విశేషణ సాదృశ్యముచే, రెండవ అర్థము చక్కగా నరిపడియున్నది.

3 చ్యుతా స్తమ్-ఉపాస్యమానోఽవిరతం సామోదైః సుమనోగణైః॥
ఘనసంఘ విభ్రశ్రీకః కేశః స్ఫురతి సంప్రతి॥ చి. 4-12

వి. ప్రత్యుత్తరములు: 1 కేశవః [విష్ణువు] 2 కేశః (వెంట్రుక)

స+ఆమోదైః-సుమనోగణైః=సంతోషించిన-దేవతల సంఘముతో, అవిరతం-ఉపాస్యమానః=ఎల్లప్పుడు-సేవింపబడుచున్న ఘనసంఘ-విభ – శ్రీకః= మేఘసమూహ-సమాన-కాంతి గలవాడైన, [నీలమేఘశ్యాముడైన] విష్ణువు, సంప్రతి-స్ఫురతి=ఇప్పుడు మెరయుచున్నాడు.

అచ్యుతాక్షరమగు 'కేశవః'మంది, అంత్యాక్షరమగు 'వ'ను చ్యుతం చేసిన 'కేశః' (=వెంట్రుక) అని మిగులును. ∴ చ్యుతాస్తచిత్రము. పిమ్మట, విశేషణ సామ్యంతో వచ్చు ద్వితీయార్థ మెట్టిదనిన, మంచివాసన గల పూలగుత్తుల (సుమనో-గణైః) నెల్లపుడు ధరించి, మేఘమువలె నల్లగ, నిగనిగలాడుచున్న తల వెంట్రుక మెరయుచున్నది.

# బిన్దుచ్యుతకమ్

శ్లో. ప్రదర్శయ న్నతితరాం విగ్రహేషు నిజం స్థితిమ్ ।
అగదో భాసతే యేన పరరుక్ ప్రసభం హృతా॥ చి. 4-14

ప్రత్యుత్తరాలు : అంగదః (=వాలికుమారుడు, బిందుచ్యుతితో 'అగదః' (=మందు)

విగ్రహేషు-నిజం-స్థితిం-అతితరాం-ప్రదర్శయన్=అనేక యుద్ధాలలో తన దైన-సామర్థ్యమును-అధికముగా-ప్రదర్శించుచున్న, అంగదః=అంగదుడు, యేన-పరరుక్ - ప్రసభం-హృతా=ఏ అంగదునిచే-పరులబాధ- వెంటనే-పోగొట్టబడెనో? ఆ 'అంగదః'నుండి బిందువు (०) ను చ్యుతం చేయగా 'బిందుచ్యుతక' మైనపుడు వచ్చు ద్వితీయార్థము.

ఆయా రోగుల శరీరములలో [విగ్రహేషు] తన ప్రభావమును బాగుగా ప్రదర్శించుచున్న, ఏమందుచేత, ప్రజలరోగములు వెంటనే పోగొట్టబడినవో, ఆ మందు [అగదః] బాగుగా ప్రకాశించుచున్నది.

వి. విశేషణ సామ్యముచే, చ్యుత-అచ్యుత-అర్థములు రెండును సరిపడి యున్నవి.

## మాత్రాచ్యుతకమ్

శ్లో. ప్రకృష్టతాయా దేశస్య యో విభర్తి నిదానతామ్।
అకాశ సదృశచ్ఛాయః కాసరో౽యం విరాజతే॥ 4–24.

ప్రత్యుత్తరాలు; కాసర: [చ్యుతమాత్రము]=దున్నపోతు, కాసారః [అచ్యుతమాత్రము] సరస్సు.

తన పుట్టుకకు ఆదికారణమైన దేశముయొక్క గొప్పతనమును ప్రకటించుచు, ఆకాశంవలె నీలి వర్ణంతో వెలుగొందుచున్న ఆ [ముష్టాజాతి] దున్నపోతు విరాజిల్లుచున్నది.

వి. చ్యుతమాత్రకమగు 'కాసరః' మాత్రాచ్యుతకమునకు ఉదా : కాగా, అచ్యుత మాత్రకమగు 'కాసారః'కు సరిపడు రెండవ అర్థము—

తామున్న ప్రదేశమునకు ప్రతిష్ఠను చేకూర్చుచు, అగాధ జలముతో ఆకాశము వలె నల్లగా కన్పడుచున్న, ఈ[కొల్లేరు మొ ] సరస్సు చక్కగా ప్రకాశించుచున్నది.

## వ్యఞ్జన చ్యుతకమ్

శ్లో. అనావృతాపామభవైః ఆపాటల విలోచనైః।
క్లేశేన మహతా యుక్తైః ఓదనం క్రియతే జనైః॥ 4-35

ప్రత్యుత్తరాలు : వ్యజనచ్యుతకము ఓదనమ్ (=అన్నము) అచ్యుతకవ్యంజనం :రోదనమ్=ఏడ్పు, పూర్వమెప్పుడును సంతాపము (వేడిమి) నను భవింప నందున, ఎఱ్ఱబడిన కన్నులుగల జనులచే, మిక్కిలికష్టముతో అన్నము తినబడు చున్నది.

వి. అచ్యుతవ్యంజన మగు 'రోదనం' నుండి, వ్యంజన(హల్‌మాత్ర) మగు రేఫ(ర్) తీసివేయబడగా, ఇది వ్యంజన చ్యుతకమైనది.

చ్యుతం కానపుడున్న 'రోదనమ్'కు అనుకూలంగా, విశేషణ సాధర్మ్యంతో వచ్చు ద్వితీయార్థమెట్టిదనిన—

ఎండ తీవ్రతను లేక జ్వరాధిక్యమును, ఏనాడును అనుభవింపనందున, వేదా బాధతో, కన్నెఱ్ఱబడి, ఆ అత్యంతకష్టమునకు తట్టుకొనలేని జనులు ఏడ్పు చున్నారని భావము.

# "తుల్యార్థాక్షరాది చ్యుతకమ్"

లక్షణమ్ : శ్లో. తుల్యార్థకం పదం య ద్యత్ వర్ణాదీనాం చ్యుతౌ వపి ।
తుల్యార్థ త త్తద్ చ్యుతక-సంజ్ఞాం త త్తద్-పదంభజేత్ ॥ 5-1

యత్-యత్-పదం=ఏ-యే-పదము, వర్ణ+ఆదీనాం-చ్యుతౌ+అపి=వర్ణ-మాత్రా-బిందు-వ్యంజనార్థముల-చ్యుతిచెందినప్పుడు- కూడ, ఇతర-అచ్యుతివర్ణాదులతో, తుల్య+అర్థకం=సమాన-అర్థము గల్గినదై, తత్-తత్-పదం=ఆ-యా-పదము,తుల్య+అర్థ తత్-తత్-చ్యుతక-సంజ్ఞా-భజేత్=1. సమానార్థకమగు అక్షర చ్యుతక, 2 తుల్యార్థమాత్రాచ్యుతక, 3 తుల్యార్థబిన్దు చ్యుతక, 4. తుల్యార్థవ్యంజన చ్యుతక, 5. తుల్యార్థ-అర్థచ్యుతకములను పేరులను, విడివిడిగా-పొందును, N.B. ఇవి-బహిర్లాపులు.

# తుల్యార్థ వర్ణ(అక్షర) చ్యుతకమ్

శ్లో. సమానవేగో మరుతా వర్ణ్యతే కః కవీశ్వరైః ।
చ్యుతేఽపివర్ణే తుల్యార్థం పదం వాచ్య మిహో త్తరమ్॥ 5—2

కవీశ్వరులు, గాలితో సమానవేగముగలదానినిగా దేనిని వర్ణించిరి? అని ప్రశ్న. దీనికి ప్రత్యు త్తరమైన పదములోని ఒక వర్ణము చ్యుతమైనను, దానితో సమానార్థముగలపదము ప్రత్యు త్తరముగా చెప్పదగియున్నది.

ఈ 'తుల్యార్థ చ్యుతకము' లన్నియు 'బహిర్లాపు' లగుటచేత, ప్రత్యు త్తరములను బైటనుండియే, వెదకితెచ్చి, చెప్పవలెను. సమాధానం:-తురంగమః-తురంగః (=గుఱ్ఱము), 'తురంగమః' అను ప్రత్యు త్తర పదము చ్యుతి నొందని పదము. దీనినుండి 'మ' అనువర్ణాన్ని చ్యుతం చేసినను, తత్ తుల్యార్థక చ్యుతక వర్ణంగల 'తురంగః' అనుపదము, ప్రత్యు త్తరమగుచున్నది అనగా-అచ్యుతవర్ణ 'తురంగమ' పదమునకు, చ్యుతవర్ణమై, సమానార్థకమగు 'తురంగః' అను పదము ప్రత్యు త్తరమైనది వస్తుతః ఈ రెండు పదాలు సమానార్థముగలవగుటచే, ఇది 'తుల్యార్థవర్ణ చ్యుతకము'

'ఘోటకే వీతి తురగ తురంగా శ్వ తురంగమాః.... అని అమరకోశము ఘోటకః, వీతిః, తురగః, తురంగః, అశ్వః, తురంగమః....ఇవన్నీగుఱ్ఱంపేర్లు.

# తుల్యార్థమాత్రాచ్యుతకమ్

శ్లో. తరుణీజన సౌందర్య దర్శనం కోఽభి వాంఛతి? ।
మాత్రా చ్యుతా వపి పదం తుల్యార్థం స్యా ది హోత్తరమ్॥ 5-19

యువతీజనుల చక్కదనమును సందర్శింపవలెనని కోరువాడెవరు? అని ప్రశ్న. దీనికి ప్రత్యుత్తరంగా నున్న పదం నుండి ఒక మాత్రను చ్యుతం చేసినను, తత్తుల్యార్థకపదమే ప్రత్యుత్తరంగా నెన్నుకొని, చెప్పవలెను సుమా! అచ్యుత మాత్రా పదం "పూరుషః . దీనినుండి ఒక మాత్ర (ఊకార-(దీర్ఘ)ము) చ్యుతమైనను, తత్తుల్యార్థపదం "పురుషః" అనునది ఈ రెండింటికి "మగవాడు" అనియే తుల్యార్థము "స్యుః పుమాంసః పంచజనాః 'పురుషాః-పూరుషా'నరాః' అ.కో.

# తుల్యార్థ బిందుచ్యుతకమ్

శ్లో. తరంగిణీనాం రమణః కీదృశో జగతీతలే ।
చ్యుతేఽపి బిందౌ తుల్యార్థం పదం వాచ్య మి హోత్తరమ్॥ 5-22

"నదీ భర్తయగు సముద్రుడు లోకమున నెట్టివాడుగానెన్నబడెను' అని ప్రశ్న. ప్రత్యుత్తర పదంలో 'బిందువు" చ్యుతమైనను, తత్తుల్యార్థకపదమే సమాధానం కావలెను. ఊ "గంభీరః-గంభీరః" రెండు పదాలకు "లోతైనవాడు" అనియే అర్థం. కాని, మొదటి గంభీరః"లో బిందువు (ం) చ్యుతంకాలేదు. రెండవ "గభీరః"లో బిందువు చ్యుతమైనను. తత్తుల్యార్థక "గంభీర ' పదము ప్రత్యుత్తర మగుట విశేషము....నిమ్నం గంభీరం గంభీరం....అ.కో.

# తుల్యార్థవ్యంజనచ్యుతకమ్

శ్లో. ప్రయుజ్యతే కిం సమరే వీరేణ పరిపంథిషు ।
చ్యుతా వపి వ్యంజనస్య తుల్యార్థం పద ముత్తరమ్॥ చి.5-33.

యుద్ధమున వీరునిచే శత్రువులపై నేది ప్రయోగింపబడును? అని ప్రశ్న ఇక్కడ, వ్యంజనం (హల్ మాత్రం) చ్యుతమైనను, తత్తుల్యార్థక పదము ప్రత్యుత్తరం కావలెను

ఉ_త్తరాలు, "అభ్రమ్-శభ్రమ్" అమనవి. ఈ రెండింటి అర్థము సమాన మైనను, "శభ్రం"లోని వ్యంజనం (శ్) అచ్యుతం కాగా, తర్వాత "శ" కారం చ్యుతమై "అభ్ర"మైనది. "శభ్రం"లోని "శ"కారమను వ్యంజనం చ్యుతమైనను, తత్తుల్యార్థక "అభ్రం" అను పదము ప్రత్యు_త్తర మగుటచే, "తుల్యార్థవ్యంజన చ్యుతక"మైనది.

# తుల్యార్థార్థచ్యుతకమ్

శ్లో. గండస్థలీగలం (శ)ద్దాన నిర్ఝరః కో మహీతలే? ।
అర్థే చ్యుతేఽపి తుల్యార్థ పదం వాచ్య మి హూ_త్తరమ్ 5-49

భూతలమున, గండస్థలము (చెక్కిలి) నుండి మదధార (దానం)ను సెల యేరు (నిర్ఝరః)వలె కార్చునది ఏది? అను ప్రశ్నకు, అర్థము చ్యుతమైనను, తుల్యార్థపదమును మాత్రం సమాధానంగా, సమీక్షించి, చెప్పవలెను ఉ "గజః-మతంగజః" (=ఏనుగు) "మతంగజః' పదము అచ్యుతార్థము "గజః" చ్యుతార్థము. "మతంగజః" నుండి "మతం" చ్యుతమైనది. ఈ రెండు పదాలు "తుల్యార్థము"లగుటచే, ఇది "తుల్యార్థ-అర్థచ్యుతక"మైనది.

శ్రీకృష్ణ బ్రహ్మయతీంద్రుల "అలంకార మణిహారము నొకసారి తిలకించండి.

శ్లో. కాంతేఽనవరత సంపద మభీప్సితాం కోమలాంగి! త వావి? ।
మనఘావిరతం భాగ్యం వితరసి మేఽభీప్సితం యది కృతార్థాః అ మ.

కోమలాంగి! తే-అభీప్సితాం-కాం-అనవరత సంపదం-తనవావి?=నీకు ఇష్టమైన-ఎట్టి-అవిచ్ఛిన్న సంపదను-వి_స్తరింపజేయగలను? అని కృష్ణుడు గోపికను ప్రశ్నించుట సామాన్యార్థము. "కాంతేఽనవరత-"లోని, అకార ప్రశ్లేష(ఽ)ను తీసివేసి, "కాంతే-నవరత...."గా విభజించిన, కోమలాంగి! నీకు ఇష్టమగు ఏ నూతన సంభోగ (నవ-రత) సంప_త్తిని-వి_స్తరింతును? అని ప్రతీయమానార్థము. కాగా, గోపిక-"మనఘ!-మే-అభీప్సితం-అవిరతం-భాగ్యం-యది-వితరసి-కృతార్థా=మేభవామ! నాకు-ఇష్టమైన-ఎడతెగని-సంపద (భాగ్యము)ను కల్గించిన ధన్యురాలి నగుదును అని ప్రత్యు_త్తరించుట సామాన్యార్థము. మరల, 3వ పాదాన్ని, (మనఘ+అవిరతం" నుండి, "అ' ను చ్యుతంచేసి) 'ఘన!-భావిరతం ... గా,

విడదీసిన, ఓ మనుజా! చిరకాలవాంఛిత-భవిష్యత్ సంభోగరూప-భాగ్యం కల్పించి నచో, అభీష్టసిద్ధినొంది, ధన్యవగుదువు సుమా-అని రెండవ ప్రతీయమానార్థము. లేక "ఘనభావిరతం....." సంధిలోని "అ"ను చ్యుతంచేసి, ఘనభ! "విరతం'గా విడదీసినచో, వి-రతిం=విశేషరూపరతిని ప్రసాదించిన, మరింత ధన్యురాలివగు దువు' - అనునది ప్రతీయమానార్థాంతరము కాగలదు

వి. 1. 'కాంతేఽనవరత ...అకారప్రశ్లేషలో 'ఽ" చ్యుతిచే, చ్యుత చిత్ర మగు, "ఘనభ+ అ' విరతం సంధిలోని "అ"కారచ్యుతిచే మాత్రాచ్యుతక మవగును.

2. మరియు, దీనిలోని ప్రశ్నోత్తరములు రెండును, అర్థాంతర గర్భితములై, ప్రశ్నోత్తర రూపమునగూడ 'చ్యుతచిత్రమగుటకు" అర్హతను సంపాదించు కొన్నవి.

శ్రీ గొల్లాపిన్ని మల్లికార్జున సూరి-కవి అను పరిశీలింపుడు.

# పూర్ణాక్రమ చ్యుతమ్

శ్లో॥ కీ దృ గ్విష్ణుః, తజ్జనస్య సంబంధీ కో ఽర్థదః పునః?
స కీ దృశః? తత్ప్రియే కే? తేషాం 'శ్రీశేశ' ఉత్తరమ్॥

ఇది 'వాసుదేవావస్థ' కర్త-శ్రీ మల్లికార్జున సూరి (20 శ.) ఉదాహరణము.

ప్ర 1 విష్ణుః-కీదృక్=విష్ణువు ఎట్టివాడు?2. తజ్జనస్య-సంబంధీ-కః?= అతనికి సంబంధించిన వారెవరు?

3 పునః-అర్థదః-సః-కీదృశః=మరల-ధనమునిచ్చు-అతడు-ఎట్టివాడు? 4. అతనికి-ప్రియురాంద్రుఎవరు? అన్నిటికి, క్రమంగా "శ్రీశేశః ప్రత్యుత్తరము ఉ. 1, శ్రీశేశః=(శ్రీం+ఈశః) సంపద గలవారికి-ప్రభువు 2. (ప్రథమాక్షర చ్యుతితో) శేశః=వాణీశః=బ్రహ్మ 3. (ద్వితీయాక్షర చ్యుతితో) శ్రీశః=లక్ష్మీపతి. 4. (మూడవ అక్షరాన్ని తొలగిస్తే) శ్రీ-శే=శ్రీదేవి, భూదేవియునునారు, (శ్రీ+ఇలా+ ద్వివచనం).

# దత్తచ్యుతాక్షరాద్యస్తమ్.

చక్ర కవి చెప్పిన 'చ్యుత దత్తాక్షరాన్తాది చిత్రము'ను, 'వాసుదేవానన్ద కర్త (19, 20శ) శ్రీ మల్లికార్జునసూరి, నామాన్తరంతో నిట్లుదాహరించెను.

1, శ్లో. కో లక్ష్మీ నాయకః, కా భువన పరివృఢ స్యాన్య సంబుద్ధి రూహ్యా
కా విష్ణో ర్మూర్తి, రర్చ్యా, విరవదికరుణ స్యాన్య సంబోధనం కిమ్?
కాఽన్య శ్లాఘ్యా ఽన్య సంబుద్ధి రిహ వసుకృతః కా, య ద త్తో త్తరం స్యాత్
ఆదేః తత్రాది మాంత్యాక్షరయుతి-వియుతిభ్యాం క్రమా దు త్తరాణి॥

N. B. ఇక్కడ, మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తరమైన దాని యొక్క ఆదిలో అక్షరమును చేర్చి (యుతి) ఆ ప్రత్యుత్తరం చివరి అక్షరాన్ని చ్యుతం (వియుతి) చేయవలెను. మొత్తం 6 ప్రశ్నలకు సమాధానం "వసుదయాలో కేశవః". లక్ష్మీ నాయకుడెవరను మొదటి ప్రశ్నకు, దీనిలో చివరనున్న 'కేశవః' (విష్ణువు) ప్రత్యుత్తరం కాగా, ఇక రెండవ ప్రశ్న ప్రత్యుత్తరమగుటకు, ఈ 'కేశవః'కు ముందు 'లో' అను అక్షరాన్ని దానంచేసి, చివరినున్న 'వః'ను చ్యుతం చేయగా, 'లోకేశ' సమాధానమగును. ఇట్లే 3వదానికి 'యాలోకే', 4వదానికి 'దయాలో' 5వదానికి 'సుదయా', 6వప్రశ్నకు 'వసుద' అనునవి ప్రత్యుత్తరములగుచున్నవి.

2. శ్లో॥ క స్సీతేశః,శ్చ కీదృ క్స్మరమథనకథా?, కా వరాహోద్ధృతా? కే
సంబుద్ధీ విష్ణుయోగ్యే?, రుచిర నఖమణి ప్రోజ్జ్వలే కే మురారేః?
సంబుద్ధిః శ్రీపతేః కా?, మురరిపురమణీ కా?, య దత్తో త్తరం స్యా-
దాదే స్తత్రా దిమా న్త్యాక్షర యుతి వియుతిభ్యాం క్రమా దు త్తరాణి,

ఇందలి 7 ప్రశ్నలకు 'రమాపదేవ రసారామః" ప్రత్యుత్తరము. దీనిని పైన చూపినట్లు, అద్యక్షర దానం, అంత్యాక్షర చ్యుతిలో, విడగొట్టుకొని సమాధానం చెప్పుకొనవలెను ఎట్లనగా—1వ ప్రశ్న సీతాపతి ఎవరు'కు 'రామః' సమాధానం కాగా 2వ ప్రశ్నకు హరికథ ఎట్టిది? 'రామః' ముందు 'సా' చేర్చి, చివరి 'మః'ను చ్యుతం చేయగా 'సారా' (=అన్తః సారము గలది) ప్రత్యుత్తరం ఇట్లే ఇతరత్ర. ". ఆదివరాహముచే ఎత్తబడినదేది? ఉ రసా=భూమి, 4. విష్ణువుకు తగిన రెండు సంబోధనలేవి? ఉ. 1 వర! 2 దేవ!-అనునవి. 5. హరియొక్క—నఖమణులచే ప్రకాశించునవి ఏవి? ఉ పదే=రెండుకాళ్ళు 6 విష్ణు సంబోధనమేది? ఉ. మా-ప!= రమను రక్షించువాడా! (మాం (లక్ష్మీం) పాతి) 7 విష్ణువి భార్య ఎవరు? ఉ. రమా =లక్ష్మి, ఇట్లు క్రమంగా ప్రత్యుత్తరములు కాగలవు.

హీయమానాక్షర-వర్ధమాన-అక్షరములు.

వీనిలో క్రమముగ అక్షరచ్యుతి, అక్షరదానములు జరుగుచుండును. అయినచో, చ్యుతదత్తాక్షర చిత్రాలకు, వీనికి గల తేడా ఏమి-అనే ప్రశ్న రావచ్చును. దీనికి సమాధానము:-

లక్షణం : శ్లో. ఆదితో మధ్యతోఒన్తాద్వా హీయన్తే వర్ణజాతయః।
ఏక, ద్వి, త్ర్యాదయో యత్ర "హీయమానాక్షరం" హి తత్॥

ఏ ప్రత్యుత్తరమున, మొదటినుండి, మధ్యనుండి, అంతము (చివరి) నుండి గాని, ఒకటి, రెండు, మూడు- మొదలైన అక్షరజాతులు విడువబడినచో, అది "హీయమానాక్షర' మను "ప్రశ్నోత్తర చిత్ర' మగును.

ఉదా. శ్లో. సముద్యతే యత్ర న యాతి పాంసులా?
సముద్యతే కుత్ర భయం భవేత్–జలాత్?।
సముద్యతే కుత్ర తవా పయా త్యరిః
ప్రహీణ సంబోధన వాచి కిం పదమ్? వి ము 3-38

ఇందలి నాలుగు ప్రశ్నలకు "హిమకరే' అనుఒక్కపదమే ప్రత్యుత్తరము.

1వ ప్రశ్న. ఎవరు ఉదయించినంతనే అంకుటాలు బైట తిరుగదు. ఉత్తరం : "హిమకరే =చంద్రుడు ఉదయించినంతనే [వెన్నెలలో, ప్రియ-విటాన్వేషణ చేసిన ప్రజలు గర్హింతురవి) వ్యభిచారిణి బయటికిరాదు. ఈ మొదటి ప్రశ్నకు "హిమకరే [సతిప్తమి] మొత్తంగా సమాధానం. 2. నీటినుండి పైకి వచ్చి, భయమును గల్గించునది ఏది? ఉ "మకరే=మొసలి. ఇది నీటిపైకి వచ్చి భయమును కల్గించును "హిమకరే లో మొదటి అక్షరం హీ[యమా]నం చేయగా, "మకరే" లబ్దమైనది.

3. నీవు దేనిని ఎత్తినంతనే నీ శత్రువులు భయపడి పారిపోవుదురు?

ఉ. "కరే' (చేయి) యుద్ధంలో నీరుకు [సాయుధమైన] చేతిని ఎత్తినంతనే శత్రువులు పారిపోవుదురు "హిమకరే' నుండి 'హిమ' తొలగింపగా, "కరే" మిగిలినది.

4 మూర్ఖుని, ఏపదంతో సంబోధింతురు? ఉ 'రే" [=ఒరే, ఓరీ।] అని పిల్తురు.

"హిమకరే నుండి, క్రమంగా, 1,2,3 అక్షరాలు మూడు చ్యుతం చేయ బడినవి.

N. B. ఈ 'హీయమానాక్షరము"న క్రమంగా ప్రత్యుత్తరము నందలి ఒక్కొక్క అక్షరం "చ్యుతం" చేయబడినను, ఇదొక శ్లోకభాగమే కాని, శ్లోకం మాత్రం కాదు అందువలన విశేషణ సాధర్మ్యంతో అన్వార్థం గాని, తుల్యార్థంగాని వచ్చి, అసందింప జేయ జాలదు. మాత్రాదిచ్యుతకాలలో ప్రతిచోట "మాత్ర" మొదలగువానివి చ్యుతం చేయగా, విశేషణ సాదృశ్యంవలన, అచ్యుతమునకు ఒక అర్థము, చ్యుతమునకు మరొక అర్థము వచ్చి చమత్కారాన్ని చెల్లిస్తుంది

ఇక తుల్యార్థచ్యుతకములో ఒక్కసారి మాత్రమే చ్యుతి జరిగినను, పదము "తుల్యార్థక' మగుటచే, అన్వార్థ ప్రసక్తి రానేరాదు. "హీయమానాక్షరము' న అట్లుగాక, ఒకే శ్లోకమున, పలు ప్రశ్న లుంటాయి. వానికి సమాధానవదం మండి, ఒక్కొక్క అక్షరాన్ని క్రమంగా తొలగించుచు, ప్రత్యుత్తరించుకొందుము. కనుక, "చ్యుతక-హీయమానాక్షరము"లకు "అంతరం మహదంతరం" - అవి తెల్పుటకే, ఇట్లు వ్రాయవలసి వచ్చినది

ఇట్లే "వర్ధమానాక్షరము' న ఒక్కొక్క అక్షరం వర్ధమానమగుచు [పెరుగుచు,] ప్రత్యుత్తరమగుచున్నందున, "దత్తచిత్రము"తో దానిని పోల్చుటకు వీలుపడదు.

ఎట్లన:-కః శబ్దః ప్రతిషేధ మీరయతి? కా సంజ్ఞా క్రియాః? కా పునః
సీతాయాః ప్రియవాదినీ? స్ఫురతి కా సంఫుల్లపద్మేక్షణా? '
ఏకైకాక్షరదానతః ప్రథమతః శేషాం చతుర్ణా మపి
బ్రూయాత్ సత్వర ముత్తరం మతిమతా మగ్రేసరః కశ్చన।

N. B. ఆది, మధ్య, అంతములలో+అద్యన్తములలో కూడ, 1,2,3 మొ. అక్షరజాతులు "దత్తం చేయబడగా, కలిసి, వృద్ధి చెందినచో, అది "వర్ధమానాని అక్షరాణి యస్మిన్ తత్" వ్యుత్పత్తితో, వర్ధమానాక్షర మౌతుంది. పై శ్లోకంలోని 4 ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు మా, రమా, సరమా వాసరమా అనునవి ఎట్లు?

పద్యంలోని ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెప్పదలచిన బుద్ధిమదగ్రేసరుడు, ముందు, 1వ ప్రశ్నకు సమాధానమును తేల్చుకొని, పిమ్మట, ఆ సమాధానమునకు ముందు క్రమంగా, ఒక్కొక్క అక్షరమును పెంచుకొనుచు, ఈ ప్రశ్నలన్నిటికి ప్రత్యుత్తరములు వచ్చునట్లు చేయవలెను.

ప్ర 1. నిషేధమును దెల్పు శబ్దమేది? ఉ 'మా', ఇది 'కాదు, లేదు' అని నిషేధించును.

2. లక్ష్మికి మరియొక పేరేమి? ఉ. 'రమా', ఈ పదము లక్ష్మికి నామాన్తరము.

3. లంకలో సీతాదేవికి ప్రియవార్త తెల్పిన దెవరు? ఉ 'సరమా'-అను వనిత. (ఈమె ఒక గంధర్వుని కూతురు. విభీషణుని భార్య. రావణుడు శ్రీరాముని శిరస్సు తెచ్చి, 'రాముడు మరణించె'నని సీతకు దెల్పగా, దుఃఖించుచున్న సీతకు, 'అది మాయా శిరస్సు, రాక్షసమాయ' కనుక నమ్మవద్దు—అని తెల్పి, ఈ సరమ సీతను కాపాడినదని గాథ)

4. వికసిత పద్మాక్షియై ప్రకాశించునది ఏది? ఉ వాసరమా (=దినలక్ష్మి).

వి. 1వ ప్రత్యుత్తరమగు 'మా'కు ముందు 'ర' దత్తంచేయగా 'రమా'యై 2వ ప్రశ్నకు సమాధానమైనది. ఈ 'రమా'కు ముందు 'స'ను, అట్లే 'సరమా'కు ముందు 'వా'ను చేర్చగా, 'సరమా, వాసరమా' అయి, 3, 4 ప్రశ్నలకు ప్రత్యుత్తరము లైనవి. దీనిలో ఒక్కొక్క అక్షరము 'ఆది'నుండి మున్ముందుకు పెంచబడి నది.

N. B. విశేషాంతరములను మా 'ప్రశ్నోత్తర చిత్రాలంకారము'న గాంచ గలరు.

శ్లో. పానుజః కాననం గత్వా కైకసేయాన్ జఘాన కః?
మధ్యే వర్ణత్రయం దత్వా రావణః కీదృశోవద?॥ వి. 3-33.

ప్ర 1. తమ్మునితో అడవికేగి, రాక్షసులను చంపినవాడెవరు? 2. దీని ప్రత్యుత్తరం మధ్యలో, మూడు అక్షరాలు పెంచి, కలిపి, రావణుడెట్టివాడో-తెల్పుము?

ఉ. 1. రామః (4=శ్రీరాముడు, తమ్ముడగు లక్ష్మణునితో అడవికేగి, రాక్షసుల జంపెను.

2. ఈ 'రామః' మధ్యలో 'క్షసో త్త' అను మూడక్షరాలు కలిపి, పెంపొందించగా, 'రాక్షసోత్తమః" (రాక్షసులలో రావణుడు గొప్పవాడు) అయినది.

వి. ఇక్కడ, ప్రత్యుత్తరం మధ్యలో మూడువర్ణాలు దత్తం చేయబడినవి.

శ్లో. విద్యయా స్తి సహ కోఽత్ర విరోధీ? కా మునే రపి మనోమదయ స్త్రీ?
రావణః స్మ భృశ మీర్ష్యతి కస్మై? కావ్య మాహ రమృతప్రతిమం కిమ్?"

ఈ 4 ప్రశ్నలకు 1. రాః 2 రామా 3 రామాయ 4 రామాయణమ్-ప్రత్యుత్త రాలు

ప్ర 1. విద్యకు విరుద్ధమైనదేది? ఉ. రాః=ధనము. లక్ష్మి [ధనము] ఉన్నచోట సరస్వతి ఉండదని భావం.

2. మహర్షుల మనస్సులందును మత్తు పుట్టించున దెవరు ? ఉ రామా [=అందగత్తె],

3. రావణుడెవరిపై ఎక్కువ ఈర్ష్య గల్గి యున్నాడు? ఉ రామాయ [=రాముని-కొరకు, పై]

4. అమృత తుల్యమగు కావ్యమేది? ఉ. రామాయణమ్ [=వాల్మీకి రచించిన రామాయణము]

వి. ఇక్కడ ప్రత్యుత్తరమున ఒక్కొక్క అక్షరం చొప్పున క్రమంగా పెంచబడినది.

శ్లో. విష్ణోః కా వల్లభా దేవీ లోకత్రితయ పాలినీ? ।
వర్ణా వాద్య న్తయో ర్దత్వా-క శ్శబ్దః తుల్యవాచకః ? ॥

ప్ర 1. ముల్లోకములను పాలించు, విష్ణుప్రియురాలగు దేవి ఎవరు ఉ. 'మా' = లక్ష్మి.

2 దీనికి ముందు, వెనుక, ఒక్కొక్క అక్షరముంచి, మొత్తం మూడు కలుపగా, వచ్చిన 'తుల్యార్థమః' (సమానమును)తెల్పు శబ్దమేది? ఉ. స'మా'నః. [తుల్యము]:

వి. 'మా'కు ముందు 'స'ను, చివర 'నః' ను కలుపగా వచ్చిన, 'సమానః' అను శబ్దము తయారై, తుల్యార్థమును తెల్పుచున్నది

వి 1. ఇక్కడ, ప్రత్యుత్తరమునకు ముందు వెనుకకూడ. అక్షరములను దత్తంచేసి పెంచుట విశేషము 2 దీనిలో క్రమంగా ఒక్కొక్క అక్షరం 'దత్తం' చేయబడుటచే, అనేక ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు లభించినవి, గాని, 'దత్త'చిత్రంలో ముఖ్యమైనదగు విశేషణ సామ్యంతో అన్యార్థప్రతీతి, మాత్రం గల్గుటలేదు. అందుచేత హీయమాన-వర్ధమానాక్షర జాతులకంటె, "చ్యుత-దత్త" చిత్రములు భిన్నములని గ్రహింపవలెను.

శ్లో. క్షోణీ కం నహతే? కరోతి దివి కా నృత్యం? శివాయాః పతిః
భూతానాం క మయుం క్త జీవహరణే? కా రామశత్రోః పురీ?
కం రక్షన్తి చ సాధవః? పశుపతేః కిం వాహనం? ప్రోచ్యతాం
అ లోమ ప్రతి లోమ శాస్త్ర చతురైః ఏకం ద్వయో రుత్తరమ్॥

అనులోమ ప్రతిలోమ చతురులగు శాస్త్రజ్ఞులీ ఆరు (6) గతి చిత్రప్రశ్నలకు మూడు ప్రత్యుత్తరములు చెప్పవలెను సుమా! అవి భావము.

1 వ ప్రశ్న : భూమి దేనిని సహించుచున్నది? ఉ భారం [=బరువును]

2 వ ప్రశ్న : స్వర్గమున నాట్యముచేయునది ఎవతె? ఉ రంభా [='రంభ' అను ఒక అప్సరస],

3 వ ప్రశ్న : ప్రాణిక్షయము చేయుటకు లయకారకుడగు శివుడెవరిని నియమించెను? ఉ. కాలం [=యముని],

4 వ ప్రశ్న · రాముని శత్రువైన రావణుని పట్టణమేది ? ఉ. లంకా [=లంకా నగరము],

5 వ ప్రశ్న : సజ్జను లెవరిని రక్షింతురు? ఉ. దీనం [=దరిద్రుని, భయపడిన వానిని].

6 వ ప్రశ్న : శివునికి వాహనమేది? ఉ. నందీ [=నందీశ్వరుడు, ఎద్దు].

ఇక్కడ ప్రతి జంట ప్రశ్నల కొకే సమాధానమున్నది. కాని వానిని అనులోమం గాను, విలోమం గాను చూడవలెను. 1వ ప్రశ్నకు అనులోమంగా సమాధానమైన "భారం"మ్ము, విలోమం చేసిన "రంభా"యై, ద్వితీయానికి ప్రత్యుత్తరమగుచున్నది. 3 వ ప్రత్యుత్తరం "కాలం" త్రిప్పి చదివిన "లంకా"అయి, 4 వ సమాధానమగును. 5వ దగు "దీనం" విలోమంగా "నందీ"యై 6వ దానికి సమాధానమగుచున్నది.

"భారం"లోని అంత్యాక్షరమగు "రం"ను చ్యుతం చేసి, మిగిలిన "భా"కు ఆద్యక్షరంగా నొకదానిని దానం చేయుట వలన, చ్యుత చిత్రము, లేక దత్త చిత్రమనుటకు వీలున్నది. కాని, "చ్యుతదత్త" చిత్ర మనుటకు మాత్రము వీలులేదు. ఏలన-"చ్యుతదత్త చిత్రము"న చ్యుతమైన దాని స్థానంలోనే, అక్షర దానం జరుగవలెను. ప్రత్యుత్తరాలు బైట నుండి తీయబడి నందున ఇదొక బహిరాలాపము మాత్రమే.

కస్మిన్ శేతే మురారిః ? క్వ ను ఖలు వసతిః వాయసీ? కో నిషేధః?
స్త్రీణాం రాగం తు కస్మిన్? క్వ ను ఖలు సితిమా? గౌరి సంబోధనం కిమ్?
సంబుద్ధిః కా ఉ హిమాం శోః? విధి-హర-వయసాం చాపి సంబుద్ధయః కాః?
బ్రూతే లుబ్ధః కథం వా? కురుకులహననం కేన? తత్- "కేశవేన" నురథాం.

N B పద్యంలోని 12 ప్రశ్నలకు "కేశవేన' అనునది ఒక్కటే ప్రత్యుత్తరము. ఎట్లు ?

ప్ర 1. విష్ణువు ఎక్కడ పరుండును? ఉ కే=నీటి యందు (సముద్ర జలమున]
2. కాకికి సంబంధించిన-ఉనికి ఎక్కడ? ఉ. శవే=శవము (పీనుగు) నందు
3. నిషేధము నేది తెల్పును? ఉ న(=నఞ్)=లేదు కాదు-అని తెల్పును.
4. స్త్రీల అనురక్తి ఎవని యందు ? (విలోమంగా) ఉ. నవే=నూతన యువకుని యందు.
5. తెల్లదన మెక్కడ ఉండును? ఉ. శకే=మనసునను శకజాతి యందు,
6. విష్ణు సంబోధనమెట్లు? ఉ. (హే) కేశవ! =ఓ కేశవా! అని
7. సూర్యుని సంబోధనఎట్లు? ఉ. ఇన!=ఓ సూర్యుడా! అని.
8. 9. 10 బ్రహ్మను, శంకరుని, పక్షిని ఏమని సంబోధింతురు? ఉ 8 క!=బ్రహ్మ!
9. ఈశ!=ఈశ్వరా! 10వే!=ఓ పక్షి! (వే='వి 'శబ్ద-సం.ప్ర ఏకవచనము.)
11. పిసినిగొట్టు ఏమని చెప్పును? ఉ.న=లేదు, కాదు-అని చెప్పును.
12. కురువంశ నాశనము ఎవనిచే జరిగెను? ఉ కేశవేన=కృష్ణునిచే.

ని. 1, 2, 3 ప్రశ్నలకు క్రమంగా, కే-శవే-న' అనియు, 4, 5 ప్రశ్నలకు విలోమంగా 'నవే-శకే' అనియు, 6నుండి 12వ ప్రశ్నవరకు 'కేశవేన' అను దానిని ఆవృత్తంచేసి, ఛేదింపగా వచ్చిన 6కేశవ 4! 7ఇన! 8క!+9ఈశ!+10 వే!-11 'న'తోను 12 కేశవేన అనుదానితోను సమాధానములు సరిపడుచున్నవి.

ఇట్లు 'కేశవేన' అను ప్రత్యుత్తరమును, అనులోమంగా, విలోమంగా, ఆవృత్తించేసి, పదచ్ఛేదంచేసి, సమానంగా చెప్పినను, వీనిలో 'చ్యుత-దత్త' ములను చేర్చుట కవకాశమున్నను, ఇవి 'చ్యుత-దత్త' చిత్రములకు ఉదాహరణములు మాత్రము కాజాలవని గమనింపవలెను. ఏలన 'చ్యుత-దత్త' చిత్రములలో, వాని వలన అన్యార్థ ప్రతీతియు కలుగవలెనుగదా! అది ఇచ్చటలేదు మరియు 'కేశవేన' అను ప్రత్యుత్తరం శ్లోకంలో నుండుటచే, ఇదొక 'అ_స్తరాలాపము! మాత్రమే.

శ్లో. కిం స్యా ద్వర్ణచతుష్టయేన వనజం? వర్ణై స్త్రిభి ర్భూషణం,
స్యా దాద్యేన మహీ, త్రయేణ తు ఫలం, మధ్యం ద్వయం ప్రాణిన॥
వ్యస్తే గోత్ర తురంగ ఘాస కుసుమా వ్య స్తే చ సంప్రేషణమ్
యే జాన న్తి విచక్షణాః క్షితితలే తేషా మహం సేవకః॥

N. B. శ్లోకంలో 10 ప్రశ్నలున్నవి. వానికి ప్రత్యుత్తరంగా, నాలుగక్షరాల పదాన్ని, కనిపెట్టి, వాని పదచ్ఛే దాదులతో ప్రత్యుత్తరములు చెప్పవలెను. అట్టి కష్టకార్యము నెవరుచేసి,చెప్పినను, వారికి నేను 'కట్టుబానిస'(=సేవకుడు)నగుదునని కవి ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

1. ఇచ్చట, నాల్గక్షరాల ప్రత్యుత్తరపదం నీటబుట్టిన కువలయం (కలువ) అనునది. 2. మూడక్షరాలతో 'వలయం' (=కడియము) 3. మొదటి అక్షరమగు 'కు' భూమిని తెల్పును 4. మూడక్షరాలపదం 'కువల' రేగు పండును తెల్పును. 5. మధ్యనున్న రెండక్షరాలు 'వ(బ)ల'= ప్రాణములను కాపాడు బల, అతిబల అను విద్యలలో నొకదానిని తెల్పును 6. (విడదీసి చెప్పిన) గోత్ర 7 తురంగ (గుఱ్ఱము) 8 ఘాస (గడ్డి) 9. కుసుమము (పువ్వు)లను తెల్పును. వ్యస్తం చేసిన 10. సంప్రేషణమును తెల్పును

N. B. పద్యప్రత్యుత్తరంలో అన్వయక్రమంగాని, అన్వార్థప్రతీతి గాని లేనందున, ఇవి 'చ్యుత-దత్త' చిత్రోదాహరణములు కాజాలవని చెప్పుటకే, ఉదా. గా, వీయబడినవి.

శ్లో:- సూర్యస్య కా తిమిరకుంజర వృంద సింహీ?
సత్యస్య కా సుకృతవారిధి చంద్రరేఖా?
పార్థస్య-కీదృ గరి దావహుతాశనోఽభూత్?
కా మాలతీ కుసుమదామ హరస్యమూర్ధ్ని? క. క.
ప్రత్యుత్తరము : భాగీరథీ=భా-గీః-రథీ, భాగీరథీ.

ప్ర. 1. చీకట్లనెడి ఏనుగులను చీల్చుటకు సింహివలెనుండు, సూర్యసంబంధ మైనదేది? ఉ భా(=కాంతి), సివంగి గజఘటను చీల్చునట్లు, సూర్యకాంతి (భా) చీకట్లను నాశనము చేయును. ఇక్కడ, 'తిమిరాణి ఏవకుంజరాః'-అని తిమిరము (చీకటి)న 'కుంజరత్వ" ఆరోపము, సూర్యుని 'భా'పై, 'సింహీత్వ' ఆరోపమునకు కారణమగుచున్నది. కనుక ఇది రూపకసమాసము. రూపకాలంకారసుహూత, ఇష్లే,

మిగిలిన ఉదా: లందును గమనింపవలెను (ఉపమేయముపై ఉపమానత్వ-ఆరోప మున్నచో, దానిని రూపకాలంకారము (Metaphor) అందురు. సత్యమునకు సం బంధించినది 2. పుణ్యమను సముద్రమునకు చంద్రరేఖవంటిది ఏది? ఉ గీ: (=సత్య వాణి) ఇది పుణ్య సముద్రమునకు చంద్రరేఖ. చంద్రోదయంతో సముద్రము పొంగి నట్లు, సత్యవాణితో పుణ్యము పెరుగును 3. ఎట్టి అర్జునుడు శత్రువనములకు అగ్ని (వంటివాడు)? ఉ. రథి(=రథమునెక్కిన అర్జునుడు) శత్రువనములకు దావాగ్నివంటి వాడు. 4. శివుని శిరస్సున మాలతీ (జాజి) పుష్పమాలవలె ప్రకాశించుచున్నది ఏది? ఉ. భాగీరథీ (=గంగాదేవి). ఇక్కడ ప్రత్యుత్తరమైన 'భాగీరథీ' అనునది, ఒక సారి వ్యస్తము = 'భా-గీ-రథీ' గాను, వేరొకసారి 'భాగీరథీ' అని సమస్తజాతికి చెందినదిగాను, పైకి కన్పడుచున్నను కవి హృదయము, భావము,మాత్రము అలంకా రము' మీదనే ఉండుట వలన, ఇది 'సాలంకార జాతి'కి మాత్రమే ఉదాహరణమగు చున్నది. కాని, ఒక్కొక్క అక్షరముపెరుగుచు, ప్రత్యుత్తరమగుటవలన 'వర్ధమానా క్షరము' కాజాలదు అట్లే దత్త చిత్రము కూడా కాజాలదు. టత్తము చేసినపుడు విశేషణ సామ్యముతో అర్థాంతరము కూడ ప్రతీయమానము కాలేను గదా? అను రహస్యమును ఈ సందర్భమున మరువరాదు.

1. అద్యక్షరచ్యుతితోను, 2. అట్లే, దొంక తిరుగుడుగా చ్యుతం చేసిన అక్షర చ్యుతితోను, అన్యార్థములు ప్రతీయమానములైన, ఈ చివరి రెండు శ్లోకము లను కూడ, ఒకసారి పరిశీలించి, విశ్రాంతి గైకొనుడు.

శ్లో. గవీశ పత్రః నగజార్తిహారీ
కుమారతాతః శశిఖండమౌళిః ।
లంకేశ సంపూజిత పాదపద్మః
పాయా దనాదిః పరమేశ్వరో వః ॥

ప్రత్యేకముగా 'చ్యుతి'ని ప్రకటింపక, పద్యాంతమున 'అనాదిః పరమేశ్వరః' అని, పరమేశ్వరుని అద్యక్షర రహితునిగా చేయుడని సూచింపబడినది. అట్లు ఆ 'పరమేశ్వరః', అద్యక్షర రహితుడైనచో, 'రమేశ్వరః'గా మిగులగలడు. అప్పుడు 'అచ్యుత-చ్యుతాక్షరములగు ఉమేశ-రమేశ-సంబద్ధ-అర్థములు విశేషణ సాధర్మ్యముతో ఇట్లుండును. అచ్యుత 'పరమేశ్వరపక్ష-అర్థము.

1. గవీశపత్రః=గోవులకు ప్రభువు రేక వృషభరాజగు 'నంది'వాహనముగా గలవాడును, నగ-జా+అర్తిహారీ=హిమవత్పర్వత-పుత్రియగు 'పార్వతి' యొక్క-

బాధను పోగొట్టినవాడును, కుమారతాతః=కుమారస్వామికి తండ్రియు, శశికంత-మౌళిః=చంద్రకళను శిరస్సున ధరించినవాడును, లంకేశ-సంపూజిత-పాదపద్మః=లంకాధిపతియగు రావణునిచే-పూజింపబడిన - చరణార విందములు గలవాడును, అనాదిః=మొదలు లేక పుట్టుక (ఆది) లేనివాడును, లేక అలక్ష్య జన్మకలవాడును— అగు, పరమ+ఈశ్వరః=పరమ ప్రభువగు శివుడు, పాయాత్=(మిమ్ములను, మమ్ములనుగూడ) రక్షించునుగాక !

2. ఇక రమేశ (విష్ణు)పక్షమున అర్థము. శ్లోకములోని ఆరు విశేషణము లను 'అనాదు'లను అనగా-ఆది-లో మన్న అక్షరాలను తీసివేసినచో 1. (గ)వీశ-పత్రః=(విః=పక్షి, వి+ఈశ=వీశ=)పక్షులకు ప్రభువైన గరుత్మంతుడు-వాహన ముగా గలవాడును' 2. (న) గజ+అర్తి-హారీ=గజేంద్రుని-పీడను- పోగొట్టినవా డును, 3. (కు)మార-తాతః=మన్మథునికి (మార) తండ్రియైనవాడును, 4. (శ) శిఖండమౌళిః=నెమలిపింఛమును-శిరస్సున ధరించినవాడును, 5 (లం)కేశ(క+ఈశ) సంపూజిత-పాదపద్మః=బ్రహ్మ, ఈశ్వరులచే-బాగుగా పూజింపబడిన-చరణ కమల ములు కలవాడును, అనాదిః=మొదలు తెలియబడనివాడును- అగు, రమా+ఈశ్వ రః=లక్ష్మీ-పతియగు విష్ణుమూర్తి. మిమ్ములను, పాయాత్=రక్షించునుగాక !.

అద్యక్షర-చ్యుతి లేకను, చ్యుతితోను, శివ-కేశవులకు సంబంధించిన రెండ ర్థములు వచ్చినవి గనుక, 'అక్షర-చ్యుతక'మగుచున్నది.

శ్లో. య ద్వైపరీత్యాత్ పదయోః-అంతరేఽస్తి సబిందుకమ్।
త దస్తి త్వ ద్గృహే రాజన్ ! తదర్థ మహ మాగతః॥ చాఃచ

రాజుతో నొక పండితు డిట్లు తన కోర్కెను వాచ్యంగాగాక, గూఢంగా తెలుపుచున్నాడు. రాజన్!, 'పదయోః=పదములయొక్క' అని అర్థం చెప్పతుండా, దానిలో గూఢంగానున్న 'ప' వర్గం (ప-ఫ-బ-భ-మ) మొదటనున్న 'ప'కారానికి, (తవర్గ=త-థ-ద-ధ-న-మధ్యనున్న) 'ద' కారమునకు ('ప-ద'లకు) అనగా-ఈ రెంటియొక్క, వైపరీత్యాత్=త్రిప్పి చెప్పటవలన, అనగా—'ప—ద'లను త్రిప్పి, చది విన,'ద-ప'లు వచ్చునవి తావం. అన్తరే = ఈ 'ద—ప'ల రెండింటి అనగా 'ద-'ధ-న'-ప'ల మధ్యలో, యత్=ఏ 'ధ-న'శబ్దము, సబిందుకం-అస్తి=అనుస్వా రంతో (ం)గూడి 'ధనం' రూపములో ఏది ఉన్నదో, తత్-త్వత్-గృహే-అస్తి= అది (అధనం)-నీ యింటిలో-ఉన్నది, తత్-అర్థం-అహం-ఆగతః=ఆ ధనము కొరకై—నేను వచ్చినాను [సుమా!]

కేవలం 'ధనం'కోసం వచ్చినానని వాచ్యంగా చెప్పితే, సటిపోగా, దానినిదొంక తిరుగుడుగా, కొన్ని అక్షరాలను 'చ్యుతి' చేసి చెప్పుట పండిత సంప్రదాయాలలో నొకటి.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి 'ద-వ' మధ్య కాంక్షనై, ప్రయోగం దీనికి సదృశంగా కన్పడుతుంది. [చూ. తెలుగు విభాగంలో]

N. B ఇప్పటికే, పాఠక ప్రభువుల ప్రతిభా పాటవాలను, ఈ 'చ్యుత-దత్త విశేషాల'తో, విశేషాన్తరాలతో, పలిపరి విధాల పరీక్షించి, తన్మనః ప్రశాన్తతకు భంగం కల్పించినాము.

అయితే, సంకలనం చేసినవి శతాధికాలుగానున్నను, వానిని విడిచి, వేనికి వానికి ప్రత్యేకతను, ప్రన్న [చక్క] దనమును, ప్రపంచించుకొన్నవానిని మాత్రమే, పాఠక ప్రభువులను ప్రత్యుత్పన్నమతులనుచేసి, వారి ప్రజ్ఞను ప్రద్యోతింపగలవానిని మాత్రమే, ప్రతిపాదింప ప్రయత్నించినామని మనవి.

ఇక కొంత విశ్రాన్తి తీసికొని; మా రాబోవు అన్యచిత్రాలంకార విశేష విజ్ఞానసుధను గ్రోలుటకు ప్రతీక్షింప సవినయముగ ప్రార్థితులు.

# తెలుగులో చ్యుతదత్త చిత్రములు

ఈ 'చ్యుతదత్త చిత్రము' సంస్కృత భాషలో చక్కగా, చిక్కగా, పొంకంతో పొంగులువారి, పొలుపు మీరి రూపొందిన ఒక విశిష్ట చిత్రరచనా ప్రక్రియ. అయితే, సంస్కృతేతర భాషలందు, అట్టి సౌలభ్యము లేకపోవుట వలన గాబోలు, ఈ చిత్రము అంతగా, తమతమనామాలతో ఆయా భాషలలో అభివృద్ధి చెందలేదు. కావలసినన్ని ఉదాహరణములు కూడ మృగ్యములగుటచే, కొన్ని చోట్ల సంస్కృతో దాహరణములు కూడ చూప వలసి వచ్చుచున్నది. బాణువినాటికే భాషిత భూషితాలై భవ్యంగా భాసిల్లిన, ఈ చిత్రాలం కారాలను ఇతర భాషలలో ప్రత్యేకంగా ప్రాజ్యంగా ప్రయత్నించి, ప్రకటింపవలసి రావటం, పరిశోధక ప్రాచార్య ప్రాచీన బర్లులకే (ప్రాధ్యాపక పురందరులకే) ప్రత్యాసన్నమౌతుందనుట విశ్చయము. అందరికి అందుబాటులో నుండునది, సాధ్యమగునది కాదు

1. పద్యంలో ఒక మాత్ర, లేక బిందువు, అక్షరము ..మొ. వానిని చ్యుతం చేయుట (తొలగించుట, మార్చుట) వలన, శ్లేషాది సందర్భ ముల సాహాయ్యంతో, అన్యార్థం కూడ అడ్డులేక, ప్రతీయమానమైనచో, ఆయా మాత్రా, బిందు, అక్షర....చ్యుతక-అది నామములతో పేర్కొనబడునవి, 'ధర్మ-

దాసనూరి' మొదలగువారు వివరించిరి. అనగా-పద్యంలో 'మాత్ర' చ్యుతమై, అన్యార్థము ప్రతీయమానమైనచో, అది 'మాత్రాచ్యుతకము' అట్లే. బిందువుగాని, అక్షరముగాని చ్యుతమై, అన్యార్థము కూడ వచ్చిన, అవి 'బిందుచ్యుతక-అక్షరచ్యుతకము' లగుచున్నవని భావము. ఇట్లే, ఇతరములును.

## దత్త చిత్రాలంకారము

2. పద్యంలోని అక్షరాలను చ్యుతం చేసినట్లే, ఆయా అక్షరాదులను దత్తం (దానం, ఉంచుట, చేర్చుట....) చేయుట వలన 'దత్తచిత్రము' లేర్పడు చున్నవి.

## చ్యుతదత్తాక్షరచిత్రము

3. ఒక పద్యంలోని ఒక అక్షరమును చ్యుతంచేసి, దానిస్థానమున, మరియొక అక్షరాన్ని 'దత్తం' చేయుట వలన, అన్యార్థము ప్రతీయమానమైనచో, అది "చ్యుత-దత్తాక్షరచిత్ర మగుచున్నది అనగా-పద్యంలోని అక్షరాదులను, "చ్యుతం లేక దత్తం" చేయక ముందున్న అర్థముకంటె, "చ్యుతం-దత్తం" చేసిన పిదప వచ్చు అన్యార్థము, చమత్కృతమై, ఆనందకారణము కావలెననుట దీనిలోని పిండితార్థము. కొందరు సంస్కృతాలంకారికులీ చిత్రములను, పరిపరివిధాల పరామర్శించి విశ్లేషించి, వివరించిన విషయము వింతకు ముందే "సంస్కృత భాగము"న తెలిపికొనియున్నాము. ఉక్తివైచిత్ర్య రూపములు, క్రీడామాత్రోప-యుక్తములునైన, ఆయా చిత్ర విశేషములు, తెలుగునందేకాక, ఇతర భాష లందును,కొన్ని మాత్రమే కన్పడుచున్నవి. మిగిలినవి మృగ్యములు

## మాత్రాచ్యుతకము

పద్యంలోని "మాత్ర" చ్యుతం కానపుడున్న అర్థంకంటె, చ్యుతమైన పిదప, అన్యార్థ ప్రతీతి, ఈ "మాత్రాచ్యుతక ' మందలి విశేషము. ప్రకాశంజిల్లాలో, కలికివాయి నివాసులగు శ్రీ విక్రాలశేషాచార్యులు (20శ) గారీ చిత్రాలంకారరచనలో సిద్ధహస్తులైన ఆధునికులు. వారు ఇటీవలనే చరిత్రశేషులైనారు. వారు రచించిన "శ్రీ వేఙ్కటేశ్వర చిత్రరత్నాకరము' మూడుభాగములందును, వీనిని విశ్లేషించి, వివరముగా వాడి, ఉదాహరించినారు

ఉదా:- తే. గీ. ఆదరమునుంచు మాయెడ నంబుజాక్ష
కాదనము పీ వలన నెపు డేది ...
నిత్య మంతఃకరణమున ని...
పచ్యుతా! చేయు మరుల క... చ్యుత... ఉ. చ.



కమలాక్ష! మమ్మిల ననుగ్రహింపుము. నీవలన. ఏ సమయంలో, ఎక్కడ, ఏ లాటి నష్టములు జరిగినను, కాదు, వద్దు అవి అడ్డుచెప్పజాలము-సుమా!"- అని పద్య- ద్వితీయ చరణార్థము. ఈ "కాదనము"లోని "కా" (క్+అ) నుండి, 'అ" కారమాత్రము చ్యుతం (లుప్తం) చేసినచో "కదనము" మిగులుతోంది.

ఉచ్చారణ సౌకర్యార్థం ప్రతి హల్మాత్రమునకు "అ' కారముచేర్చి, పలుకుట, వ్రాయుట "సంప్రదాయ"మని పూర్వము చెప్పబడినది.

ఇప్పుడు 'కదనము' [=యుద్ధము]న ....శత్రువులకు హానికల్గింపుమను అన్వార్థము కూడ సంగతమగుచున్నది. పద్యంలోని "ద్విమాత్రక"మైన "అ" చ్యుతం కావటంవలన, ఇది "మాత్రాచ్యుతకము".

N. B ఈ పద్యమున మాత్రాచ్యుతకమే గాక, 1,3 పాదాలలో, క్రమంగా విసర్గ, వర్ణ చ్యుతకములును గలవు. అవి ఆయా సందర్భములలో వివరింపబడును.

2. "నాగరాజో జయత్యేకః [=నాగులకు రాజగు ఆదిశేషుడు సర్వో-త్కృష్టుడై యున్నాడు] అనునది సంస్కృతోదాహరణము. ఇక్కడ, "నా" లోని దీర్ఘ మాత్ర "అ'ను చ్యుతం చేసిన, "నగరాజః" కాగా, నగములకు [పర్వతములకు] రాజగు హిమవంతుడు–విజయుడగుచున్నాడు—అను ద్వితీయార్థము కూడ రాగలదు. 3 రామానుజుడు=రామునికి తమ్ముడు [భరత, లక్ష్మణ, శత్రుఘ్నులలో నొకడు] దీనిలోని "రా" నుండి దీర్ఘ మాత్రను తొలగించిన "రమానుజుడు" [రమ(లక్ష్మి)] యొక్క తమ్ముడు]గా మిగిలి, "చంద్రుడు" అను అన్వార్థము వచ్చుచున్నది ద్విమాత్రికమైన 'అ" చ్యుత మగుటచే, ఇదియు 'మాత్రాచ్యుతకం" కావలెను.

## బిన్దుచ్యుతకము

సంస్కృతమున 'బిన్దువు" అనగా 'పూర్ణబిందువు" [o] మాత్రమే. కాని; తెలుగున, అర్ధ రేక ఖండబిందువు అనుపేరుతో, అరసున్న [ఁ] కూడ ప్రసిద్ధి నొంది యున్నది ఈ బిందువును చ్యుతం చేయుటవలన, అన్వార్థము ప్రతీయమానమైనచో "బిందుచ్యుతక" మగును

ఉదాహరణ: గీ: బహు విధాంధః కృతోల్లాస భరుఁడ వీవు
సంగతశ్రీవి నీవ్వయో పరసిజాక్ష!
అహితులకు నెంత్వరే ప్రతియాతనదవు
అన్నిటని తేయు మరులకు "సున్న" చ్యుతుల " వి. వేం. 1–15

పద్యంలోని, 1 "అంధఃకృతోల్లాస.... 2. సంగతశ్రీవి.... 3. సంజ్వర ప్రతి....అను మూడు సమానపదాలమధ్య యందును, మూడు పూర్ణబిందువులున్నవి. ఆ బిందువులను తొలగించిన, పరుసగా, "1. అధఃకృత.... 2. సగతశ్రీవి.... 3. సజ్వరప్రతి...." కాగా, అప్పుడు సామాన్య-అన్య- అర్థము లెట్లుండునవిన—

1. i. అంధఃకృత.... = చక్కెర మొదలగు పిండివంటలచే చేయబడిన [సామన్యార్థం]

   ii. అధఃకృత.... = శత్రువులను క్రిందుగా, తక్కువగా చేయబడిన [అన్యార్థము]

2. i. సంగతశ్రీవి.... = చేరిన లేక కలిసివచ్చిన, సంపదలు కలవాడవు [సామాన్యార్థం]

   ii. సగతశ్రీవి....పోయిన సంపదలు [సంపదలులేవి] వాడవు....[అన్యార్థం]

3. i. సంజ్వరప్రతి....మిక్కిలి వేడిచే పాటిగాగలవాడవు [సామాన్యార్థము]

   ii. సజ్వరప్రతి.... = జ్వరము లేక తీవ్రబాధలను గూర్చువాడవు.... [అర్థాంతరం]

విశ్రాలవారి పద్యంలో ఒక్కటేగాదు, మూడుబిందు చ్యుతకాల నొక్కసారిగా, చూపి, పాండిత్య సౌందీర్యమును ప్రకటించుకొనుట విశేష విస్మయావహము.

ఉదా : 2 కాంత యశ్రు బిందు చ్యుతి కైతవమున
దివిరి "బిందుచ్యుతక" కేళి దవిలె దీవు
సారెసారెకు వాడు "సంసారము"ను న
సారము"గ జేయుచు మసారసార నయువ!" శృం. నై. 4—90.

అశ్రుబిందుచ్యుతి కైతవమున=కన్నీటిబొట్లను విడుచుట-అను నెపముతో, "సంసార" శబ్దంమంది "బిందువు [౦]ను చ్యుతం చేసి, "నసారము" = సారము లేక బలముతోగూడిన దానిదిగా జేసితివి-అని నలుడు దమయంతితో ననెను.

శ్రీ నాథుడీ పద్యమున 'బిందు చ్యుతక' కేళిన్-అని,శ్లేషతో, 'సంసార' శబ్దమందలి పూర్ణబిందువు (౦)ను చ్యుతం చేసి, చూపి, అట్లు చ్యుతి - నొందిన పిదప, ఆశబ్దరూపము 'నసారము'గ నుండునని చమత్కరించి, అన్యార్థమునుకూడ సమన్వయించి, తన 'కవిసార్వభౌమత'ను సార్థకం చేసికొనెను. ఉదా: 3 అర్ధ (ఖండ) బిందువు (ఁ)కు తెలుగుభాషలో నొక ప్రత్యేకత కలదు. అరసున్నతో కూడియున్న శబ్దమునకు, అదిచ్యుతం చేయబడిన పదమునకు, తెలుగునసెంతో అర్థభేదము'ండుటకూడ గమనింపగలము.

ఉదా: వీఁడు=ఇతడు,ఈ మనుష్యుడు, వీడు=పట్టణము, శిబిరము....వదలు
పాఁడి=పాలు, ఆలమంద          పాడి=ధర్మము, తగవు....
ఏఁడు=ఎవడు, ఏ పురుషుడు, సంవత్సరము, ఏడు=ఆరునొకటి 7 సంఖ్య.
ఆఁడు=స్త్రీ జాతి, మతుబర్థకము....ఆడు=పలుకు, పాడు,కదలు క్రీడించు..
కాఁపు=కర్షకుడు, శూద్రుడు, సంసారి.       కాపు=కాయలు కాచుట, రక్షణ
పాఁఱుడు=బ్రాహ్మణుడు          పారుడు=పరుగెత్తుట, ప్రవాహము.

## వ్యంజన చ్యుతకము.

హల్మాత్రము చ్యుతమై, అర్థాంతరావిష్కరణము జరిగిన "వ్యంజన చ్యుతకము."

ఉదా. 1. కాంతః సర్వజనాభీష్టో 'బాలేస్దుఃఖే న లభ్యతే" ప్రియమైన వాడు (కాంతః), సర్వప్రజలచే, సదాకోరబడు వాడునైన, బాలచంద్రుడు (బాల+ఇన్దుః) ఆకాశమున (ఖే) లభించుటలేదు-అని సామాన్యార్థము.

ఇక్కడ, 'బాలేన్దుః'–'న్దుః' (-న్-ద్-ఉ-ః)లోని, మొదటి 'న్' హల్మాత్ర మును తొలగించి, మిగిలినవానిని తరువాతి అక్షరాలతో కలిపిన, బాలే! దుఃఖేన లభ్యతే'=బాలా! సర్వజనా భీష్టుడగు మగడు (కాంతః) ఎంతో దుఃఖముతోగాని దొరకడు-అను అన్యార్థం కూడా సరిపడుచున్నది, 'అర్థమాత్ర-హల్మాత్రమునైన 'న' కారము (న్) లుప్తమగుటచే, ఇది 'వ్యంజన చ్యుతకము' దీనినే 'అర్థమాత్రా చ్యుతక'మనియునందురు "వ్యంజనం త్వర్థమాత్రకమ్"అని, ముందు చెప్పబడినది గదా! ∴ ఇది బిందుచ్యుకము" కూడ కావచ్చు.

2. "తల్పమందున జేరగా తలపు లడుగు....' గా, ధ.

ఇక్కడి 'ల్ప' (=ల్-ప్-అ)లోని 'ల్' నులుప్తం చేసిన,'తపమందున....' మిగిలి, అన్యార్థము కూడా అందముగకన్పడును కనుక 'అర్థమాత్రాచ్యుతకమగును.

N B. తెలుగుభాషలో, 'పొందు' బదులుగా 'ఒందు', అల్లే, పిలుగు-ఈలుగు, పొప్పు-ఎప్పు ...మొదలగు కొన్నిచోట్ల, వ్యంజనము చ్యుతి చెందినట్లు కన్పడినను, అర్థభంగము మాత్రము కలుగకుండుట విశేషము. చ్యుతకములలో అన్యార్థ ప్రతీతి ముఖ్యవిశేషమనుట కాదనరానిది. ∴ వీనిలో అన్యార్థము లేనందున్న 'వ్యంజన చ్యుతి'కివి ఉదాహరణములు కాజాలవు.

## విసర్గ చ్యుతకము

తెలుగులో విసర్గ చ్యుతకము క్వాచిత్కము. ముందు చూపిన మాత్రాచ్యుత-కోదాహరణ పద్యమునందలి తృతీయపాదమగు—

"విత్యమంతఃకరణమున నిలిచియుండు....అనునది దీనికి ఉదాహరణమగును.

"అంతఃకరణ' శబ్దమునుండి 'విసర్గ' (ః)ను చ్యుతం చేసిన, 'అంతక-రణ మున' మిగులును. అంతఃకరణమున='మనస్సులో' అని మొదట సామాన్యార్థము రాగా, అంత-కరణమున=అంతము-చేయుట- యందు, లేక, 'అంతక-రణమున= యమునితో చేయు యుద్ధమున, లేక పరిహద్దు తగాదాలో-అనికూడ, అన్యార్థమును చెప్పుకొని, సమన్వయించుకొనవచ్చును ఇక్కడ విసర్గచ్యుతమగుటచేనిది 'విసర్గ చ్యుతకము'

N B. మొత్తంమీద విక్రాలవారు 'అదరమునుంచు మాయెదల... పద్యంలో 'వర్ణ—మాత్రా-విసర్గ-చ్యుతకత్రయము'ను ప్రదర్శించి, పండితమండితులైనారు.

## అక్షర చ్యుతకము

ఒకటి లేక పలువర్ణములను చ్యుతమొనర్చినపుడు, అర్థాంతరాగమనముకే 'అక్షర చ్యుతక' పేర్పడును ఆంధ్రలాక్షణికుడగు అప్పకవి 'అక్షరలోపము' నొక్కదానినే, లక్షణ, లక్ష్య సహితముగ నుదాహరించినాడు.

ఉదా: రవి కన్యా సుందర కర
మవలంబన మోర్చి యూదె నచ్యుతుడ వి యే
నవ వర్ణ విలోపముగా
నవవిం బఠియింపవలయు నార్యులు మెచ్చన్। అ. క. 4-557

అప్పకవి, ఈ పద్యం ఉత్తరార్ధంలో లక్షణం చెప్పినట్లు 'రవికన్యా సుందర కర.... ...లోని నవ (నినవ) వర్ణమగు 'సుం'ను చ్యుతం చేసిన, 'రవి కన్యాదర కర.... ...' మిగులును. అప్పుడు 'రవికన్యా!' సంబోధనకాగా, దర (=శంఖ మును) కర మవలంబన మోర్చి, అచ్యుతుడూదెను-అను అన్యార్థము కూడ సరి పడును.

N B అవధాన సమయమున 'నిషేధాక్షరి' పృచ్ఛకుడు, ఫలానా అక్షరాన్ని మాత్రమే 'చ్యుతం' చేసి, చెప్పుమనును. కాని, ఇక్కడ, ఫలానా అక్షరాన్ని మాత్రమే 'చ్యుతం' చేయవలెనను నియమం మాత్రంలేదు. ఏ వర్ణమునైనను చ్యుతం చేయ వచ్చును.

"ఆదరమునుంచు మాయెడ నంబుజాక్ష!...." వి. వే. 1-16

ఇక్కడ, "ఆదరము" అను పదములోని, ఆద్యక్షరమగు "ఆ" వర్ణమును "చ్యుతం" చేసిన "దరము" మిగులును. అప్పుడు, "మా పై నున్న (ఆదరము) చూపుము' అను సామాన్యార్థమును, శత్రువర్గము మీద భయము (దరము) నుంచు మను అన్యార్థము కూడ సరిపడుచున్నందున, అక్షరచ్యుతకము

స్వర్గీయ, పోకూరి కాశీ పత్యవధాని (20 శ) గారు చిత్రాలంకార చిత్రణలో గూడ సిద్ధహస్తులు వారు తమ త్ర్యర్థికావ్యమగు "సారంగధరీయం"లోని క్రింది పద్యంయొక్క, మొదటి పాదము నందలి ఒక్కొక్క అక్షరమును చ్యుతం చేసి, నానార్థ సమన్వయం చేసి, చూపిన చిత్ర కవీంద్రులు

కు ధ ర స మా కృ తి లా భ
మ్మధికముగా గొనె కుచద్వయం, బొంపొం దా
కుధ ముఖ లిపులు సలిన, గ
ట్య ధర దృగం గో క్తి నాసికా స్య నఖములా॥ పో.కా.సా. 2-41

మొదటి పాదమగు"కు ధ ర స మా కృ తి లా భ ము'లోనున్న,ఒక్కొక్క అక్షరాన్ని, క్రమంగా చ్యుతం చేసి, సమన్వయిస్తే, కటి, అధర, దృక్, అంగ, ఉక్తి, నాసిక, ఆస్య, నఖము—లను వానికి సరిపోగలవని ముఖ్య భావము.

ఈ సమాసమును విడదీయకుండ, మొత్తముగా చెప్పుకొన్నచో, ఈ"కుధర-సమ+ఆకృతి-లాభము=(కు-ధర=భూమిని ధరించిన) పర్వత-సమానమైన-ఆకార ప్రాప్తిని (లాభమును) అధికముగా పొందినది 'కుచద్వయము" (=చన్నులజంట) అగుచున్నది కుచములను పర్వతములతో పోల్చుట కవి సంప్రదాయము. (పర్వ తత్తని,చనుగట్లు,కుచాద్రులు....)ఇక, ఈ"కుధర...."సమాసంలోని,"కు-ధ-ర...." మొదలగు ఒక్కొక్క అక్షరమును క్రమంగా తొలగించి, సమన్వయించిన, "కట్య రాధరు"లతో సరిపోలగలవని తాత్పర్యము. ఎట్లనగా –

1. మొదట, ఈ "కుధర ..." సమాసాన్ని విడదీయకుండ, "కుధర సమా కృతి లాభా"న్ని "కుచములు" పొందినవని చూపబడినది.

ఇప్పుడు ఆ సమాసము నుండి; ఒక్కొక్క అక్షరమును యథాక్రమంగా, చ్యుతం చేస్తూ పోల్చుకొనవలెను.

2. ఈ సమాసం నుండి "కు"ను "చ్యుతం" చేయగా, "ధర-సమ+ఆకృతి లాభము (మిగులగా)=భూమితో-సమానమైన-ఆకార లాభాన్ని పొందినది - "కటి"

[=పిరుదు], 3 "కు-ధ" రెండూ లుప్తం చేయగా, రస-మా+ఆకృతి లాభము= అమృత-రస-సంపదల వంటి-ఆకారమును పొందినవి "అధరములు' [=పెదవులు]; 4. సమ+ఆకృతి లాభము=హెచ్చు తగ్గులు లేని సామ్య-రూపాన్ని పొందినవి - "దృక్కులు" [=చూపులు]; 5. మా+ఆకృతి లాభము=లక్ష్మి [మా] వంటి - ఆకారమును పొందినది - "అంగము' [=శరీరము]; 6. కృతి లాభము=కావ్య లేక చమత్కృతి రూపాన్ని పొందినవి - "ఉక్తులు [=మాటలు]; 7. తిం + అభము=నువ్వు పువ్వు - కాంతిని పొందినది - నాసిక [=ముక్కు]; 8 ం+ అభము=చంద్రుని వంటి - కాంతిని పొందినది "ముఖము", 9 భము=నక్షత్రాతి శయ-మును పొందినవి - "నఖములు" [=గోళ్ళు]

మొత్తం మీద 1. కుధరసమాకృతి లాభమును, ముందు కుచములు పొందగా పిమ్మట, దానిలోని ఒక్కొక్క అక్షరాన్ని క్రమంగా, పలుమారులు "చ్యుతం" చేయగా, వానిపోలికలతో పోటీపడి, ఆయాలాభములను పొందినవి-2. పిరుదు (పిఱ్ఱ) లు 3. పెదవులు 4 చూపులు 5 శరీరము 6 ఉక్తులు 7. ముక్కు 8. మొగము 9. నఖములు-అవి యథాక్రమముగా నెరుగవలెను. ఈ పోలికలన్నియు కవిసమయ ప్రసిద్ధములు. ఒక్క సమాసంలో, అనేక-అక్షర చ్యుతులను చూపించిన పోతూరు వారి పోడిమి (గర్వము) పోతరింప (గర్వింప\ దగినది.

N.B I. "ఆంధ్రసలంద" వారి సన్మాన సందర్భమున, శ్రీ కాశీపతిగారు "గుడివాడ" విచ్చేసినపుడీ వివరణ గావించి, పద్యాలను మంత్రముగ్ధులను గావించిరి. 2. ఈ "చ్యుతదత్త చిత్రములు" ఎంతగా చదివి, పరిశీలించి. అన్వేషించినను, ఆయానామములతో, తెలుగులో అంతగా కన్పడకపోవడం వింతగానున్నది. సూచ్యార్థ సూచనగా మాత్రమే కష్టసాధ్య పాషాణపాకంలో కొన్నిచోట్ల, కొన్ని దృగ్గోచరమైనవి. వాని నన్వయింప ప్రయత్నింతుమని మనవి

కొందరు తెలుగుకవు లీ"చ్యుత చిత్రము"ను, "పొడుపుకథల"లో వాద్యముగ పొదిగి, పెంచి, ప్రదర్శించినారు. కొరవి గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' లోని "చ్యుతము"ను పొదిగిన సీసపద్యము.

సీ. రాజేంద్ర! అరక్షరముల పేరిటివాడ
వాద్యక్షరము మాన వశ్వవేది,
రెండక్షరముల బరిత్యజించిన వాట్య-
కర్త మూడు డిగిన గతవిదుండ,

నాలుగురిగింప జాలనేర్పరి, నైదు
విడిచిన బుధుర, ఏ విధము గాక,
సర్వాక్షరంబులు చదివి చూచిన బుద్ధి-
బలముగాగలయట్టి ప్రౌఢుడవగ
నేతిబీరకాయ నీతిగాకుండంగ
విన్నివిధములందు నెన్నబడ్డ
సార్థనాముడైన యర్థిగా నెరుగుము
విబుధ పంకజార్క! విక్రమార్క!

ఆ-అరక్షరాల పదమగు "చతురంగతజ్ఞ" (=మిక్కిలి సమర్థుడు) మంది, క్రమంగా, ఒక్కొక్క అక్షరాన్ని చ్యుతంచేస్తే, పద్యంలోని అయిదు ప్రశ్నలకు సమాధానం సరిపోతుంది.

1వ ప్రశ్న : ఆద్యక్షర "చ" కారచ్యుతితో "తురంగతజ్ఞ"మిగులగా, అశ్వ శాస్త్రము నెరిగినవాడు" అనుసమాధానం సరిపోతుంది. 2. రెండక్షరాల చ్యుతితో "రంగతజ్ఞ" మిగిలి, "నాటకరంగము నెరిగినవాడు" ప్రత్యుత్తరం. 3. మూడు వర్ణాలులుప్తంకాగా, "గతజ్ఞ (= 'గడచినదాని నెరిగినవాడు") ప్రత్యుత్తరం. 4. నాలుగువర్ణాలుజారిపోతే "తద్జ్ఞ" (=దానినెరిగిననేర్పరి) ప్రత్యుత్తరం. 5. అయిదు అక్షరాల లోపంతో 'జ్ఞ'=పండితుడు-అవి, 5వ ప్రశ్నకు ప్రత్యుత్తరం.

ఇట్లే అయి దక్షరాల "ఉమాకుమార!" (=వినాయక!) పదం మంది ఒక్కొక్క అక్షరాన్ని తగ్గిస్తూపోతే, అన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరం లభిస్తుంది. 1. ఉమాకుమార!=వినాయక! 2 మా-కుమార!= లక్ష్మీపుత్రుడ! (బ్రహ్మన్) 3. కుమార!=కుమారస్వామి!-4. మార!=మన్మథ! 5. ర!=అగ్నీ! మరొక ఉదా: పక్షి పర్యాయ పరగు పంచాక్షరముల.

వాని తలదీయ "క్షుద్రదేవత" జనించు!
దాని తలదీయ "తక్కెడ" జానుమీరు
దాని తలదీసి చూడగా దనరు 'నృపతి'"

పద్యానికి ప్రత్యుత్తరం పంచ (5) అక్షరాల "కపోతరాజు". ఇది "పావు రము"లనే పక్షిం ప్రభువును తెల్పుతుంది దానితలదీయ=పైదాని మొదటి అక్షరం "క' ను చ్యుతంచేస్తే "పోతరాజు మిగిలి, క్షుద్ర గ్రామదేవతను తెల్పుతుంది. దాని తల=మొదటివర్ణాన్ని, తగ్గిస్తే "తరాజు" (=తక్కెడ)ను, దాని తలను కూడ నరికితే, "రాజు" (=ప్రభువు) మిగులుతాడన్నమాట.

ఈ క్రింది 'వెలుగోటియాచేంద్రభూపాలు''ని ప్రస్తుతినొకసారి పరిశీలించండి!

సీ. ధరసుధా! రసుధా! సుధా! ధార!

కదళికా దళికా ళికా కారకలితమగుచు

మ వరమా! వరమా! రమా! మా! ను

జలవలీ-లవలీ-వలీ-లీల! లవనిమెరయ

శరతుసా! రతుసా! తుశా! సా! ర!

లవసితా-వసితా-సితా! తా! రపణినమంబు

శరదశా! రదశా! దశా! శాంతి!

భగణితా-గణితా-ణితా! తా! రకాపథంబు

ఖగముఖా! గముఖా! ముఖా! ఖా! గమగుచు

హరిపురా! రిపురా! పురా! రాతి వితియు

భరపథా! రపథా! పథా! థావ్యమగుచు

యశము! శము! ముద మొదవు ''యాచభూపతి కి!

పై పద్యంలో, కవి సమాసాల విరుపులతో, క్రమంగా, ఒక్కొక్క అక్షరాన్ని "చ్యుతం" చేసినాడు. ఉదా: "ధరసుధా! లోని 'ధ" కారాన్ని చ్యుతంచేయ, రసుధా, దీనిలోని "ర' ను చ్యుతంచేయ "సుధా", పిమ్మట "సు' ను తొలగింప "ధా" మిగులుతుంది ఇట్లే ప్రతిపాదమందునుచేసి, చూపించినాడు పై వానికి ప్రస్తుతం అనవసరమైన అర్థాలను విస్తరించి, పేజీలను పెంపి, అంజిడి కల్గించుటకు వెరచి, విరమించినామని వినతి.

## అక్షర చ్యుతక విశిష్టత.

దీనిలో ఒక అక్షరమునేగాక, అనేకవర్ణపదములనుగూడ తొలగింపవచ్చును. అనగా-సమాసంలోని అక్షరాలనేగాక, పదాలను కూడ 'చ్యుతం' చేయుట వలన 'పద చ్యుతకం' కావచ్చునని కొందరు తెల్పిరి. అప్పకవి ఉదాహరించిన 'రవి కన్యా సుం దరకర ...'' పద్యపాదంలోని 'సుం' అనే అక్షరాన్నేకాక, 'సుందర' పదాన్నికూడ చ్యుతం చేసినచో, 'పదచ్యుతక' మై, అన్యార్థప్రకాశానికి అంతరాయం కల్గనీయదు.

## 'చ్యుత-దత్త-చ్యుతదత్తాక్షర చిత్రములు.

ఆంధ్ర కావ్యములం దిట్టివి కావ్యచిత్ర్యములు. మృగ్యములును. ఒకప్పుడు, వ్రాతలో. కూతలో, నేతలో-గాని, ఘుణాక్షర-లేక కాక తాలీయ-న్యాయములవలన గాని, కలుగు భ్రమప్రమాదముల వలన, అక్షరాది 'చ్యుతి-దత్తతలు' జరుగవచ్చును.

అప్పుడు, కొన్నిచోట్ల, యాదృచ్ఛికంగా, అర్థము, అర్థాంతరంకూడ, కాకతాళీయంగా కలిసి, సరిపడవచ్చును. కొండొకచో, పండిత ప్రకాండులు, తమ ప్రజ్ఞాపాటవంతో చమత్కార చర్చలతోపాటు, చెణుకులు విసరి, నరిపెట్టిన సందర్భాలు కూడా లేకపోలేదు.

అలనాడు, ఆదిభట్ల నారాయణదాసు (20౪) గారను హరికథాపితామహుడు, విద్వన్మణి, గజ్జెకట్టి, హరికథను ప్రారంభింపబోవుచు, మీకు 'హరికథ' కావలెనా? 'గిరి'కథ 'కావలెనా' అని, అలవోకగా, శ్రోతలను చమత్కరించారట. సభాస్తారు దొకరు ఠటాలునలేచి 'గిరికథ' కావాలన్నారట. వెంటనే, దాసుగారేమీ తడుముకోకుండా, వసుచరిత్రలోని (కోలాహల) 'గిరి' కథను, 'గిరిక' కథను, మరొకసారి, (హిమ) గిరిజ (పార్వతీ పరిణయం) కథను పద్యః స్ఫూర్తితో, చక్కగా చెప్పి, సభ్యుల నానందడోలికలనూగు లాడించినట్లు పెద్దలు చెప్పగావిన్నాము.

అట్లే, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారొక రాజసభలో 'దపమధ్య కాంక్షినై' వచ్చినట్లు పద్యం చదివినారట! సభలోని కొందరు అర్థంకాక, తలలు బద్దలు కొట్టుకొంటూ 'అమృతాంజనం' కోసం అరాటపడ్డారట! వస్తుతః '(త థ)ద ధ న, ప (ఫ బ భ మ)' ఈ రెండూ 'తపర్గ పవర్గలు. వానిలో, బ్రాకెట్లలో నున్న అక్షరాలను తీసివేస్తే, మధ్యలో 'ద 'ధ, న' ప' అక్షరాలు ('ద....ప'లు) మిగులుతాయి. మరల, వీనిలోని 'ఆది-అన్త' 'ద-ప' అక్షరాలను కూడ 'చ్యుతం' చేస్తే, మధ్యలో మిగిలేది 'ధన' కాగా, నేను 'ధన' కాంక్షినై, మీదగ్గరకు వచ్చినాను' అనే అర్థం దానిలో ఇమిడి ఉన్నదని, సభ్యులు పిదానంగా, తెలుసుకొన్నారట!

శ్రీ చె. శాస్త్రిగారికి సంస్కృతభాగంలోని 'య ద్వైపరీత్యాత్ పదయోః-అధారం కాదగియున్నదైనను, శ్రీశాస్త్రి కొంతమార్పుచేసి ప్రకటించినారు. దీనినిబట్టి, శ్రీశాస్త్రిగారి అనితర-వేద్యము, సాధ్యమునగు శబ్దచిత్ర పరిశ్రమ నూహింపవచ్చును

N B. ఈ 'చ్యుత-దత్తాది చిత్రాలంకారములు" సంస్కృతంలో పూర్వం నుండి అనూచానంగాను, ముఖ్యంగా రుద్రటాచార్యుని కాలం నుండి బాహాటంగా ప్రచారంలో నున్నను, వాగ్భట, హేమచంద్ర, భోజ, ధర్మదాస, అజితసేన, చక్రకవి, విశ్వేశ్వరాదులు విరివిగా, వివరించి, ఉదాహరించి, ప్రదర్శించినను, తెలుగులోని ప్రాచీన కావ్యము లందుగాని, తర్వాతగాని సనామకములుగాగాని, అనామకములుగాగాని, అంతగా కానరాక, మృగ్యములై ఉండుట ఆశ్చర్యకరము. శబ్దార్థాలంకారాలను విరి

విగా, పోటీపడి వాడిన, రామరాజభూషణు, చేమకూర, గణపవరపు వేంకటకవులు మొ వారు కూడ, పైనావి నామములతో ఉదాహరించక, అన్యాపదేశముగ స్ఫురింప జేయుట గమనార్హము. ప్రాచీనులు కొందరు క్వాచిత్కంగా, ఎడనెడ వాడినవి కొన్ని తాళపత్రాలలోను, కొన్ని ముద్రణము పొందినా, అజాగజ లక్షితాలు కావడమో, కాల గర్భంలో కలిసిపోవడమో జరిగి, పునర్ముద్రణ భాగ్యానికి నోచుకోలేదు. మరికొన్ని పండితుల వాక్కులలోనేనావి, నాకలోకం చేరినట్లున్నవి. ఎంతోగాలించి, వెదకి పట్టు కొన్నవి కొన్ని దుర్భేద్యాలు, దురవగాహాలునై, పాషాణపాకానికి పట్టుకొమ్మలై, పదివినక, బాధపెట్టుచున్నవి. అయినను, సాహసించి, కొన్నిటిని ప్రదర్శింప, ప్రయత్నించి, సమన్వయింప బూనినందులకు క్షన్తవ్యులము.

## రామరాజ భూషణకవి 'వసుచరిత్ర'

ఇది, ఒక చమత్కార-చర్చిత నామలూరువు (పట్ట). అతడు ప్రతివర్ణాన్ని, పదాన్నికూడ, అచి, తూచి, వాడి, ఒక అక్షరమ లేక నాట్యకత్తెవలె, విన్యాసంతో నాట్యం చేయించి చూపగల సమర్థుడు 'వసుచరిత్ర'లోని పద్యాలలో, ముఖ్యంగా కొన్ని శబ్దాలలో 'శ్లేష,' అర్థగాంభీర్యం, చిత్రాలంకార సాహిత్య, సంగీతాలు అలముకొని, అలజడి, చేస్తూనే ఉంటాయి.

ఒకచో, వీణవాయిస్తున్న "గిరిక"ను గాంచి వచ్చిన విదూషకుడు, వసురాజుతో చెప్పుచున్న, ఈ పద్యాన్నొకసారి, దయతో, పరిశీలించండి-

ఉ. స్వైర విహార ధీరలగు "సార'స'లోచన"లున్న చోటికిన్
ఘోరున లాతివారు చొర బూనినచో "రస" భంగమంచు నే
జేరక, పువ్వుదీవియల చెంతనె నిల్చి, లతాంగి "రూపు" క
న్నారగ జూచి వచ్చితి నవాంబుజపాంబకా! నీకు దెల్పగన్ ॥ ద. 2 53

అక్కడ ఉన్న నాయిక, ఆమె సఖులను 'స్వైరవిహారధీరలు, మరియు 'సారసలోచనలు' (=కమలాక్షులు) లేక 'సార-సలోచనలు' (=స్థిరాంశ ముసందే కన్నులను ప్రసరింపజేయువారు అట్టి అందగత్తెలు, స్వేచ్ఛగా, జంకు గొంకు లేక విహరించు తావులకు, ఘోరున (శబ్దం చేయక) హఠాత్తుగ, పరజాతి పురుషులు (లాతివారు) లేక గ్రహింపగోరువారు, వచ్చుటచేత, 'రస' భంగము

(రసాభాస) అగును. అనగా 'సా'రస'లోచన'ల మధ్యమున్న 'రస' శబ్దమునకు కూడ భంగము (చ్యుతి) గల్గి, తీసివేయగా, 'సాలోచనలు' మిగులుటచే, వారు దిగ్భ్రమచెంది, రెప్పవాల్చక, నవిమర్శమగు ఆలోచనలలో అణగారిపోవుదురు. కనుక, వారి అమందానంద 'రస'మునకు భంగము కల్గును అట్టియెడ, 'నవసారసలోచనుడ'వగు నీవే తగుదువు. నా రాకవలన, వారి స్వేచ్ఛావిహారానంద రసానికి భంగం కలిగి, దిక్కుతోచని వారుకూడ కాగలరని భావించి, తీగలచాటునుండి, ఆ చెలువచందము చూచి, ఎచ్చితినని, నర్మసచివుడు నర్మగర్భముగా వచించెను.

ఇక్కడ 'రస'పదం చ్యుతమగుటచే, 'పదచ్యుతకము'నకు తార్కాణమగుచున్నది. ఇక 'రూపు'శబ్దం రజస్స్వలానంతరం కన్యమెడలో నలంకరింపబడు ఒక ఆభరణాన్ని భాసింపజేయగా, 'పువ్వుతీవియ'తో పోల్చబడిన 'గిరిక' సర్వాలంకార భూషితగా, భాసమానమౌతుంది. అంతేకాక, స్వైరవిహారధీర- సారసలోచన-సమాసాలలోని, ఒక్కొక్క అక్షరాన్ని, ఒక్కొక్కమారు. క్రమంగా 'చ్యుతం' చేసి, అర్థవిశేషాలను వ్యాఖ్యానంచేస్తే 'చ్యుతచిత్ర' విశేషాలు చూరలుగా చుట్టుకొంటాయి. (కనుక, పద్యంలోని 'స్వైరవిహారధీర, సారసలోచన, లాతివారు,రసభంగ, పువ్వుతీవియ, రూపు, నవాంబురుహాంబక—' పదాలు 'సాభిప్రాయ పరికర-పరికరాంకురాలంకారము' లగుటచే,శబ్దశక్తినిమించి, వ్యంగ్యార్థద్యోతకములు కూడ నగుచున్నవని భావింపదగును)

వసు చరిత్రలోని ఈ 2–55వ పద్యమునకు మహాపండితులెందరో అరువదికి పైగా అద్భుతఅర్థముల నల్లినట్లు, కవిపండిత పరంపరావాణి ఒకప్పుడు పండిత ప్రవరులు శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ తిమ్మ జగపతి ప్రభువులకు మొత్తం మీద "వసుచరిత్ర"కు అష్టా (8) ర్థాలనేకాక, ఇంకా శ్లిష్టార్థముల నెన్నో చెప్పుచుండ, వ్యంగ్యములు లేవా"యని ప్రభువులు ప్రశ్నించిరట, "ఆహా! లేకేమి?" అని అభిధా, లక్షణా, వ్యంజనామూలక వ్యంగ్యములనెన్నో వివరించినారని పెద్దలు చెప్పగా విన్నాము. వస్తుతః-వీనికన్నిటికి మూలభూతమైనది. "నవాంబురుహాంబక!' అను సాభిప్రాయ సంబోధనము 'ఏకసంబంధిజ్ఞాన మపరసంబంధి స్మారకం' అను న్యాయము ననుసరించి, పరిశీలించిన, దీనికి కూడ టీకాకరమై కొలయాచియగు___

సీ. తనకన్ను నెఱికొన్నునెపూవి గౌరీ సమాఖ్య
మించ జవించినట్టి 'యార్య'
తన చావలము చూపులనె చూపి సిరులెల్ల
కడఁజల్ల వచ్చిన 'కమలపాణి'
తన పొందిమము నవ్వులనె యుంచి గాంధర్వ
మవనికిఁ దెచ్చిన "హంసయాన"
తన యదృశ్యత నడుమనె తాల్చి సాంగయై
మొనసిన యతను 'సమ్మోహవిద్య'

తే. గావలయు నీ వెలఁది దీవికాంతి, గుణ, క
ళా, ళి రూప్యంబు, లెరిగించి, 1 యామహేశు
నా 2 న గోద్ధారకుని, నా 3 ప్రజాధివాధు
నా 4 జగన్మోహనువి, దెత్తు ననుమఁజనిమె ॥ వ. 2–27

అను పద్యముతో పోలికలున్నందున, ఈ 'నవాంబురుహాంబక' పదార్థాలను వానితో కూడ సమన్వయించుకొన వలసియుండును.

ఈ పద్యంలో భూషణకవి నాయికయగు గిరికను 1 'పార్వతి' (ఆర్య)గా, 2 లక్ష్మి (కమలపాణి)గా, 3 సరస్వతి (హంసయాన)గా, 4. మన్మథుని మాయా విద్య (అతను-సమ్మోహ విద్య)గా, కావలయునని, నాలుగు విధాల ఉత్ప్రేక్షించి, గిరికకు పార్వత్యాదులతో నభేదత్వము నారోపించినందున, వసురాజు నందును శ్లేషతో 'మహేశ్వర, త్వాద్యారోపణము చేయవలసియున్నది.

ఎట్లన. పద్యంలోని చివరి శ్లిష్ట వర్ణనచే, వసురాజునకు '1 హర, 2 హరి 3 బ్రహ్మ, 4 మన్మథులతో అభేదా ధ్యవసాయము సంభావ్యమైనది

1 గిరిక 'ఆర్య'యైనపుడు, వస్తుతః, అంబురుహ+అంబకుడు (తామరల వంటి కన్నులుగల) రాజు, అంబురుహము ("రుహ-బీజజన్మని, ప్రాదుర్భావేచ" అను ధాతువు వలన) =నీటబుట్టిన అగ్ని (పద్మమని చెప్పరాదు) ఆయగ్ని అంబ కము (కన్ను)గా గల 1 శివుడై నాడు. 2. గిరిక 'లక్ష్మి'కాగా, వసురాజు, అంబు రుహ+అంబకుడు=కమలాక్షుడు=2. విష్ణువైనాడు 3 నాయిక 'సరస్వతి' యైన పుడు, రాజు, నవ+అంబురుహ+అంబక=నూతన-పద్మము-తల్లి (పుట్టుకడు-కార

15)

ణము) కాగల 3 బ్రహ్మయైనాడు, 4 అట్లే, గిరిక సమ్మోహన విద్యకాగా, రాజ అంబురుహము-అంబకము (బాణము) కాగల 4. మన్మథుడు అగుచున్నాడు.

ఇట్లు, నర్మగర్భముగ, సాభిప్రాయముగ వాడబడిన 'నవాంబురుహాంబక' పదము, నానార్థసంధానము చేయుచు, రూపక-ఉత్ప్రేక్ష-సమ-క్రమ-శ్లేష-పరికర-పరికరాంకుర-విశేషోక్తి- ... ఆది-నైకవిధాలంకారములకు నాంది వాచకమైనది. దీనితో పాటు, కవి ప్రయోగించిన, "స్వైరవిహారధీర, సారసలోచన, లాతివారు, రసభంగ, పువ్వుశివియ, రూపు....అను పదాలు కూడ, సాభిప్రాయము లగుటచే, అనన్త శ్లిష్టార్థాలతోపాటు, శబ్దశక్తిని మించి, వ్యంగ్యార్థద్యోతకములుగా కూడ నగుచున్నవి. ఇట్టి నానారహస్యముల నావిష్కరించు పద్యము లెన్నింటినో భూషణ కవి నిబంధించెను.

ఇంతగా, సాహితీరస సమృద్ధమగుటచేతనే గాబోలు, ఈ 'వసుచరిత్ర'ను నరించి, 'చంద్రికా పరిణయ....'' ఆది 'పిల్లవసుచరిత్ర' లెన్నో తెలుగునాటపుట్టి, మెట్టినవి. మరియు, తమిళ, కన్నడాది భాషలలోనికేగాక, అప్పయ్య దీక్షితునంతటి వాని శిష్యుడగు కాళహస్తికవిచే, ఈ 'వసు చరిత్ర' సంస్కృతానువాదమును కూడ సంతరించుకొని, సంభావింప బడినది. అట్లే, ఆంగ్లాది భాషలలోనికి అనూదితమై, అందల మెక్కి, ఇంకను తనివితీరక, విశ్వభాషాకుతూహలియై, వీర విహారము చేయమన్నదట.............

N B ఇక్కడ, 'రస'పద చ్యుతిచే, 'పదచ్యుతి'కి తార్కాణ మగుటయే కాక, 'స్వైరవిహారధీర' 'సారసలోచన' అను సమాన పదాలలోని, ఒక్కొక్క అక్షరాన్ని, ఒక్కొక్కమారు, క్రమంగా, చ్యుతంచేసి, అర్థ విశేషాలను ఆఖ్యానం చేయుటకు మొదలు పెడితే, ''చ్యుతచిత్ర రహస్య-విశేషా, లెన్నోచుట్టుకుంటాయని, వేఱె చెప్పనేల?

ఇప్పటికే చాలదూరం వచ్చినాము. అలం విస్తరేణ!

ఇట్లు, పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ- శబ్దశక్తి సామర్థ్యంతో, సాహిత్య, సౌహిత్య, రసౌచిత్య, వైచిత్ర్యాలను, సాంగంగా, సాంతంగా, స్వాంతంగా, సాధించి, అటనట ధ్వని మర్యాదలను ప్రతిధ్వనింపజేసిన, రామరాజ భూషణ కవియొక్క, శబ్ద ఝళం ఝళారావములు, కేవలము శుష్క-తర్క కర్కశబుద్ధులను వినాయిస్తే, అతని నొక ''సార- సలోచను''నిగా, అనగా- "అంతరార్థసారమగు స్థిరాంశమును చక్కగా, చిక్కగా, హృదయంగమంగా, సులోచనాలతో చూడగల, చూచి,

పాఠకులకు చూపి, మెప్పించగల స్వతంత్ర విహారణశీలునిగా కూడ, స్ఫురింపజేయ గలవు.

ఇతని వసుచరిత్రలో, ఈ "చ్యుత దత్తచిత్రాలు" ఆయా నామాలతో వాడ బడకుండ, అన్యాపదేశంగా, ధ్వనింపజేయుచున్న కొన్ని పద్యాలు దృష్టి గోచరమగు చున్నవి. వాని శ్లిష్ట, క్లిష్ట- అర్థాలు సామాన్య పాఠకులకు అంతగా ఆవశ్యకాలు కాకున్నను, జిజ్ఞాసువుల జిఘృక్షార్తికై, తృప్తికై, కొంతవరకు వ్రాయక తప్ప లేదు. సామాన్యపాఠకులు బ్రాకెట్లలో నున్నవాని జోలికిపోక, క్రింది వివరణలతో తృప్తి నొంద ప్రార్థితులు.

ఉ. 1 జాతికి నెల్ల రాజ పరిచర్యయు, 2 గాలికి నెక్కుడన్నవి
ఖ్యాతియు, రాఁ "గురంగములు" గట్టున నేమి తపంబొనర్చెనో?
యాతత శృంగభారరహితాత్మ మహాముఖ కాంతతాప్తి, నౌ
రా! తనరారె నన్నియుఁ "దురంగములై" తదభీష్ట సంపదన్॥ వ. 5-43

1. తమ కురంగ సామాన్యమున కంతటికి, (శ్లేషతో) రాజసేవ, చంద్ర సంగతియును, 2. శీఘ్రగమనమున గాలికంటె ఎక్కువ అనెడు ప్రఖ్యాతియు, వాయుదేవునకు వాహనమనియు, భావము(లు)-రాన్ = ఈ రెండును సంపాదించు కొనుటకొరకై, ఆ "కురంగములు" [=లేళ్ళు], కోలాహల పర్వతము [గట్టు]న, నెంతగొప్ప తపస్సు చేసినవో, కాని, తత్ఫలితముగా, అవి కోరిన విధంగా, ఆతత శృంగభారరహిత- ఆత్మమహాముఖ – కాంతతా+ఆప్తిన్ = పెద్దకొమ్ములులేని వ్యక్తియ మహాముఖముల-సౌందర్యము పొందుటచేత, ఔరా! అవి అన్నియున్, తురంగములై [గుఱ్ఱములై]- తనరారెన్, ఆహా! ఆ "కురంగము" లన్నియు— "తురంగములు"గా మారినవి గదా!- అని సామాన్యార్థము.

ఇక, అన్యార్థ ప్రతీతి యెట్టిదనిన—ఆతత శృంగ భారరహిత= ఉకారరహిత మైన, ఆత్మ మహాముఖ=తమ "కురంగ" శబ్దమునకు-మొదటి అక్షరమైన,కాంత= (క+అంత) "క" కారమును, అంతము=లుప్తం- చేయగా, (దాని స్థానమున,) తాప్తిన్=(త+ఆప్తిన్) "త" కారమును, "దత్తము" చేయుటచేత, అనగా, ఉకారంలేని "కురంగ" శబ్ద - ఆదియందున్న కేవల "క" కారమును చ్యుతంచేసి, దాని స్థానమున, "త" కారమును "దత్తం" చేయుట [ఉంచుట]చే 'క'కారం మీది 'ఉ" కారంతో కూడి, "తు" వర్ణమైనదని భావం. అనగా అకారము తొలగనే గాక, నామము [పేరు] తొలగగూడ, "కురంగములు- తురంగములు"గా

మారినవి. శబ్ద - ఆదియందున్న కేవల "క" కారమును చ్యుతంచేసి, దాని స్థానమున, "త' కారమును "దత్తం చేయుట (ఉంచుట)చే, "క" కారంమీది "ఉ" కారంతోకూడి, "తు' వర్ణమైనదని భావం. అనగా అకారంతోడనేగాక.... ఈ మార్పిడి, తమ [కురంగ] తపః ప్రభావంతో, శృంగారా భావము, ముఖకాంతతా ప్తి, ఫలములగా బోలునని ఉత్ప్రేక్ష.

వి. ఇట్లు "క' ను చ్యుతం, "త"ను దత్తం చేసి, ఆనాటికి అంతగా,అమలులో, ఆ పేరుతో ప్రచారంలోలేని ' చ్యుతదత్త చిత్రము"ను,భూషణ కవి ఉత్ప్రేక్షాలంకార ముతో ఊహించి, స్ఫురింప జేసినారని, తలంపవగును.

చ. హరిపరతంత్రవృత్తియు, మహామణి చాప శరానుబం-
ధురతయు, రాజహంసక వినోదనముం, బవిఘోషఘర్ఘర-
స్వరమును, జిత్రవిగ్రహ వికంకట భావము బూవి, శైలరాట్
పురి "వరదంబులై" "శరదముల్" నెరపెం,జపలాంశు సంపదన్. వ.5-44

N. B. కోలాహల పర్వతము నందలి మేఘాలు, అతని పట్టణానికి తగిన రథములైనట్లుగా ఊహించిన భట్టుమూర్తి, శ్లేషమాహాత్మ్యంతో, "మేఘధర్మము" లన్నియు, "రథధర్మము" లైనట్లుగా ఉత్ప్రేక్షించి, తనదైన పాండిత్య ప్రకర్షను, దీనిలో ప్రస్ఫుటింపజేయుచున్నాడు.

హరి పరతంత్ర వృత్తియున్=(హరి=ఇంద్రుడు, గుఱ్ఱము) ఇంద్ర పరా ధీన వృత్తిని, అశ్వపరాధీన వృత్తిని, మహామణిచాప-శర+అను-బంధురతయున్= (మణిచాపము=ఇంద్రధనుస్సు,రత్నమయమగువిల్లు)—శరము=(జలము,బాణము.) ఇంద్రధను-ర్జల సాంగత్య సౌందర్యమును, రత్నమయ ధనుర్బాణ సంగతి వలని చక్కందనమును, రాజహంస-కవి-నోద-నమున్=1. రాయంచలనెడు పీటిపక్షుల యొక్క తిరస్కారమును, లేక, 2. రాజ-హంస- కవి-నోదనమున్ = చంద్ర- సూర్య-శుక్రుల-యొక్క-ఆచ్ఛాదనమును, లేక 3. రాజహంసక-వినోదనమున్ = రాజ శ్రేష్ఠులయొక్క - వేడుకను, పవిఘోష-ఘర్ఘర స్వరమును=వజ్రాయుధ ధ్వనితో సమానమైన-నేమి (చక్రపుకమ్మి) శబ్దమును, చిత్ర-విగ్రహ- వికంకట భావమున్-పూని=కామరూప-శరీర-మహత్త్వమును, ఆశ్చర్యాకార మహత్తను- పొంది, శైలరాట్పురిన్=కోలాహల పర్వత రాజపట్టణమందు, చపలా+అంశు- సంపదన్=మెరుపుతీగల-కిరణ-సమృద్ధితో, శరదముల్=మేఘములు, చపల+ అంశు=సంపదన్=చంచల-కాంతి-సంపత్తితో, నెరపెన్=వ్యాపి.చెను (-అట!)

వి 'శరదము' లలోని 'శ' (శ్) కారచ్యుతితో 'అరదము'గా మిగిలినవి. హల్మాత్రమైన 'శ' కారచ్యుతి, 'వ్యంజనచ్యుతక' మైనట్లు, భంగ్యంతరమున ధ్వనింపజేయుచున్నది.

చ గిరివర ఘోరకందరలఁ గేవలవన్యగజైక వృత్తిచేఁ
దరలకయున్న సత్కృతము తప్పునె యప్పురి 'కేసరుల్' 'నృకే
సరు'లయి, పూర్ణ పౌరుష విశాలత మించె 'మహానృకేసరిం',
బరులకు మార్గ్మగం బిడమి, భక్తివిత్రోవ నటల్ ఘటింపమిన్॥   వ.5-45

గిరివర-ఘోర-కందరలన్=కోలాహల పర్వత శ్రేష్ఠమునకు సంబంధించిన-భయంకర-గుహలందు, కేవల-వనీ+అగ-జ+ఏక వృత్తిచేన్= ముఖ్యవనము సందలి-వృక్షమునుండి-పుట్టిన-ఫలాశిక ముఖ్యవ్యాపారముచేత, అనగా-కేవల వన్యవృక్షఫలా-ద్యాహారము చేతనని అర్థము (మరియు) కేవల-వన్య-గజ-ఏక వృత్తిచేన్=అడవి-ఏనుగులే-ముఖ్యాహారముగాగల వగుటచేతను-అనియు భావము (శేక-'వనీ+అగజ' అని విడదీసిన, అగజ=పార్వతియొక్క సేవచే, పునర్జన్మ లాభము. పార్వతి (దుర్గాదేవి) సింహవాహనగదా!)తరలకయున్న-సత్కృతము= కదలిపోకుండనున్న-సత్కార్యమగు తపశ్చర్య, తప్పునె?=ఊరికనే పోవునా?, అట్లు, వ్యర్థముకాదు కనుకనే, కేసరుల్=సింహములు, అ+పురిన్=ఆ పట్టణమందు (1) నృకేసరులై=నరశ్రేష్ఠులై, పూర్ణ పౌరుష విశాలతన్=సంపూర్ణ-పరాక్రమాధిక్యము చేతను, పరులకు-మార్గ్మగంబిడమిన్=శత్రువులకు - విముఖత్వముచూప కుండుటచేత, భక్తివి-త్రోవ-నటల్-ఘటింపమిన్=భక్త సంరక్షణకు-అసత్యము (నటల్) లాదకుండుటచేతను. ఆ పునర్జన్మలో, మహానృసింహావతారమును కూడ మించెనవి పారవశ్యము, స్వారస్యమును, మార్గ్మగంబిడుట=నరసింహావతారమున, సింహ ముఖమును (మారుమొగమును) ధరించినవాడని, నటల్-ఘటించు=మెడ మీద జూలును-ధరించిన-వాడనియు భావింపవలెను

1) 'సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' సింహ, శార్దూల, నాగ, కేసరి, కుంజర-మొదలగు శబ్దాలు-పరాలు (ఉత్తరపదాలు)గానున్నపుడు స్వార్థమును విడచి, శ్రేష్ఠార్థమును చెప్పగలవను సంప్రదాయమును గమనింపవలెను

ఇక్కడ, సామాన్యములగు కేసరులు, నృకేసరులై, మహా-నృకేసరిని కూడ మించి, జయించినవనుటచే, సామాన్య కేసరులు నృకేసరి జన్మమును బొంది,

కరకు, ఆ మహాన్నృకేసరిని కూడ, మించి, జయించి, సర్వోత్కృష్టదశకు జేరిన సమ, స్వారస్యమును కూడ స్ఫురింపజేయుచున్నవి.

వి. 'కేసరులు' పదానికి ముందు 'నృ' & 'మహాన్నృ' అను వానిని 'దత్తం చేయుటవలన, అవి 'దత్తచిత్రము'లు కాదగియున్నవి.

తెనాలి రామకృష్ణుని పద్యంగా, లోకుల నాలుకలపై నానిన, ఈ పద్యాన్ని కూడ కాస్త పరిశీలించి చూడండి.

సీ. 'కంధరల' బలక సంకాశంబు కాలేక,
 లలన వక్షోజ తౌల్యంబు గోరె,
'చందనం' బామోదసరణి కముఖ్యవ-
 ర్లతగాంచి, కాంతి గౌరవముగోరె,
'ప్రదరంబు' మార్కి- వంగరి కుల్కి-, ప్రా-
 కృతి దప్పి, కంఠ ద్యుతి దనరగోరె,
'పవనంబు' వీఃక్వాన పవనంబునకు నవ-
 గతిబూని యౌవన గరిమ గోరె,
తిరిగి, "1 కటి, 2 నాభి, 3 హాస, 4 శ్రుతి" ప్రశస్తి-
గనక, '1 మొరపెట్టి, 2 నుదిపడి, 3 అంతములయి
4 వంకరదవంబు',-పూని. త్రైవర్ణ్యఫలము
లలముకొని, మేరలకు దూరమాయె నౌర!॥

1. 'కంధరంబు'=మేఘము, అలక సంకాశంబు-కాలేక=ముంగు-రులతో-సామ్యమును-పొందజాలక, లలన-వక్షోజ- తౌల్యంబు-గోరె-నాయికా- స్తనములతో-సమతను-కోరుకొన్నదని సామాన్యార్థము. ఇక, అన్యార్థ ప్రతీతి-'కంధరంబు' అను శబ్దము 'కా'-లేక=మొదటనున్న 'క' కారముమలేకుండ 'చ్యుతం' చేసుకొని, 'ధరంబు' (=కొండ)గా మిగిలి, చివరికి సర్వ్వతార్థంతో: ఆమె కుచసామ్యమును పొందగోరినదట! (N. B దొంకతిరుగుడుగా తలంపక, మిగిలిన ప్రతి చరణము నకు, ఇట్లే శ్లేష్ట,క్లిష్టార్థములను కష్టపడిచెప్పుకొని, సమన్వయించుకొనవ ప్రార్థన.)

2. "చందనంబు"=మంచి గంధము, ఆమోదపరతకి=అతి గంధ-మార్గమునకు, అముఖ్యవర్ణత గాంచి=ముఖ్యమగు ఆదివర్ణమగు "చం" తగ్గిపోగా, "ద(త)నము" (ధనము)గా మిగిలి, గంధపుహూతతో కాంతి (జ్యోతి) గౌరవమును పొందబోయినదట! 3. "ప్రదరంబు" = బాణము, చూడ్కి-సంపదకు - ఉల్కి - చూపుల సమృద్ధికి - భయపడి, ప్రాకృతిన్-తప్పి = స్వభావమును వదలి, లేక "ప్ర" ఆకృతిన్='ప్ర'దరంబులో ముందు "ప్ర" అనే అక్షరాన్నిపోగొట్టుకొని దరంబు= (శంఖము)గా మిగిలి, శంఖార్థ రూపంతో, కంఠకాంతిని కనుగొనగోరినదట! 4. "పవనంబు" = గాలి, నిశ్వాసపవనంబునకు = నిట్టూర్పుగాలికి, - ఉపమింపబడుటకో, ఆ "ప" గతిన్-పూని=మరల మంది తొలగ, ఉద్యమించి, యౌవనగౌరవము పొందబోయినదట! ఈ 'పవనము'-అ-"వ" - గతిన్-పూని = తనలోనున్న "ప"కారస్థితిని - పోగొట్టుకొని, అనగా "ప'కారంపోగా,"వనము' గా మిగిలి, అట్లే "యౌ" వనముయొక్క గురుత్వాన్ని కాంక్షించినదట!

తిరిగి=మరల పోటీపడి, 1. కటి 2. నాభి 3. హాస 4. శ్రుతి-ప్రశస్తిన్-కనక=అనగా-క్రమంగా- 1. మొల, 2. బొడ్డు 3. హాస్యం 4. చెవి-వీనియొక్క ప్రసిద్ధిని పొందజాలక, (ఓడిపోయి) యథాక్రమంగా-1. మొరపెట్టి 2. సుడిపడి 3. ఖండములయి, 4 వంకరదనము పూని, అనగా- 1. మొల పెద్దగా శబ్దం చేయుచు, 2. బొడ్డు చుట్టలుగా చుట్టుకొని, 3. హాస్యం అరువిదాలుగా ముక్క-చెక్క అయి, 4. చెవి వంకరటింకరగా వంగిపోయి, త్రైవర్ణ్యఫలములు-ఖలముకొని= బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-వర్ణ ప్రతిఫలములగు "ధర్మాదులు" వ్యాపింపగా, లేక, ధర్మ-అర్థ-కామములను "త్రివర్గము"నకు ప్రయోజనము వ్యాపింపగా, మేరలకు= హద్దులకు, పోలికలకు కూడ, దూరముగాపోయి, విల్చిపోయినవట! లేక, కడకు, సాధింపదగిన, "త్రివర్గ" ఫలమగు మోక్షమునకు గూడ, దూరానమండిపోయినవి-అని భావం.

ఔరా! ఎంత ఆశ్చర్యం! మొత్తంమీద, పాదాదియందున్న "కంధర-చందన-ప్రదర-పవనములు" తమ తమ 'ఆద్యక్షరచ్యుతి తో "ధర, దన, దర, వన ములు"గా మిగిలి, పాదార్థ్యాన్ని పొందజాలక, అసదృశత్వంతో, ఏమియుచేయజాలక. "చ్యుతి" సహాయంతో, అర్థాన్ని, కల్పించుకొని, సంతృప్తినొందగోరినందున "అక్షరచ్యుతకము' లైనవని మనవి.

చివరికి, "కటి....ఆదుల ప్రసిద్ధికై కూడ ప్రయత్నించి, మొరలు ... పెట్టు

కొన్నను.....హద్దులకు మాత్రం అల్లంతదూరంలోనే ఉండిపోవడం "ఆశ్చర్యకరం" కాదా?

## గణపవరపు వేంకట కవి చిత్రములు

ఇక్లే 'చ్యుతదత్త చిత్రము' అని కంఠోక్తిగ చెప్పుకున్నను, ఆయా (కొన్ని) విశేషముల నచ్చటచ్చట, అన్యాపదేశముగ అలరించిన కవీశ్వరులు కొందరు లేక పోలేదు వారిలో గణపవరపు వెంకటకవి "గణ్యత" గాంచినాడనుటలో, పాఠకులు ఏమాత్రము "సంశయాత్మా వినశ్యతి" న్యాయానికి కారణాచులు కావలసిన పనిలేదు.

కాని, ఈ కవి కొన్ని పద్యాలు ఇనుపగుగ్గిళ్ళు, పాషాణపాక ప్రచురములు. క్లిష్ట, క్లిష్టార్థభూయిష్ఠములు పాఠకధిషణాకషణ సమర్థములు ద్రావిడ ప్రాణాయామాకరములు. అతడీ చిత్రములను, సూటిగా, నీటుగా, చెప్పక, అన్యాపదేశంగా ఘాటుగా చెప్పి, అదరగొట్టినాడు. కొన్ని పద్యాలలో అశేషచిత్ర విశేషములు గోచరించుచున్నను సాహసించి, వాని క్లిష్టార్థవివరణలతో, పాఠకధిషణాకషణము చేయజాలక, అర్థమైనంత, అవసరమైనంతవరకే అర్థసమన్వయంచేసి, వైచిత్ర్యప్రదర్శనా ప్రయత్నం చేయగలమని మనవి. వీనిలో విశేషములు, వైచిత్ర్య విశేషములవింకను ఊహించి, తెలిసికొనగలరు. అల మతి విస్తరేణ

### "శబ్దచిత్రకందము"

క. అరికుచ జంఘలకశికమ -
కరి' యాదిమ వర్ణముడిగి "కరి' యై, గతినే
వరి, కాంతసామబంధత -
"వరి" యయ్యెను బాహలతకు "వరి"గాదయ్యెన్ ॥ ప్రవేం. 310

చక్ర (అర-అరి) స్తని (నాయిక) యొక్క జంఘ (పిక్క)లతో పోలికను పొందలేక, "మకరి' (మొసలి) ఓడిపోగా, దాని ఆద్యక్షరమగు "మ"కారం తొలగిపోగా (చ్యుతంకాగా) "కరి"గా మిగిలింది. ఆ "కరి" కూడ నడక (గజగమనం)లో నాణ్యము తగ్గ (గతిన్+ఏపు+అరి), క+అంత....="క" అనే అక్షరం కూడ అంతంకాగా=తగ్గిపోగా, లేక, "క"+అంత గతిన్-ఏపరి="కరి"లో "క" కారంకూడ అంతమై (=నాశనమై)పోగా-అతిశయం-తగ్గి, "రి"గా మిగిలినదవ వచ్చును. పిమ్మట, ఆ "రి" సామబంధత (వ+అనుబంధిత) 'వ కారంతో సంధి చేసుకొనుటచే 'వ-రి-' -యయ్యెను = వరి 'గా, వరి=సమానపదంగా తయారై

కను, అట్లే "కరి = కరములు లేక చేతులు గందియైనను, ఆమె, బాహులతకు మాత్రం, సమానం (సరి) కాలేకపోయినదట!

వి. 1. స్త్రీల- స్తనములను చక్రవాకము(అరి)లతోను, జంఘలను మొసళ్ళ తోను, నడకను కరిగమనముతోను పోల్చుట కవి సమయములు.

2, మొదట 'మకరి' లోని అద్యక్షరమగు 'మ' చ్యుతమై, మిగిలిన-'కరి' నుండి, మరల 'క' కూడ 'అంతం' కాగా, 'రి'గా మిగిలి, మరల ఆ 'రి', 'స'ను 'దత్తం' చేసికొని, 'సరి' యగుటచే, మొదటివి రెండు 'చ్యుత-చిత్రాలు' కాగా, మూడవది 'దత్తచిత్ర'ము కాదగియున్నది.

3. 'మకరి' నుండి 'మ-క'లను చ్యుతం చేసినా, పిమ్మట 'సానుబంధం' కల్గించినా, ఇవి 'చ్యుత-దత్త చిత్రాలే' కాగలవుగాని, హీయమైన-వర్ధమానాక్షర చిత్రాలు కాజాలవని గమనింపవలెను.

4. కవి 'చ్యుత-దత్త-చిత్రత'ను వాదా చెప్పక, అర్థంకంటె, శబ్దానికి ప్రాధాన్యమిచ్చి, చెన్నెనలారజేసినాడనుట విక్కువము.

## అద్యేకాక్షర లోప ప్రాణితోపమేయ భావభావితోపమాన గర్భితచరణ దుర్ఘట సీసము.

సీ. మావినికి 'సువితంబంబు' విలంబంబు
కుందరదనకు 'వాగురులు' 'కురులు
చిన్ని కన్నియకు 'వాల్గన్నులు' 'కన్నులు
కలువకంటి 'కుచములు' 'లకుచములు'
బాలికామణి 'శైవాలమ్ము' 'వాలమ్ము'
పాటలాధరకు 'శ్రీ వదము' 'వదము'
కైరవేక్షణకు 'రంభోరులు' 'భోరులు'
కొమకు 'క్రొమ్మెరుగు' 'మెరుగు

గీ. పూర్ణచంద్రాననకు 'దరికోమ్మోవి' "మోవి"
భద్ర గజగామినికి 'దేనె వలుకు' 'వలుకు'
పూవుబోడికి' మిన్నఖములు' 'వఖములు'
గాదగె, లతాంగి చిత్ర సంగతి నెనంగె' ప్ర వేం. 321.

పై పద్యంలోని '1. సునితంబంబు", 2. వాగురుల,3. వాల్గన్నులు, 4. లికుచములు, 5. శైవాలమ్ము, 6 శ్రీ పదము, 7. రంభోరులు 8. క్రొమ్మెరుగు 9. తలిర్మోవి 10 తేనెపలుకు 11. మిన్నఖములు-అను ఉపమాన గర్భిత పదాలకు ముందున్న, ఒకటి, రెండు అక్షరాలను 'చ్యుతం చేయుటవలన, క్రమంగా ప్రాణం పోసుకొని బ్రతికి (ప్రాణిత) బయటపడి, ఉపమేయభావమునొంది "1నితంబంబు, 2 కురులు, 3 కన్నులు, 4 లకుచములు, (గజనిమ్మపండ్లు) 5. వాలమ్ము 6 పదము, 7 భోరులు, 8. మెరుగు, 9. మోవి, 10. పలుకు, 11 నఖములు-అనుపదాలుగా రూపొంది, అన్వర్థబోధకములగుటవలన "చ్యుతాక్షరచిత్రము"లగు చున్నవి.

మరియు, ఈ పద్యంలో ఒకటి, రెండు ఉదాహరణములనేగాక, అనేకత్రదళాధిక దృష్టాంతములను, ప్రదర్శించుట, వేంకటకవి యొక్క శబ్దచిత్రశాస్త్ర పారంగతిక ప్రబలనిదర్శనము అంతేకాక, "తలిర్మోవి, తేనెపలుకు" లందు "పదచ్యుతక" ప్రస్ఫోటనము కూడ గమికొనుట గమనార్హము.

## ఉభయ చిత్ర సీసము.

సీ. పడతి దేహము 'కుసుంభము' నడంచుటయు కా,
దువిద వక్షోజంబు లోటు పరచు,
రమణి 'వల్లిగి' "కోరకముల" రాల్చుటయు కా-
దింతి సిబ్బెపు గుబ్బలెగురదోలు,
వెలది నవ్వు "గుళుచ్ఛము"లదల్చుటయకాదు
మది రాక్షి పాలిండ్లు చిదిమివైచు,
చెలియారు 'శైవాలమ్ము"ల గొట్టుటయకాదు
ముదిత చన్నులు తాలమోదజేయు,

గీ. నవుర! మధ్యమవర్ణంబు దివియ, నుత్త-
రార్థకథితోక్త కుపమలై, యవియె, మదిని
గోరి యెన్నెదు చోటుల, "కుంభ, కోక,
గుచ్ఛ, శైలంబు" లగుచున్నవి చెప్పదవరుః ప్ర వేం. 499.

ఆ నాయికా శరీరము (ఉపమేయము) కుంకుమరక్తిమ లేక బంగారుచాయ (కుసుంభము)ను అణచి, జయించుటయే కాక, దాని మధ్యమ వర్ణ-మగు "సు"ను లుప్తం చేయగా (కు(సు)ంభము) 'కుంభము" (=కుండ, కుంభస్థలమువంటి పద్య

పాద-ఉత్తరార్థమున చెప్పబడిన ఆమె స్తనములకు ఎలాగైతే నేమి, ఆశ్చర్యకరంగా, ఉపమానకల్పంగా నైనదట!

ఆమె "వల్‌జిగి" (=దంతకాంతి) "కోరకము (మొగ్గ)లను చులిసి, రాలు వల్లు చేయుటయేగాక మధ్య "ర"వర్ణలోపంతో, కోకము(=చక్రవాకము అయి.... ఆమె పిల్పెపుగుల్పల నెంగిపోపునట్లు జేయగోరినదట!

ఆమె నవ్వు 'గుళుచ్ఛము' (పూలగుత్తు)లను తిరస్కరించి: భయపెట్టుటేకాక మధ్యమ 'ళు' వర్ణ "చుతి' తో, గు (ళు) చ్ఛం= గుచ్ఛమై [గుత్తియై] ఆమె కుచ ములను ఛిన్నభిన్నం చేసినదట!

ఇక, ఆమె నూగారు లేక రోమావళి "శైవాలము"[=నాచు]లను కూల్చి వేయుటయేగాక, మధ్యమ 'వా'వర్ణ "చ్యుతి' తో, శై (వా)లము శైల [కొండ]మై, వళితి చన్నులను, రత్నాల [రాళ్ళ]తో రంజింపజేసి, మించినదట!

ఆహా! ఏమి ఈ ఆశ్చర్యము! ఆ నాయికయొక్క దేహాదులు [పద్యపాద పూర్వార్ధమునందలివి] 'కుసుంభా'దుల వదరగొట్టుటయేగాక, మధ్యమ వర్ణ లోపంతో, ఉత్తరార్ధమునందలి 'కుంభా''దులుగ కూడ మారి, తద్గ్రస్త ఉపమానము లను, క్రమంగా బహిర్గతంచేసి, కోరుకొన్నట్లుగా, కవి సమయాలను పాటించి, పోలికలను పొందువరచుకొని, అమితాశ్చర్యకరములైనవట-[ఉత్ప్రేక్ష లజ్కారము]

వి పూర్వోదాహరణములలో "అధిక-ఆది-అక్షరచ్యుతి" జరుగగా,ఇక్కడ, మధ్యమాక్షర చ్యుతి నొందిన-ఇవికూడ, మంచి ఉదాహరణములై, మించియున్నవని గమనింపగలము

### అధికాద్యేకాక్షరయోగోపమాన గోపన చరణసీసము

సీ. తర్కింప చక్కని తలిరాకు బోణికి
'ధరము'తన్దోయి, 'కంధరము' వేణి
అరయంగ జిన్ని పాయపు టన్నుమిన్నకు
'వరము' దీగెయు, 'శ్రీవరము' నాభి,
పరికింప సామి కుభకర విటాలకు
'దరము' కంఠంబు, 'ప్రదరము' చూపు,
భావింప గంధదంతావళయానకు
'రవ' మధరంబు, 'పారవము' కరము

గీ. అమరు మంజుభాషకు 'వలనములు' గమన
ములు, గురునయనములు 'మీనములు' గణింప
గామినికి జంఘిక 'మకరగతి', 'హిమకర-
గతి' వదనమయ్యె, చిత్రసంగతిగ జగతిని ప్ర. వే. 317

వి. ఈ సీసపద్యములోని ప్రతిచరణమున, ఆదిని ఏకాక్షరమును చేర్చుటతో, ఉపమానములు గుప్తములైనట్లు కన్పడును. "ధరము, నరము, దరము, రసము" అను నాలుగు శబ్దాలకు ముందు, కవిక్రమం తప్పక, 'కం, శ్రీ, ప్ర, సా'' అను నాలుగక్షరాలను, ఒక్కొక్కటిగా అధికంగా "దత్తం"చేసి, అన్వర్థ సాధనతోపాటు" దత్తాక్షర-చిత్రమునుకూడ ప్రదర్శించి, జగతిని చిత్రాలంకార సంగతిని పెంచి, మించి, మెరయునట్లు, చేసినట్లున్నది. మరియు, ఆమె గమనములు క్రమ చెంది, మందములును, నేత్రములు మీనము [చేప]లును-కాగా, కాలిపిక్క- [జంఘిక] మకర [మొసలి] గతిని, మొగము "హిమకరగతి ని [చంద్రసాదృశ్యమును] పొందినవట! "మకరగతి' కి ముందు "హి"కూడ దత్తమగుట గమనార్హము.

ప్రతిపాను ప్రాణిత శబ్దచిత్ర రూపకోపనీత-
ప్రతిపద దీపితో పమాలంకార సంసృష్టిచరణసీసము

సీ. కంబుకంధర "నితంబంబు"తో మార్కొని
'పాదముల్' ముఖవర్ణభంగమొంది,
తరళాయతాక్షి 'ముంగురు'లతో డగ్గరి
'యళులు' సమ్ముఖవర్ణహాని చెంది,
కువలయనేత్ర 'చన్గవ'తోనె దిర్చి, 'భూ
ధరము' విముఖవర్ణ సరణి పొంది,
భద్రేభయాన మన్ 'బలుకు'"తో ఢీకొని
'శుకము'ను ముఖవర్ణ వికలమంది,

గీ. సహి తదీయాంగ సముచితవర్ణ ధరణ-
రమున, 'పదములు, నళు, లధరము, మొకము' న
ఇ పరిదొరయ, తమ్ముల నల నిగురునెలను
దగు జడత తగ్గువడక కందుగవచెపె, ప్ర వేం. 427

కలభమువంటి మెరగల నాయికయొక్క "విలంబము" [పిరుదు, మొల] తో పోటీపడిన "పాదములు", చివరికి ఓడిపోయినవై, తమ మొదటి వర్ణమగు "పా" లోని దీర్ఘ మాత్ర "ఆ"ను పోగొట్టుకొని, "పదములు"గా మిగిలినవట!

తుమ్మెదల [అళు (లు) లు] ఆమె నొసటను వ్రేలాడు ఉంగరపు వెంట్రుక లను తారసిల్లి, సమ్ముఖవర్ణహానంతో – అనుకూల వర్ణ-దానం పొంది, అనగా-అది "అ' కారాన్ని పోగొట్టుకొని, మరల "వ"కారాన్ని దత్తం చేసుకొని, ముడుతలతో "వళులు" గా వరలినవట !

కొండ (భూధరము) కుచద్వయమును ఎదుర్కొని, తన మొదటి 'భూ' అక్షరాన్ని పోగొట్టుకొని (వి-ముఖ వర్ణసరణిబొంది) "అ" కారాన్ని "దత్తం" చేసికొని, "అధరములు" (పెదవులు, న+ధరములు=కఠినములు కానివి, మెత్త నివి, తగ్గిపోయినవి) అయినవట!

చిలుక (శుకము) ఆమె మెత్తని "పలుకు"ల నెదుర్కొని, ఓడి, మొదటి (ముఖ) వర్ణమగు "శు' వైకల్యమునొంది, 'మొ"గా మారగా, "మొకము"గా వికృతి నొందినదట!

వి. ఇలా, ఈ పద్యంలో కవి, వాని పేరు కూడ చెప్పకుండ, కానరాని, "చ్యుత-దత్త-చిత్రాల"ను పొదిగి, వ్యంజింపజేసినాడు. 1 పాదముల నుండి దీర్ఘ "అ" మాత్రను చ్యుతంచేసి, "పదములు" వేయుటతో "మాత్రాచ్యుతకము". 2. "అళుల"లో మొదట 'అ' కారం చ్యుతం కాగా, "వ"ను దత్తం చేయుటతో "చ్యుత-దత్త-చిత్ర"మగు చున్నది లేక-అళులకు ముందు "వ" కారమును దత్తం చేసి, 'వళులు"గా చేసిన' "దత్తవ్యంజన" మగును 3 'భూధరం' లో "భూ"ను చ్యుతం చేసి, "అ" కార దత్తతతో, "అధరాలు" అగుటతో "చ్యుతదత్తాక్షర చిత్రం" 4 "శుకము"లోని 'శు' చ్యుతమై "మొ" దత్తతతో "మొకము" కావటం వలన, మరొక "చ్యుతదత్తాక్షర చిత్రం' ప్రదర్శితమైనవి.

వి. శబ్దాలంకారములు శబ్దాలంకారములతోగాని, అర్థాలంకారాలు అర్థా-లంకా రాలతోగాని, ఈ రెండును ఒండొంటితోగాని, ఒక వాక్యములో కలిసిన, 'సంసృష్టి" యగును. అట్లు కలిసిన, అలంకారములు "తిలతండుల న్యాయము" (నువ్వులు-బియ్యము)వలె స్పష్టముగా తెలియుచున్నచో "సంసృష్టి" అలంకారము అనియు, వేరుగా, తెలియనంతగా "నీరక్షీరము"ల (నీరు-పాలు)వలె, కలిసిపోయినచో "సం కర' మనియు, ఆలంకారికుల నిర్ణయము. ఇక్కడ ఆయా అలంకారములు వేర్వే

రుగా, స్పష్టముగా కన్పడు చున్నందున "సంసృష్టి"యను మిశ్రాలంకరణ మున్నది.

ఇక్కడ, గ వేం కవి చూపిన కొన్ని "శబ్దచిత్ర విశేషములు" కూడ గమనార్హములు

## శబ్ద చిత్రము

1 తే. నలువ నలి 'న' -కువల 'య' -మీ"న -పదముల తు-
దల, దనరు వర్ణము ల్దివిచి, లలన తెలి
కళుకు బెళుకు తళుకుగ "కన్నులు" సృజింప,
నది మొదల్ "నయనా" భిదవిదిత మయ్యె! ప్ర. వేం. 315.

నాయిక కన్నులకు 'నయన'ములను పేరెట్లుప్రసిద్ధమయ్యెనో, ఊహించి,దాని 'ఉత్పత్తి'ని 'వ్యుత్పత్తి'ని కూడ, చిత్రంగా చిత్రించినాడీ కవి

నాలుగు మొగాలుగంబ్రహ్మ, నానా విధాల నాణ్యంగా ఆలోచించి, "నలి "న" -కువల"య"-మీ"న"-అను మూడు పదాల చివరనున్న "న-య-న" అను మూడక్షరాలను 'చ్యుతంచేసి, తీసి, మరలవానిని క్రమంగా "దానం" చేసి, కలిపి, అధిక కాంతితోనొప్పు కన్నులను సృష్టింప, నాటినుండియే, ఆ కన్నులకు "నయన"ములను పేరు వచ్చినదట!

శబ్దచిత్రము:- ఇక, ఈ కవి సృష్టించిన "వదన" పదసృష్టివాలకమును గూడ గాంచుడు.

తే. నళిక 'వ' నజ-"ద"ర్పణ-"న" లాహిత పదత్ర
యాది వర్ణముల్ గ్రహించి యబ్జసూతి.
కలుకు వెమ్మోము నిర్మించు కతన నాటె
నది మొదల్ "వదనా" (వ+అ) హ్వాయ మద్దమయ్యె ప్ర. వేం 477

బ్రహ్మ "వ" నజ- 'ద' ర్పణ-"న" లాహిత-అను మూడుపదాల-ఆదిమ (మొదటి) వర్ణాలగు "వ-ద-న" లను "చ్యుతం" చేసి, మరల, క్రమంగా వానిని "దత్తం' చేసి, కలిపి "వదన" పదాన్ని కష్టపడి సృష్టించినాడట! నాటినుండియే "వదన" పదం, సూటిగా, చక్కగా ప్రసిద్ధిగన్నదట! ఆహా! ఏమి యుత్ప్రేక్ష! ...

"నలిన" పదం అంత్యాక్షర చ్యుతిదానముతో వృష్ణం కాగా, "వదన" పదం ఆద్యక్షర చ్యుతిదానాలతో విస్మితమగుట మరొక విశేషము.

## శ్లోకగర్భిత చంపక మాలికావృత్తము

N.B. ఒకే అక్షరముమగాక, ఆద్యంతములందున్న అనేకాక్షరములను, పదములనుకూడ "చ్యుతం" చేయుటవలన, ఛందస్సుమారి, 'గర్భకవిత'కు దారి చూపి వర్ధింతకుముందే వివరించినాము. ఉదా:

చ. వరనత వారకాయి వరనాథ నతామర వారదస్తుతా
దరకర ధారదేహ ధరధారి ధరాధిపదారితాకరా
హరిబలహారి కంఠహరహారిహతాహితహార హృద్భిదా
స్థిరతరసారవాణి శివశింజితాసుర సింధుబంధనా॥ ప్ర.వేం. 822

ఈ చంపకమాలా పద్యంలో గర్భితాలైన శ్లోక గీతులు క్రింద వివరింపబడినవి.

శ్లోకం: వరనాథ నతామర వారదస్తుతా-ధరధారి ధరాధిపదారితాకరా
హరహారి హతాహిత హారహృద్భిదా-శివశింజితాసురసింధుబంధనా॥

గీతి : వారదస్తుత నరనాథవారకాయి-దారితాకరధరధారిధారదేహ
హారహృద్భిదహర హారిహారికంఠ-సింధుబంధన శివశింసిరసాణి। ప్ర వేం.822

వి. శ్లోకంలోని పదాలు వరుసక్రమంలో గర్భితాలై యుండగా, గర్భితగీతిలోని పదాలు మాత్రం అక్రమ-గర్భితాలగుట విశేషం.

మరియు క్రింది 'కంద' పద్యంలోని మొదటిమూడు చరణముల బేసిసంఖ్యలలోనున్న అక్షరాలను 'చ్యుతం' చేసి, మిగిలిన బేసి సంఖ్యలోనున్న వాటినన్నిటిని క్రమంగా దత్తం చేసి, కలిపి వాల్గపహావాన్ని వృష్టించడం విశేషాంతరం.

## పాదగోపన కందము.

క. వెంలి యు దాక మమకదయు- విబవుగుణాన్ దత్తి వంచు వీవికుబుక్తిన్
గలివి మవదేహ! శౌరీ-వెలి దామర యలుగు దవరు విభుగవిన హరీ॥
ప్ర శే 850.

దీనిలో సరి (2,4,6....... మొ) సంఖ్యలో నున్న అక్షరాలను చ్యుతం చేసి, మిగిలినబేసి, (1, 3, 5.... .. మొ) సంఖ్యలోనున్న అక్షరాలను వరుసగా 'దత్తం' చేయగా(కలుపగా) తద్గర్భితమగు వాల్గన వచనం బహిర్గత మగుట గమనార్హము.

N. B. కొన్ని పద్యాలలో, ఏకానేక-ఉదాహరణలను ప్రదర్శించిన, కొందరు కవులను మించి, ప్రతిపాదమునకొక చ్యుతాదిచిత్రములను, ఇంకా ఇతరవిశేషముల నెన్నింటినో ప్రచురముగా, ప్రదర్శించిన, గణప కవి గణ్యుడు! ఇంత ఓపిక పట్టిన పాఠకస్వాముల నభినందించి తదితరములను పరిశీలింతుము.

## చ్యుత దత్తాక్షర విశేష విమర్శ

1. అకలియె హెచ్చె ధర హింస లధికమయ్యె
పురము నందుండి జీవింప దరమె. మాకు." తె.చ. 272 పేజి.

ఇది, కీ. శే. డా. గాదె ధర్మేశ్వర రావుగారు తమ 'డాక్టరేటి' సిద్ధాంత గ్రంథము తెలుగులో 'చిత్ర కవిత్వములో' 'చ్యుతదత్తాక్షర' చిత్రమునకిచ్చిన స్వీయోదాహరణము. దీనిలో 'అకలియె' నుండి, అద్యక్షరమగు 'అ'ను చ్యుతం చేసిన 'కలియె హెచ్చె'-కలికాల ప్రభావంతో ధరలో హింస హెచ్చుగా పెరిగినది (అన్వర్థం)

2. 'పురము'నకు ముందు, 'కా' దత్తమైనచో, 'కాపురము' (=సంసారము, వివాహము) కాగా, సంసారసాగరము పీది జీవించడం కష్టమని ద్వితీయార్థం.

వి. డా. 'గాదె'గారిక్కడ అపార్థం వలన పొరబడినట్లున్నది ఒక పదంలోని అక్షర చ్యుతివలన, అన్యార్థము ప్రతీతమైనపుడు, అది 'అక్షరచ్యుతక' మౌతుంది 'అకలిహెచ్చె ...'లో' 'అ' చ్యుతం కాగా, దానిస్థానంలో అన్యాక్షరం దత్తమై, అర్థాంతర ప్రతీతి జరుగనందున, ఇది 'అక్షర చ్యుతకం' కావచ్చునుగాని 'చ్యుతదత్తాక్షర'కు ఉదాహరణం కాజాలదు. ఏలన, ఇక్కడ, చ్యుతాక్షర స్థానమున, అన్యాక్షరదానం జరగనందున, అర్థాంతర ప్రతీతికి అవకాశమే లేకపోయినది. అట్లే- 'పురము'నకు ముందు 'కా' దత్తముకాగా, సిద్ధమైన' కాపురము' అన్యార్థముతో "దత్తచిత్ర"మగుచున్నది. పై పద్యంలో ఒకచోట అక్షరం చ్యుతంకాగా, దాని స్థానంలోకాక, వేరొకచోట, మరొకదానికి "దత్తత" జరిగినంతమాత్రమున "చ్యుత దత్తాక్షరం" కాజాలదను, మా మనవిని, మన్నింప ప్రార్థితులు.

మరియు, వ్యాకరణాది ప్రయోగములలో, కొన్నిచోట్ల, విలక్షణంగా కొన్ని 'చ్యుతి దత్తాక్షరాలు' కన్పడినంతమాత్రమున, అవియన్నియు 'చ్యుతి-దత్తాది' చిత్రోదాహరణములు కాజాలవు. ఏలన-'చ్యుతం' గాని, 'దత్తం గాని,

జరిగిన పిమ్మట అన్వార్థ సమన్వయం" ఈ చిత్రాలలో ముఖ్య విషయమును సంగతి మరువరానిది. అయితే, వ్యాకరణాది ప్రయోగాలలో "అక్షరాదిచ్యుతి, దత్త' లు సౌలభ్యం కోసమేగాని, వానివలన అర్థాంతరం ఆవిర్భవించి, "చ్యుతాది చిత్రోదాహరణ"మగు అవకాశం కూడ లేదని గుర్తుంచుకొనవలెను.

1] i. స్త్రీ వాచక,తత్సమ,సంబోధనాంతాలకు చిన్నయసూరి సంధిలేదన్నాడు.

ఉదా :- అత్తిల్లు [అత్త+ఇల్లు] బాలేమెరుగున్ [బాల+ఏమి+ఎరుగున్], దాతాయె (–దాత+అయె)....ఇట్టి అత్త్వ సంధి ప్రయోగాలు కోకొల్లలు

ii. దొరసానగునా? (దొరసాని+అగునా?)—ఏమ్యాది సంధి.

iii. పిలిచిచ్చె [పిలిచి+ఇచ్చె] తెచ్చిచ్చె....క్త్వార్థేకార సంధి & iv వైరులే [వైరి+ఏ]నాస్తే[నాస్తి+ఏ] ఇత్త్వాన్త తత్సమ సంధి. v. తామరపాకు[తామర+ఆకు]....ఇత్యాది సంధులు.

2] సమాసాలలో వైవిధ్యాలు, వైరుధ్యాలు :- "కుత్సిత పుబుద్ధి' కి బదులు "కుత్సిత బుద్ధి" .... మిశ్ర సమాసాలు. అ దినము+వెచ్చము = దినవెచ్చము, పురమి+ఈకుడు=పురమీకుడు, ...., వైరి సమాసాలు ఇ. బోయాధముల్, తెపో్పత్సవం ...., అసాధు సమాసాలు, 'తల్లిదండ్రుల హితవును దప్పబోకు' కు బదులుగా "తల్లిదండ్రి హితవు దప్పబోకు"....ద్వంద్వ సమాసం.

3] క్రియలు :- "కొని"కి బదులు "క" ప్రయోగం 1. పట్టుకొని–పట్టుక, తీసికొని—తీసుక.

4] పదమధ్య స్వరలోపం : క "ఎరుగనివాడు"కు బదులు 'ఎర్గనివాడు", ఖ. బలిజ వధూటి=బల్జవధూటి, గ. గాడిద-గాడ్దె....

ఇత్యాదులలో "చ్యుతాదు' లు....బహుళముగా కన్పడవచ్చును. కాని, అవి యన్నియు చ్యుతాది చిత్రోదాహరణములు మాత్రము కాజాలవని తెలియవలెను.

## మరికొన్ని ఉదాహరణములు

తెలుగులో 'చ్యుతదత్తము'లని పేరు పెట్టకుండ ప్రకటితాలైన మరికొన్ని చమత్కృతిమచ్చిత్రాలను తప్పించి, తప్పుకొన(దోషమును లేక చెడును స్వీకరించు) జాలక, పాఠక ప్రభువులకు ప్రదర్శింప సాహసించినందుకు క్షమింప ప్రార్థితులు.

శ్రీ పోకూరి కాశీ పత్యవధాని గద్వాల పంస్థాన కవులు చిత్ర కవితలను చిక్కగా చక్కగా చిందించినవారు. వారు పోఁక (బహువచనం=ముద్దుకోరిక) లను, లేక పోకలు="నడపడికలు, శృంగార చేష్టలను, ఊరిస్తూ, పుట్టిస్తూ, "కవి సింహా' ది బిరుదులను సార్థకం చేసుకొన్నవారన్న అతిశయోక్తి కానేరదు. వారి "సారంగధరీయము" (త్ర్యర్థి) నుండి కొన్ని ఉదా :

ఆ. వె ఖగ తనయుఁడు, నమృత కిరణుడును, వనదుఁ డీ
జనవరేణ్య దానమునకు నోడి,
ముఖము వెల్లకునికి, ముఖ్యవర్ణ భ్రష్టు
లైరి, చెడుగు పేరు లంది, ఛిప్పి॥ అవతారిక 70 వ పద్యం

ఖ - గ, తనయుడును=[ఆకాశమున-నడచు] సూర్యుని యొక్క-కుమారుడును [కర్ణుడని-తెలియవలెను], అమృత-కరుడును=అమృతమయ [చల్లని] కిరణములు గల చంద్రుడును, వన-దుడు=నీటిని-దానము చేయు-మేఘుడును, ఈ-జనవరేణ్య-దానమునకు=ఈ - [కృతి పతియగు] సీతారామ భూపాలుని యొక్క-దాన స్వభావమునకు, ఓడి=లొంగి, ముఖము - వెల్లక - ఉనికి=మొగము-వెల్లక-పోవుట వలన, ముఖ్యవర్ణ భ్రష్టులు ఐరి = [తమకుగల] ముఖ్యమగు వర్ణము నుండి-చెడిపోయిరి, [మరియు] చెడుగు పేరు లందిరి=చెడ్డ పేరులను తెచ్చుకొనిరి. ఛిప్పి!=ఛీ, ఎంత అసహ్యము ?

ముఖ్య-వర్ణ [వంశ-కుల] భ్రష్టులైరియనగా, 1 కర్ణుడు ముఖ్య రాజవంశమున బుట్టి, కులభ్రష్టుడై సూత కులమున జేరెను. 2 చంద్రుడు తెల్లని వర్ణము [రంగు] కలవాడైనను, "అమావాస్య" నాడు నల్లనై కన్పడకుండ పోయెను. 3 మేఘుడు వస్తుతః తనదైన నల్లని రంగును పోగొట్టుకొని వర్షాకాలానంతరము వెల్లబాటు నొందెను

మరియు, ముఖము[మొదటిది]నకు సంబంధించినది=ముఖ్యము ముఖ్యవర్ణ మనగా-మొదటి అక్షరము. దాని నుండి భ్రష్టులైరనగా, దానిని చెడగొట్టుకొనిరి. అనగా - 1 "ఖ" తనయుడు 2 'అ" మృత కిరణుడు 3 'వ"న దుడు" అను

మూడు పదాల మొదటనున్న "క-అ-న" అను ప్రత్యేక అక్షరాలను చ్యుతం చేసు [పోగొట్టు] కొని, 1 కర్తుడు-"గత-నయుడు' = పోయిన-నీతి గలవాడు [నీతి-మాలినవాడు] అయ్యెను 2 చంద్రుడు-మృతకరుడు=నశించిన, కిరణములు లేక చేతులుగల వాడయ్యెను 3 మేఘుడు-న-దుడు [న-దదాతి]=ఏ కొంచెము దానము చేయని లోభివాడు గను-తయారైనారన్నమాట! ఛి, ఛీ! ఎంత అసహ్యము.

N B పై పదాలలోని ఆది అక్షరాలను చ్యుతం [తొలగించుట] చేయుటచే, అన్యార్థములు కూడ రమ్యముగా వచ్చుటచే 'అక్షరచ్యుతకములు' అయినవి.

ఆ.వె. ఆశర హిత దాని యాకారమడుగంటె-నివల మిగిలినట్టి కువలయ హితుఁ
బోల్చి చూతమన్నఁబూర్వ వర్ణము ఁబాసి-వ్యర్థుడౌ నరేపుఁడగు నితనికి॥
అవ. 89 వ.

1. అ-రేపుడగు-నితనికి=వింధ్యుడు గాని-ఈ కృతి పతి సీతారామభూపాలునికి, ఆశర-హితదాని-ఆకారము-అడుగు-అంటెన్=రాక్షసులలో-మేలైన దానము చేసిన బలిచక్రవర్తి (యొక్క) స్వరూపము (వామనుని పాదంతో త్రొక్కబడుటచే) -అడుగనున్న-పాతాళలోకమును చేరెను (రాక్షసః కోణపః-క్రవ్యాత్ క్రవ్యాదోఽస్రప, 'ఆశరః'-అ కో.) 'ఆశరహితదాని' పదములోని, ఆద్యక్షరమగు 'ఆ' అను అక్షరరూపం కూడ, అడుగంటినదని భావము. 2 ఇవల-మిగిలినట్టి-కువలయహితున్=(బలిచక్రవర్తి పోగా) ఈ పిమ్మట-మిగిలిన-కలువలకు-మిత్రుడైన చంద్రుని,-అనియును, 'ఆ' అనెడి ఆద్యక్షరం 'చ్యుతం' కాగా, మిగిలిన, కు-వలయ-హితున్=భూ వలయమునకు మేలు చేయువానిని, అట్లే-'ఆ' చ్యుతంకాగా, మిగిలిన, శరహితదాని=ఉదర సంబంధ-మైన-లాభమును-దత్తం చేసిన (భూమి మీది ప్రజలకు వర్షించి మేలు చేకూర్చిన) మేఘుని, అట్టి మేఘునితో పోల్చి చూతము-అన్నన్=సాటిగా ఉపమించి-చూడ దలంచినను, పూర్వ వర్ణముఁబాసి=1. చంద్రుడు తనకు మొదటనున్న తెల్లనికాంతి పోగొట్టుకొని, అనియును 2. 'శరహిత దాని' లో, పూర్వవర్ణమగు 'శ'ను చ్యుతం చేయగా, వ్యర్థుడౌన్='అనువన' నాదు కన్పడక, పోల్చుటకు పనికిరాని 'దవట' అగుచున్నాడనియు, 3 మేఘుడు కూడ (వి+అర్థుడు) విశేషద్రవ్యమును పోగొట్టుకొనుచున్నాడనియు భావము. ఇట్లు, 'శరహిత దాని' లోని పూర్వాక్షరాన్ని పోగొట్టుకొని 'రహిత దాని'యై, అనగా- పోయిన దానగుణము గలవాడు, అంటే దానం చేయక వ్యర్థుడయినాడనియు ధ్వనించుచున్నది. అంతేకాక, చంద్రుడు అహ్లాదమును

కల్గించువారు (చది-ఆహ్లాదనే)కాగా, మేఘుడు- (మేహతీతి=మేఘః,మిహ-సేచనే) 'జలముచే తడుపువాడు' అను వ్యుత్పత్త్యర్థమును కూడ పోగొట్టుకొని, వ్యర్థులైన రవియు ప్రతీయమానమగును ఇంకొంచెము లోతుకు దిగి, ఆలోచిస్తే, వీరిద్దరు "ర"హితదానులు=రేఫము(రకారము)తో, లేక నాశముతో, కూడుకొన్న దానముగల వారు, (ర=నాశము, కామము, భయము, రసములేవిది-మొ నానార్థములు) కాగా, ఆరేపుడు-అగు- ఇతనికి=రేఫాక్షరము లేక (ర)'హితదాని'=లాభమును దానము చేయువాడు, లేక అనింద్య దానము చేయు-నీ కృతి పతి యగు సీతారామభూపాలునితో పోల్చి చూచుటకు వీలుగానివారై రవియు ......పరంపరగా వచ్చుచున్న వ్యంగ్యార్థములు.

N.B. ఇట్టి వ్యంగ్య పరంపరలు గల దానిని "శబ్దచిత్ర మని, "అధమ" మని కొట్టివేయగలమా? మరియు, పద్యంలో "ఆ-శ-ర" అను అక్షరాలు క్రమంగా, చ్యుతాలై అన్యచమత్కారార్థాలను, అందించుచున్నందున "చ్యుతాక్షర చిత్రము" లగుచున్నవి.

ఇక, 'పోకూరి"వారి దత్తచిత్ర పోకడ నొకదానిని సావధానముగ,సమీక్షింప ప్రార్థన.

చ. "కు" మగువ శ్రోణిఁ బోలమికిఁ గుందుచు నున్నకుఁ దెల్పె 'నేను మ
ధ్యమును జయింతు" నంచుఁ జని, తా జత, గాక, "భ' యన్వయన్య కా
క్రమమును దెల్పెఁ, దాఁ జని, నఖంబులఁ బోలక, మూఁడునేక శ
బ్దముగను పోయి, చన్గవకు తగ్గెను, "కల్గవె నెత్తిపోట్లికన్॥ 2-40.

కు=భూమి (కత్రి) మగువ-శ్రోణిక్-పోలమికిన్-కుందుచు=ఆ నాయిక యొక్క పిరుదుకు-సమానమని ఉపమించుటకు పనికిరానందున-బాధపడుచు, నున్నకున్-తెల్పెన్=సున్న(౦)కు-విన్నవించుకొనగా, నేను-మధ్యమున్-జయింతున్-అంచున్-చని=(ఆ సున్న) నేనే స్వయంగా (వెళ్ళి)-ఆమె నడుమును గెల్చెద-ననుచు-పోయి, తాన్-జతగాక=తాను (సున్న) నడుముతో-పోల్చుటకు సమానము కాకపోవుటచే, 'భ"-అన్-వయన్యకు+ఆ క్రమమును-తెల్పెన్=(ఆసున్న, మరల) "భ' (నక్షత్రము) అను పేరుగల-స్నేహితురాలికి-ఈ-ఓడిపోయిన విధానమును తెలియజేసెను. పిమ్మట, తాన్-చని=ఆ నక్షత్రము (భ) కూడ స్వయంగా-పోయి, నఖఃబులన్-పోలక=ఆమె గోళ్ళతో కూడ-సమానము కాజాలక, (కొనగోటికి కూడ పనికిరాకపోగా) ఆ-మూడును"=కు-౦-భ"అను మూడక్షరాలును, ఏకశబ్దముగ దత్త

మలయిపోయి=కలిసి ఒక్క-శబ్దము "కుంభము' గా కలిసి పోయి-ఒక్క మాట మీదగా-వెళ్ళి, చన్-కవకున్-తగ్గెను=చన్నుల జంటతో-పోల్చుటకు కూడ-వీలు గాక తగ్గిన వయ్యెను. ఇక (న్)=ఇందుమీద అన్నిచోట్లను ఇట్లు ఓటమి సంభవించిన పరిస్థితులలో, నెత్తిపోట్లు-కల్గవె?=నెత్తి (తల)మీద దెబ్బలు లేక బాధలు కలుగకుండునా? లేక ఎత్తిపోట్లు-=తిప్పులెన్ని మనస్సును బాధ పెట్టుటలు-కలుగకుండానా? అనగా తప్పక బాధలు కూడ కలుగుమండునని భావము.

N B. ఇచ్చట 'కు' కు 'సున్నను' మరల వానికి 'భ'ను 'దత్తత' చేయుట వలన, 'కుంభ'మై, అన్యార్థములతో కూడ సమానములుకాలేదు, అప్పుడు, ఈ మూడు అక్షరములు ఒకే శబ్దముగ 'దత్తము' లై, కలిసిపోవునట్లు చేసి 'దత్త చిత్రము'ను సాధించిన కవియొక్క సామర్థ్యము, పరులను కాతాల (అసూయ) పడునట్లు చేయుచున్నది.

ఏ నాయికయొక్క నడుము సన్నగా, తక్కువగా నుండుటచే శూన్యము= సున్న, (౦), 'ఆకాశం గగనం శూన్యం ...' గను,అసలు ఆ నడుముదాల సన్నదిది అన్నట్లు 'ఉదరం పరిమాతి ముష్టినా' (పిడికిలితో నడుమును కొలుచుట), 'సదసత్ సంశయ గోచరోదరిన్....' ఆ నడుము అసలు ఉన్నదా? లేదా! అన్నట్లు సంశయమును గల్గించు చున్నట్లున్నదని ...ఇత్యాదిగ సంస్కృతాంధ్ర కవులవర్ణనల విట సంధించుకొనవలెను.

చేమకూర వేఙ్కట కవి 'వాఙ్మయమునూధి పీయంతటివాడికేడీ? ..." అని, ప్రతిపదంబున... చమత్కారము, నర్థగౌరవముగల్గ, ననేకకృతుల్ ప్రసన్న గంభీర గతిన్ రచించి, మహిమించినట్లు రఘునాథ నాయకుని చే కీర్తింపబడిన కడుంగడు గడుసువాడు. అతని ఇంటిపేరు 'సన''గా ఉండవచ్చును గాని, కవిత్వంలో మాత్రం ప్రకృష్టమగు "పస" గలవాడు.

మ 1. విహరించున్ మలయానిలంబిచట, 2. దావింజిల్కి నెమ్మెనియా
విహరించున్, 3. పికినాదముల్ చెవికి గావించున్ జవుల్, 4. పోదమా
సహకారాళి పదంబు జూడగ వయస్యా! 'హాళి" వాటిల్లెడున్,
5. సహకారాళి పదంబు జూడగ వయస్యా! 'హాళి' యౌనేగదా! ॥వి 2-53

సందర్భం : కుబేరుని ప్రేయసి "నంద"యను అప్సరస, తన నల్వురు

చెలులతో, అన్నిలోకాలు తిరిగి వస్తూ, అందమైన ఒక అడవిని చూచి, ఆనందిస్తూ,
అక్కడ ఆ అయిదుగురు, ఆడుకొన్న చతురోక్తులు. ఒకటవ (1) చెలికత్తె: మల
యానిలంబు-ఇచటన్-విహరించున్= (ఓచెలీ!) మలయమారుతము-ఈయడవిలో-
వీచుచున్నదిసుమా! అనగా, రెండవచెలి (2) తావిన్-చిల్క,-నెఱ (ఔ)+మేని-
ఆవిన్-హరించున్= (ఔను! నిజమే!) ఆ గాలి-తీయనివాసనను-వెదజల్లి-చక్కని
శరీరము నందలి వేడిని-పోగొట్టుచున్నది-దీనిలోని ద్వితీయార్థము: నీవు "విహరి
స్తుంది"-అని మాత్రమే చెప్పినావు, కాని, ఆ "విహరించున్"లోని, "వి' న్-చిల్క=
"వి" అనే అక్షరాన్ని "చ్యుతం" చేస్తే, "హరించున్" మాత్రమే మిగిలి, వేడిని
వెడలగొడతుందని చమత్కారార్థాన్ని కూడ, తెల్పుతుందిసుమా! అనిరెండవ చెలి
హెచ్చరిక. 3. పికీనాదముల్-చెవికిన్-చవుల్-కావించున్=ఆడుకోకిలల అవ్యక్త
ధ్వనులు-చెవులకు-రుచులను- కల్పించుచున్నవి. లేక, చెవికిగాన్=చెవికోసమై,
చవుల్-విఁచున్=రుచిగల్గిన-పాటలను-వినిపించుచున్నవి, అనియు, చెప్పవచ్చును.
అంతేకాక, "నా" దముల్-కాన్="న" అనే అక్షరాన్ని "దత్తము" చేసికొన్నవి-
కాగా, వించున్=వినునట్లు చేయుచున్నవి. అనగా "(కా) వించున్" అన్నపద
మధ్యమందు "వ" కారాన్ని "దత్తం' చేస్తే, విన్చు, వినుము" కాగలదన్న చమ
త్కృతి, కూడ చర్చితమైనట్లుండును. 4 వయస్యా!-సహకార-అళివదంబున్-చూడ
గన్-"హాళి' -పాటిల్లెడున్- పోదమా!= చెలీ!-ఆ తియ్యమామిడిచెట్ల- వరుసలున్న
స్థలమును-చూచుటకు-ఆసక్తి కల్గుచున్నది (కనుక, అక్కడికి) వెళ్ళుదమా? అని
నాల్గవది చెప్పగా, 5. వయస్యా!- స "హ' కార-అళి-పదంబు-చూడగన్- "హాళి"-
ఔనే-కదా!=చెలీ! "హ' కారంతో- "అళి' అన్నపదాన్ని చేర్చి, సంధించి, చూచి
నచో 'హాళి అన్నపదం-తయారౌతోందికదా! 'హ+అళి" లేక హ+అళి =
(పదాలను సంధిస్తే) 'హాళి' అనేపదం సిద్ధిస్తున్నది గదా! అనే-చమత్కారంకూడ
వెంగలిస్తోంది. లేక, సహకార-అళి-పదంబు=బందారులమేలు కోరి సహకరించు
కొను చెలికత్తెలుండు స్థానమును, చూచినంతనే, సంతోషంకలుగగలదని కూడ
అర్థాంతరం ప్రతీయమానమగు చున్నది లేక, సహకార+అళివదంబు-చూడగన్=
తీయని మామిడి చెట్లపై చెన్నారు-తుమ్మెదలు వ్రాలిన అడుగులు, లేక భ్రమరముల
ఝుంకారములు వినగానే, సంతోషం (హాళి) కల్గుచుండునుగదా! అనియు ప్రతీత
మగును.

వి. ఇక్కడ 'చ్యుత-దత్త చిత్రములు' వాచా చెప్పబడలేదు మధ్యయుగం నాటి రాజాస్థానాలలో, పండిత గోష్ఠులలో, సరస్వతీసదనాలలో కావ్య-ప్రబంధ-శాస్త్రాలాపాలతోపాటు, గూఢ, కూట, ప్రహేళికా, ప్రశ్నోత్తర, చ్యుత దత్తాది చిత్రక్రీడయి కూడ కోకొల్లలుగా విసృష్టములై, వినోదంతో పాటు విజ్ఞానాన్ని కూడ పెద జల్లినవని, భట్టబాణ (7వ) దు"కాదంబరి' మొదలగు గ్రంథాలలో ఉట్టంకింపబడినవి. తరువాత భారవి, మాఘ, భట్టి, భోజ, శ్రీహర్షాది కవులచే సంస్కృతంలో పలువిధాలుగా ప్రచారంలోనికి తేబడినవి.

ఇట్లు, ఆలోచనామృతాలై, చమత్కార చందన-చర్చితాలై, డెందమునకు అమందానందాన్ని అందిస్తున్న, ఆకృతి సుచిత్ర కావ్యాలంకారములకు, అవరములవి, అధమములు" అని-అధమత్వాన్ని అస్పృశ్యత్వాన్ని అంటగట్టి, అణగగొట్ట జూచిన అర్థం-భవిష్ణువులచే మనగలము? ఏకో, ఎక్కడో, ఎన్నో కొన్ని శబ్దాడంబరము లుండవచ్చును,ఉన్నాయి, ఉండగలవు కూడ, ఎవరు కాదనగలరు? అన్వేషించి చూస్తే, రామాయణ, భారతాది ఆదికావ్యాలలోనేగాక, కవికుల తిలకులుగా కీర్తిగన్న కాళిదాసాదుల మహాకావ్యాలలో కూడ శబ్ద చిత్రాలంకారాలు లేకపోలేదు. ఇంకా లోతుకు వెళ్ళి చూస్తే, దేవతాస్తుతులలో, దండకాలలో ప్రతిదినం మనం పలుమారు పఠించే శ్రీ వేంకటేశ్వర సుప్రభాతాదులలో కోకొల్లలుగా, వేంమోడిగా వెల్లివొడుచుచు వెలుగొంది, వెలుగొందుచు, శ్రవణాఞ్జలి పుట పేయముగ వైచిత్ర్య, వైదగ్ధ్యముల నందించుచున్న ప్రాజ్య శబ్ద చిత్రాలంకార - సాహిత్య- సౌహిత్య-సామ్రాజ్యమునకు, మోకాలు అడ్డుపెట్టి, ఆపగలమా? మొత్తంమీద 'ధ్వని ప్రధాన కావ్యము"ల కున్నంత గౌరవము వీనికి లేదనుట నిశ్చితమైన విధానము. దానిని కాదనగల వారెవరుందురు? ధ్వని కావ్యములను అర్థంచేసుకొని, అవలోకనముతో ఆనందించు వారికంటే, నేటి కాలంలో, శబ్దాది చిత్రాడంబరాలను చేకొని, చెన్ను పరచువారు కూడ తక్కువగా నుండరని భావింపవలెను.

ఆది అక్షరాన్ని 'చ్యుతం" చేసి, అంత్య అక్షరమునకు మరొక అక్షరాన్ని "దానం" చేసిన చిత్రము.

పి. మనుజుని యాకార మహిమకు మొదలేది? నగవైరి వైరికి నగరమేది?
రాముడు గాంచిన రాక్షసపక్షేది? శిబికర్ణులార్థించు చెలువమేది?.... ........

ప్ర 1. మానవ స్వరూపాన్ని తెల్పు ముఖ్యాంగమేది? ఉ. తల (=శిరస్సు) ఇది మానవాకారాన్ని తెల్పుటచే 'ఉత్తమాంగ' మనబడుచున్నది 2. నగ-వైరి= పర్వతముల రెక్కలు విరిచి, వానికి శత్రువైనవాడు- 'ఇంద్రుడు'', వానికి వైరి=అ

ఇంద్రునికి శత్రువు రావణుడు, వాని-నగరము ఏది? ఉ. లంక (=లంకాపట్టణము) 3. రాముడు రక్షించిన క్రూరపక్షి ఏది? ఉ. కాకి (=కాకాసురుడు) (పూర్వము కాకాసురుడు, కాకిరూపమున వచ్చి, సీతాస్తనములను గోళ్ళతో గీరెను. కోపగించిన శ్రీరాముడు దానిని ఇషీకాస్త్రముతో గొట్టగా, ఆ బాధకు తాళజాలక, కాకాసురుడు రాముని శరణువేడగా, రక్షించెనని రామాయణగాథ.) 4. శిబిచక్రవర్తి, కర్ణుడు సంపాదించిన క్షేమము లేక రీతి ఏది? ఉ. కీర్తి. శిబి తన మాంసము నిచ్చియు, కర్ణుడు కవచకుండలముల నిచ్చియు, దిగంత యశోవిశాలురైరి.

వి. మొదటి ఉత్తరం 'తం' లోని ఆద్యక్షరం 'త'ను చ్యుతం చేసి, అంత్యాక్షరమగు 'ం'కు 'ంక' దత్తంచేయగా, "లంక" యై. రెండవ ప్రశ్నకు సమాధానమైనది. మరలదీని ఆద్యక్షరమైన 'లం'ను చ్యుతంచేసి. అంత్యాక్షరం "క"కి "కి' ని దత్తంచేసిన, 'కాకి" 3వ సమాధానమైనది, మరల 'కా' తీసి, అంత్యాక్షరం "కి' కి, 'ర్తి"ని చేర్చిన కీర్తియై 4 వ ప్రశ్నకు సమాధానమైనది.

N B. చిత్రకావ్యాలంకారాలలో 'క-కా, కి-కీ....' ఇత్యాదులలోని హ్రస్వ దీర్ఘములు మొదలగునవి దోషములుగా పరిగణింపబడవు

సంస్కృతానికి చాలదగ్గర సంబంధంగల తెలుగులో, ఈచ్యుత-దత్త-చిత్రాలంకారములు అయాపేరులతో అంతగా వాడబడినట్లుకన్పడవు క్వాచిత్కంగా విసిరివేయబడినట్లు చూపట్టెడివి కొన్ని అనామకాలు చిత్రకవులుగా కీర్తింపబడిన పెద్దనాదులు రామకృష్ణ,రామరాజభూషణాది కవులుగాని, ముఖ్యంగా చిత్ర కవిత్వాన్ని చిందించిన గాని,గణపవరపు వెంకటకవి మొదలగు వారుగాని,నిరివిగా, చిత్రాలంకారనామాలతో, విడివిడిగా విభిన్న రూపాలను చిత్రించినట్లు కూడ మా దృష్టిలోపడలేదు సూచ్యార్థ సూచనగా, అక్కడక్కడ విసరబడినట్లు కన్పడుచున్న వానినిమేము వ్యాఖ్యానించిన మా పూర్వ గ్రంథాలలో ఉదాహరించిన కొన్నిటిని పాఠకమహాశయులు పరిగ్రహింపగలరు.

అట్లే చేమకూర కవి మొదలగువారు నామధేయ పురస్సరంగా వివ-రింప కున్నను, తమ గ్రంథాలలో అక్కడక్కడ సూచించినట్లు కన్పడువానిని, పాఠకుల ముందుంచి, సమన్వయింపబూనిన మా సాహసప్రయత్నమును మన్నింపగలరు. ఈ "విహరించున్ ..." పద్యంలో వేంకటకవి "వి"ని చ్యుతం చేయుట, "న'ను దత్తం చేయుట, "హ" కారమును 'ఆశి'కి దత్తంచేసి కల్పుట....వలన, "చ్యుత దత్త చిత్రతను సూచించినాడనుకొనవచ్చును మచ్చునకు మాత్రము చూపినాము. గ్రంథ విస్తరభీతిచే వదలిన వానిని విజయ విలాసంలోని 1-88, 2-65, 2-167 ఆది పద్యాలలోని చిత్రాలతో గమనింపగలరు.

ఉ. ఉరుము మెరుములతో నుర్విగురియునదేది?
బంగారుతో జేయబడునదేది?
యమునిహస్తమునందు నమరు నాయుధమేది?
గుండెనీరుగ జేయుగుణమదేది?

సన్న్యాసి కింకొక్క సరియైన పేరేది? శ్రీయర్థ మిచ్చు పర్యాయమేది?
సుగ్రీవు సతిపేరు చూడనయ్యది యేది? మతి తద్భవమ్మగు మాటయేది?
నక్షత్రకోటి గన్పడు స్థానమదియేది? 'చదువు'' దీనికి మారు శబ్దమేది?

తే. రెండు వర్ణంబుల జవాబు లుండవలయు- ప్రతిజవాబులో నంత్యాక్షరంబు
దాని పై జవాబులో నాద్యమై పరగవలయు—దేవ: శ్రీ వేంకటేశ! పద్మావతీశ! వై సు.

పద్యంలో నున్న ప్రశ్నలు 10. వానికి రెండక్షరాలుగల ప్రత్యుత్తరాలు చెప్పవలెను. ప్రతి జవాబులోని ఆద్యక్షరం ''చ్యుతం'' కాగా మిగిలిన రెండవ- అంత్య-అక్షరం, తర్వాత చెప్పబోవు జవాబున కాద్యక్షరమై, దానికి మరొక అక్షరం ''దత్తం' చేయవలెనను నియమము, ప్రతిదానిలోనుక్రమంగా గమనార్హము. పద్యంలోని 2 వ ప్రశ్ననుండి 'చ్యుత దత్తా''లతో వచ్చిన ప్రత్యుత్తములు.

1. వాన, 2 నగ, 3 గద, 4 దయ, 5 యతి, 6 తిరు, 7 రుమ, 8 మది, 9 దివి, 10 విద్య- అనునవి. దీనిలో గమనింపదగిన మరొక చిత్ర మేమనగా- పై-1-10 ప్రత్యుత్తరాలలో 1వ ప్రత్యుత్తరమగు 'వాన'కు, ఆదినుండు 'వా'ను చివరి 10వ ప్రత్యుత్తరమగు ''విద్య' నుండి, అంత్యాక్షరమగు ''ద్య' ను, రెంటిని చ్యుతంచేసి, మరల మిగిలిన అక్షరాలను రెండురెండుగా కలిపి, విడదీసి చదివిన, 1 నన, 2 గగ, 3 దద, 4 యయ, 5 తితి, 6 రురు, 7 మమ, 8 దిది, 9 వివి- అను జంటలు, చక్కని శిల్పముగా నేర్పడి, దానినుండి 'గగ, దద, మమ లను సంగీతస్వరాలేకాక, తి=తిరుమల, తి=తిరుపతి-క్షేత్రాలు....మొ. విశేషాంతరాలు కూడ నేర్పడి, పాఠకులకు చిత్రకవితా మాధుర్యము వసంతముగ నదింపగలవు, పునఃపున్యముగ చెప్పుకోదగ్గ విశేషాంతరమేమనిన, ఈ పద్యం కొన్ని సంవత్సరాలక్రింద, తి. తి. దేవస్థాన ''సప్తగిరి'' పత్రికలో ప్రకటింపబడి, ప్రత్యుత్తరముల నర్థింప, ఒకరిద్దరు కాదు, 7,8 వందలమంది పాఠకులు, సకాలంలో, సరియైన 10 ప్రత్యుత్తరాలను పంపగా, వానిని పరిశీలించి, సంపాదక మహాశయులు వారి కందరికి పారితోషకము లిచ్చి సన్మానించినారట.

ఇట్టి, కష్ట, క్లిష్ట, చ్యుత దత్తాక్షరాది" పద్యానికి అడిగినదేతడవుగ సహస్రా దికంగా సమాధానాలు వచ్చినా, సకాలంలో 7–8 వందలమంది పాఠకులు పంపించి నారంటే, ఆంధ్రప్రదేశమెంత చిత్రకవితా ప్రియమైనదో తెలుస్తోంది. ఇంతకంటే క్లిష్టప్రశ్నలిచ్చినను, ప్రత్యుత్తరింపగల శ్లాఘ్య కవి – పండిత– పాఠక ప్రవరు లెందరోగలరని, పెంచి, ప్రోత్సహించి, పోషించు వదాన్యశేఖరులు, ప్రభుత్వాలు, కరువుకాకుండ మండవలెనని, మనసార కోరుకొందము.

సంగీత త్రిమూర్తులలో ఒకరగు ముత్తుస్వామి దీక్షితుల గేయరచనలు- ఆనందభైరవి రాగంలో- త్యాగరాజయోగ వైభవం, అగరాజయోగ వైభవం, రాజయోగ వైభవం, యోగవైభవం, భవం, వం' అని.

ఆయనదే ఇంకొకటి శ్రీరాగంలో శ్రీసారసపదే- రసపదే, సపదే, పదేపదే.

ఛాయాతరంగిణి గేయంలో సరసకాయే, రసకాయే, సకాయే, కాయే॥ "మాయేత్వం యాహి॥ అని పల్లవి.

ఇదే మార్గంలో శ్రీ ఎన్. పి. కృష్ణమాచార్య కృతి— "మారజననిం, ఆశ్రయే" అని పల్లవి-చరణాంతంలో "వసుమహితాం, సుమహితాం, మహితాం హితాం, తాం, అని.

సంగీతశాస్త్రంలో ఈ చ్యుతాదిప్రయోగ పద్ధతిని గోపుచ్ఛయతిఅంటారు. సమా సంతో కూడిన ఒక పదంతో ప్రారంభం ఆయి క్రమంగా పదచ్యుతిచేత సన్నబడి వస్తుంది కనుక గోపుచ్ఛయతి అన్నారు. గోపుచ్ఛము ప్రారంభంలో వెడల్పుగా నుండి క్రమంగా సన్నపడుతుంది కదా!

మరియు మహాకవి శ్రీదాసు శ్రీరాములుగారు తమ "అభినవ గద్య ప్రబంధ కవిత" గ్రంథంలో ప్రదర్శించిన 'చ్యుతచిత్రములు"

1. వసుధాధీశవిఖ్యాక, వసుధాధీశవిఖ్యాక, సుధాధీశవిఖ్యాక
   ధాధీశవిఖ్యాక, ధీశవిఖ్యాక, శవిఖ్యాక, విఖ్యాక, ఖ్యాక
2. కపీరసభామాత్ర, పీరసభామాత్ర,రసభామాత్ర,సభామాత్ర, భామాత్ర,మాత్ర,
3 తమోహరహిత, మోహరహిత, హరహిత, రహిత, హిత,
4. భవనగ, వనగ, నగ, 5. తతనయాళ, తనయాళ, నయాళ, యాళ,
6. గజపశ్రీ, జపశ్రీ, పశ్రీ, శ్రీ,

వీని అర్థములు కావలసినచో శ్రీ ప. సీతారామబ్రహ్మశాస్త్రిగారు వ్రాసినవి ఆ గ్రంథమున చూడగలరు.

"విక్రాల" వారి "మాత్రాచ్యుతక సంభవ ద్విన్నార్థ భిన్నప్రవృత్తక తద్యుగ్మ సంయోగ జన్యాంధ్ర భాషా పంచ చామర వృత్తీయు దనుష్టుప్ శ్లోక యుగ్మము!"

(అనగా-ఉన్న దీర్ఘము తోడ జదువగా, భగవత్ స్తవనరమైన అనుష్టుప్ శ్లోకములు, అందలి దీర్ఘములను "చ్యుతం"చేసి, హ్రస్వాలుగా చేసి చదువ,శ్రీస్తుతి పరమైన ప్రమాణికావృత్తములు కాగా, ఆ ప్రమాణికా వృత్తములు రెండును కలిసి, తెనుగున నొక "పంచ చామర వృత్తమైన చిత్రము .)

శ్లో॥ పయోధి కన్యకా రామా!-భయా శ్రీ భంజన క్షమా !

జయాభివృద్ధి నందానా! - వ్వయోగానందితా శ్రితా॥ వి.వే. 302

అయ ప్రసన్న పాలాభా! - హయాభాలాఽఽ పూర్ణమందురా !

జయ త్వ మహరాయాతా! – శమాన్వితాత్మ భాసురా! ॥ వి.వే. 303

N B పై రెండు పద్యాలలోని సమాన పదాలన్నీ సంబోధనములు. సుల భార్థములే. భయ+ఆ శ్రీ-భంజన క్షమా! = జంకును-బాధలను-పోగొట్టుట యందు నేర్పరీ!, అయ-ప్రసన్న-పాల+అభా=యోగ, యోగాది శుభంకర విధులచే-తేట యైన-నుదుటి-కాంతి గలవాడా! శమ—అన్విత-ఆత్మభాసురా! = మనోవిగ్రహంతో-కూడిన-జనులకు (యోగులకు) కనుపించువాడా! అహః +ఆయాతా-త్వం—జయ= విట్టూర్పులను- పొందినవాడా! - నీవు-సర్వోత్కృష్టుడవై జయమును పొందు చున్నావు! హిరణ్యకశిపుడు విష్ణువును పట్టుటకు రాగా, "యుద్ధమున నీవిని చంప రాదు" అని నిశ్చయించుకొన్న విష్ణువు, వాని నిడు—ఊర్పులలో రహస్యముగ చేరి, కనుపింపలేదని పురాణ ప్రవచనము.

"ఆ శ్రి-ఆ శ్రీ, అన్విత-అన్వితా' శబ్దాలు ఇకార,ఈ కారాంతములుగా కావ్య ముల ప్రసిద్ధములు, ప్రయుక్తములును.

పై రెండు శ్లోకాలలోని, 1, 3 (బేసి) పాదాలలోనున్న 7వ అక్షరాలగు "రా-భా, & లా-యా" లను అట్లే, సరి పాదాలలోనున్న 3 వ అక్షరాలగు" శ్రీ—గా, & భా-న్వి' ల లోని వగు, దీర్ఘాలను "చ్యుతం" చేసి, హ్రస్వాక్షరాలుగ చదువ వలెను దీర్ఘాలతో చదివినపుడు భగవత్ స్తుతి పరములైన పై రెండు శ్లోకములు, హ్రస్వములుగా చేసి చదివినపుడు శ్రీస్తుతి పరములుగా మారి, రెండు సంస్కృత

ప్రమాణికా వృత్తములగుచున్నవి. అంతేకాక, ఈ ప్రమాణికా వృత్తములు రెండును కలిపినచో, తెలుగులోనొక "పంచ చామర వృత్త' మగునవి కూడ గమనింపవలెను. ఆహా! ఏమి? ఈ "విక్రాం" వారి విక్రమ విక్షేపము !

## తెలుగులో చ్యుతదత్తచిత్రము

అర్థానకు అక్షర చిత్ర ప్రబంధం.

గీ॥ కచమునకుఁ దొ త్తి కొమ్ముఁ దెఁగంతు దనుచు-
గంధరం బాదివర్ణ విఖండమయ్యె
నొత్తుఁ గొవిపోవ గళము సద్వృత్తిఁజూపెఁదింగి
కుదమ్ము రెదిరిన విఁగె కొమ్ము. వే. ప్ర. చా. మం-734 పద్యం

1. మన్మథుడు "కచము"నకు ముందు ఉకారము (కొమ్ము) విలువ (ఈఁద)గా, =దత్తం చేయగా, "కుచము"ను, 2. కంధరములోని ఆదిమ వర్ణాన్ని (కం)ను ఖండింపగా, "ధరము" (కొండ, ధరించునది)గను, 3. మరల, యీ "ధరము" నుండి, ఒత్తును దీసి వేయగా (=ఒత్తున్-కొవిపోవ) (చ్యుతంచేయగా) "దరము" (శంఖము)గాను, 4. "కుందము' నుండి, మరల "ఉ' కారము(కొమ్ము-ఎదుర్కొని విరుగగా)"కందము' గా మిగిలిన దని భావము.

వి. 1. "కచము' నకు "ఉ' కారం దత్తం చేయగా, "కుచము" దత్త చిత్రమైనది. 2. "కంధరము' నుండి ఆది వర్ణం "కం" చ్యుతం కాగా "ధరము" చ్యుతమైనది. 3. "ఈ' 'ధరము" నుండి 'ఒత్తు"ను చ్యుతం చేయగా 'దరము" చ్యుత చిత్రమైనది. 4. "కుందము" నుండి ఉ' కారము (కొమ్ము)ను చ్యుతం చేయ "కందము" చ్యుత చిత్రమైనది.

## హిన్దీలో 'చ్యుతదత్త' చిత్రములు.

భోజరాజాదుల ననుకరించుచు, చాలామంది హిన్దీ ఆలంకారికులు చిత్రాలంకార, నియమ, వర్గీకరణములను పాటించిరి. కొందరు మౌలిక, వ్యాపక వివేచనలను కూడ చేసి, చూపించినారు

సర్వప్రథమంగా, హిన్దీలో ఆచార్య కేశవదాసు తన 'కవిప్రియా' గ్రంథంలో వివరిస్తూ, ఈ చిత్రాలంకార నిర్వాహంలో కొన్ని చిక్కులున్నవని, ఒక్కో, ఏదైనా ఒక అక్షరం తర్వాత, విసర్గ, అనుస్వారాలు (ః-ం) లేకున్నను, గురువులఘునైనా, లఘువు గురువైనను, గణ-యతి-రస-భంగాదులున్నను, దోషములుగా నెన్నరాదని,

'వ-బ'లు, 'య-జ'లు మొదలగువానికి అభేదాన్ని పాటించాలని, అంతమాత్రాన, అధికారాన్ని దుర్వినియోగం చేయక, వాని విశిష్ట నియమాలను, సునిశిత బుద్ధిబలాన్ని ఉపయోగించి, చిత్తైకాగ్ర్యంతో తన్నిషేవణం చేయవలెనను, నేను ఆ చిత్రసింధువులో ఒక బిన్దువును మాత్రమే తెలుపుచున్నానని కూడ కవి మిత్రులను హెచ్చరించెను.

కేశవ చిత్ర సముద్రమేఁ బూడత పరమ విచిత్ర!
తానే బూందక కే కణై బరతన హౌఁ సువి మిత్ర॥ కే.క. 16-1

కేశవ 'కవిప్రియ'లో 'చ్యుతదత్త చిత్రాలు' మృగమ్యములు-క్రింది కేశవపద్యం, పైకి 'మాత్రాచ్యుతక' భ్రాన్తిని పాఠకులకు కల్గిస్తుంది, కాని, వస్తుతః, అది "మాత్రాచ్యుతకం" మాత్రం కాదు.

ఏకై స్వర జహాఁబరనియే అద్భుత రూప 'అ' వర్ణ।
కహి ఏ మాత్రా రహిత సో మిత్ర చిత అఖర్ణ॥ కే క 16 7

స్వరాలు 16 వానిలో ఒక స్వరమగు 'అ'తో గూడిన రచనలో, అన్ని వర్ణాలు వచ్చినచో, దానిని 'అమాత్రికము' లేక 'మాత్రాహీనము' అంటారు, గాని 'మాత్రాచ్యుతక' మనరాదని గ్రహింపవలెను.

మూల—జగ జగమ గత భగత జన రన బన ... .......
...........హరన మదన మద మదన కహన హర॥ కే క 16_8

N.B. ఈ పద్యమునే, భగవాన్ దీన, తన 'అలంకార మంజూష'లో ఉదాహరించెను.

ఈ పద్యంలో నారాయణుడు వర్ణింపబడినాడు. దీనిలోని 'అమాత్రిక, మాత్రారహిత' పదాలు పైకి భ్రాన్తి జనకాలుగా కన్పడతాయి. వీనిని, 'ఏకస్వర, ద్వి స్వర, సర్వలఘు, సర్వగురు... ఇత్యాది శబ్ద రచనలుగా గ్రహింపవలెను

'భిఖారీ దాస'-'కావ్యనిర్ణయ'లో 'వర్ణగుప్త చిత్రాలంకార వర్ణన
పారాంతర-చిత్ర-(దోహా)

"వరన లుపే బదలే బఢై చమత్కార కహరాఇ। చి కా. 21.24.

ఒక వర్ణాన్ని లుప్తం చేసినా, పెంచినా, మార్చినా, చమత్కారాన్ని చిందిస్తే దాని అది 'పారాంతర వర్ణ లుప్త మౌతుం'దని చెప్పి, ఆదివర్ణ, మధ్యవర్ణలుప్తాలను ఉదహరించెను.

ఆది-వర్ణలుప్త-వర్ణనం (చౌ పా ఈ)
తమోల మఁగాయి ధరై ఇహి బారీ। మిలివేకీ జియమేఁ రుచిభారీ।
కన్హాఇ పిరై కబధౌఁసఖి ప్యారీ! బిహార కి ఆజు కరై అధికారీ॥

అన్య తిలక :-

సిరే కో ఏక ఏక వర్న ఛోడి పఢే దూసకో అర్థ॥ (35 అ)

మోల మంగాయి ధరై ఇహి బారీ। లీపేకీ జియమేంరుచి భారీ।

న్హాయి ఫిరై కబ ధొం సఖి ప్యారీ। హార కీ ఆజు కరై అధికారీ॥ (36)

పై 35వ పద్యం, నాలుగు చరణాలలోని అది వర్ణాలగు 'త-మి-క-బి' అను వానిని చ్యుతం చేస్తే, 36వ పద్యం లబ్ధమై, పూర్వ పద్యార్థాన్ని మార్చి, చమత్కారార్థాన్ని చిందిస్తుంది. ఉదా: "తమోల' ఆదివర్ణ లోపంతో మోల"గాను, అట్లే 'మిలిపే'-'లీపే' గాను, 'గన్హాయి'-'న్హాయి'గాను, 'విహార'-'హార'గాను, మార్పు చెంది, మరొక అర్థాన్నికూడ అందిస్తున్నాయి

వర్ణపరివర్తన:— వర్ణ బదలే, యథా-(కవిత్త)

దీనిలో ఒక అక్షరమును మార్చినంతనే, పద్యార్థమంతయు మారిపోవును.

సాజ నజ జాకో బిన మాంగే కరతార దేత,

పరమ అధీన భూమి థల దేఖియే।

దాసి దాస కేతే కరి లేత నధరమ తే,

నలక్షన నహింమతి నహర్ష అవరేఖియే।

సిం తన సిరతాజ నబన బధాఏ జ్యొం,

నకల అపై సాంచు మేం జగత జనపేఖియే।

హిందూ పతి-గున మేం జే గయే మైం నకారె తాకొం

వైరిన మేం క్రమ తేం నకారై కరి లేఖియే॥ (38)

అన్యతిలక:-

నకారాన్త కీ ఠౌర వకార కరి పఢే దూనకో అర్థ, వర్న

బఢేకో నహితేం లుప్తహి తేం జాన బీ। (38 అ)

దీనిలోని ప్రతి 'న' కారం యొక్క స్థానంలోను 'వ' కారము నుంచి, చదివిన, "చ్యుతదత్తాక్షరమై, ద్వితీయార్థం రాగలదు వర్ణం పెరిగి ఉండటకంటె ముందు వర్ణం లుప్తమై ఉన్నదని కూడా తెలియవలెను.

పద్యంలోని 'సాజ-నధరమ............" పదాల అదిలోనున్న "న" కారమును చ్యుతం చేసి, దానిస్థానంలో, 'వ' కారమునుంచిన 'వాజ-వధరమ' ... ...1 ఇత్యాది రూపములు తయారై, అర్థాంతర ద్యోతకములగుచున్నవి. ఈ అలంకారమును భిఖారీ దాసు మాత్రమే చూపెను.

డా రామశంకర శుక్ల 'రసాల' తన 'అలంకార పీయూష' గ్రంథంలో 'ప్రహేలిక'ను అర్థాలంకారాలలోచేర్చి, దాని ప్రభేదాలను వర్ణింపగా, ప్రయోగ

దృష్టితో నాలోచించిన ఆచార్యులు కొందరు, ఈ ప్రహేళికను 'వర్ణ-శబ్ద-అర్థ'-గత భేదంతో, త్రివిధంగా విభజించారు. అట్లే ఈ ప్రహేళికలయొక్క ప్రత్యుత్తరాలలో వర్ణముయొక్క త్యాగ, సమావేశ, విపర్యాయాలు కూడ ఉండవచ్చునన్నారు, కాని, వర్ణత్యాగరూప 'చ్యుతచిత్రా'లే కన్పడుచున్నవి. ఇతరములు మృగ్యములు చ్యుతాది చిత్రాలు ప్రహేళికాంతర్గతములగుటచే, భిఖారీదాసుని ఈ క్రింది ఉదాహరణలను పరిశీలించండి.

ఆది కటే తేఁసబకో సారై, మధ్యకటే తేఁ సబకో సారై।

అంత కటే తేఁ సబకో మీఠా, సోఖుసరోమైఁ ఆంఖోఁ దీఠా॥

సబకో ఉత్తర-'కాజల' (=కాటుక) అ.మం. 29 పేజి.

ఈ 'కాజల' నుండి మొదటి అక్షరాన్ని 'చ్యుతం' చేస్తే, 'జల' (=నీరు) గా మిగిలి, ఆనీరు అందరినీ రక్షిస్తుంది మధ్యాక్షరచ్యుతితో 'కా(జ)ల—కాల'గా మిగిలి, యముడు, చావు, సమయము....లను తెల్పుతుంది. మరల. అంత్యాక్షర చ్యుతివలన 'కాజ(ల)-కాజ'గా మారి, కార్య, ప్రయోజన, వ్యవసాయ, వివాహ.... ఆదులను తెల్పుతుంది-అవి అమీర్ ఖుసరో యొక్క ప్రత్యేకదృష్టి.

N B. 'కాజల'కు బదులుగా, దాని పర్యాయపదాన్ని ఉంచితే, ఈ అర్థాలు రావు గనుక, ఇది 'శబ్దగత-చ్యుతచిత్ర' మగుచున్నది.

2 అర్థగతప్రహేళిక- లక్ష్మీపతికే కర బసై.పాంచ వరన గని లేవ।

పహిలో అక్షరఛోడికై-ఆయహమైఁకినదేవ॥ ఉ. దర్శన.

విష్ణువు చేతిలో 'సుదర్శన' (లేవ) చక్రమున్నది. దాని మొదటి 'సు' వర్ణాన్ని చ్యుతంచేస్తే, 'దర్శన' లభ్యమౌతుంది.

N.B. కేశవదాసు తర్వాత భిఖారీదాస, కాశీరాజ, డా. రసాల, జగన్నాథ, జానకీ ప్రసాదాదులు కొన్ని చిత్రప్రభేదాలను విశ్లేషించి, ప్రకటించినారు గాని, ఆ గ్రంథాలు నేడు మృగ్యములై యున్నవి.

N.B. ఒకవో, ప్రత్యుత్తరంలోని వర్ణాలను గొలుసునందువలె, క్రమంగా మొదటి వర్ణానికి, తర్వాతనున్న ఒక్కొక్క వర్ణమును కలుపుకొనుమున్నచో, క్రమముగా, అన్ని ప్రశ్నలకు సమాధానములు రాగలవు. క్రింది కేశవదాసు ఉదా: ను దయతో పరిశీలించండి

కో శుభ అక్షర?, కౌన్ యువతి యోధన వశ కీన్హి? ।

విజయసిద్ధి సంగ్రామ రామ కహఁ కౌనే దీన్హీ॥

కంసరాజ యదువంశబసత కైసే కేశవపుర।

బట సోం కహియే కహా నామ జానో అవనే ఉర ॥

కహి కౌన జనని వద జగత కీ కమల నయని కంచనబరని।
సుని వేద పురానన మేఁ కహి సనకాదిక "శంకరతరుని" ॥ కే.క. 16-53

కేశవదాసే సర్వప్రథమంగా దీనిని వివరించెను ఈ ప్రశ్నలన్నిటికి సమస్త ప్రత్యుత్తరం "శంకరతరుని" అనియే. ఎట్లు.

ప్ర. 1. శుభాక్షరమేది? ఉత్తరం. 'శమ్' ఈ అక్షరం 'శుభా'న్ని తెల్పుతుంది.

2. ఏది యోధులను స్వాధీనం చేసుకొనును? ఉ శంక (=భయము)

3. శ్రీరామునికి విజయ సిద్ధినిచ్చిన దెవరు? ఉ. శంకర (=శివుడు)

4. కంసుని రాజ్యమున యదువంశ మెట్లుండెను? ఉ. శంకరత (=సందేహస్థ)

5. వట (మఱి) వృక్షానికి మరొక పేరేమి? ఉ 'శంకరతరు'-అనియే.

6. కమలాక్షి, కాంచనవర్ణియగు జగన్మాత ఎవరు? ఉ. శంకరతరుని (=పార్వతి)

దీనిలో క్రమంగా వర్ణదత్తత కన్పడుచున్నను, అర్థాంతరములేనందున, ఇది 'వ్యస్త-సమస్తోత్తరము'నకే ఉదా: కాగలదు కాని, దత్తచిత్రము మాత్రము కాదు.

ఇట్లే, క్రింది బిఖారీదాసు-ఉదా: లో, దీనికి విరుద్ధంగా, సమస్తోత్తరపదం లోని, రెండు మూడు వర్ణాలను, పదాలను, వ్యస్తరీతిలో (విడివిడిగా)ను, సమస్త రీతిలోను దత్తంచేసి చదివిన, అంతమాత్రాన, అవికూడ దత్తచిత్రాలు కాజాలవు, అవికూడ 'వ్యస్త సమస్తోత్తరములు' మాత్రమే.

కౌన దుఖద, కో హంస సో, కో పంకజ-ఆగార।
తరున-జనన కో మనహరన కో, కరి చిత్త విచార ॥
కౌన ధరే హై ధరని కో, కో గయంద-అసవార।
కౌన మృడానీ కో జనక హై, "పరబత పరదార" బి.కా. 12, 13.

పద్యంలోని 7 ప్రశ్నలకు "పరబతపరదార" ప్రత్యుత్తరమగును ఎట్లు?

ప్ర. 1. దుఃఖము నిచ్చు వాడెవడు? ఉత్తరం : పర (శత్రువు)

2. హంసతో సమానమైన పక్షి ఏది? ఉ. బత (బాతు)

3. పద్మాకరము ఏది ? ఉ. సర (సరస్సు)

4. యువతుల మనస్సును హరించునదేది? ఉ. దార (నారి, లేకస్త్రీ)

5. భూమిని ధరించునది ఏది? ఉ. పరబత (పర్వతం, ధరాధరం, కొండ)

6. ఏనుగునెక్కి తిరుగువాడెవడు? ఉ. పరదార (నాయకుడు)

7. పార్వతి తండ్రి ఎవరు? ఉ. పరబత పరదార (పర్వత-రాజు, హిమవంతుడు)

సమస్తోత్తరమైన 'పరబద సరదార'ను రెండు రెండు అక్షరాలుగా విడగొట్టి, వ్యస్తరీతిలో 4 ప్రశ్నలకు, మరల నాలుగు వర్ణాల పదాలతో వ్యస్త రీతిలో 5, 6 ప్రశ్నలకు, చివరి 6వ ప్రశ్నకు మాత్రం సమస్త రీతిలో ప్రత్యుత్తరం చెప్పబడినది. ఇక్కడ మొదటి ప్రత్యుత్తరమగు 'పర'కు 'బత' అను రెండక్షరాలు, తర్వాత కూడ ఇట్లే దత్తం చేసినట్లు పైకి కన్పడుచున్నను, ఇవి 'దత్త చిత్రములు' కాజాలవని తెల్పుటకే ఉదాహరింపవలసి వచ్చినది.

పై రెండు ఉదా : లను పరిశీలించినచో, కేశవ-భిఖారీదాసుల లక్షణాలు భిన్నములని గమనింప గలము. తర్వాతి హిందీ ఆలంకారికులలో కొందరు కేశవ దాసును, మరికొందరు భిఖారీ దాసును అనుకరించినట్లు కన్పడగలదు. ఇంతేకాక, భిఖారీదాసుచెప్పిన, ఈ క్రమ'వ్యస్త-సమస్తోత్తరాలంకారము'కేశవదాసుచే'వ్యస్త-సమస్తోత్తరములో అంతర్గతము కాగలదని కూడ భావింపవచ్చును.

**పాశ్చాత్య (-ఆంగ్లాది) భాషలలో 'చ్యుత-దత్త' చిత్రములు.**

సాధారణంగా పాశ్చాత్యులు 'సాహిత్య' పదానికి సమానార్థకంగా, పరిమితార్థంలో Poetry పదాన్ని, విశాలార్థంలో Literutnre పదాన్ని వాడతారు. వారు గద్యాన్ని కూడ పద్యంతోపాటు Poetry అని పిలువరు. Poetry అనగా 'అనుభూతిని వ్యక్తీకరించునది' అని వారి సరికొత్త నిర్వచనము.

సంస్కృత భాషలోవలె విశేషంగా లేకున్నను, పాశ్చాత్యభాషల్లో కూడ, చిత్ర కావ్యం (Figurative Poetry), Imagist poetry ఆకృతినిదాల్చి, బాగుగా అభివృద్ధి చెందిన దనవచ్చును. వానికి, చిత్ర కవితకు సంబంధించిన, కొన్ని సామాన్య విషయాలను సంగ్రహముగా ముచ్చటింతుము.

ఒక విశేష వస్తువును ఒక విశిష్టక్రమంలో, పద్యరూపంలో, వర్ణించుట వలన, ఆయా వస్తువుల యొక్క చిత్రాలు తయారు కావడం, ఈ చిత్ర రచనలోని విశిష్టత. ఉ: ఖడ్గ, సర్ప, ధమర్బంధాదులు, క్రీస్తు మహాశయుని శిలువను, మదిరా పాత్రను, వర్ణించిన పద్యాలు, వాని రూపాన్ని ధరించి, ప్రత్యక్షమౌతాయి. ఇట్టి చిత్ర రచనలో "డార్మెన్ ఫిగరెతమ్" పేరుతో రచింపబడి, యూరప్‌లో పూర్వం

కొన్ని ప్రచురింపబడినాయి గ్రీసు దేశంలో వీనిని "టెక్నోపెగ్నియన్" అని పిలుస్తారట. అయితే, సంస్కృతమునందున్న చిత్రభేద, ప్రభేదాలు గాని, ఉదాహరణ ప్రత్యుదాహరణాలుగాని, పాశ్చాత్య సారస్వతంలో ప్రబలంగా కన్పడవు. అంతే కాక, వానిని కేవలం అదృష్టితోనే అన్వేషించడం కూడ అందరికి సాధ్యమయ్యే పనికాదు కష్టసాధ్యంకూడ, అనన్యంగా ఆవిర్భవించిన ఆంగ్లభాషలో కూడ వీని ప్రయోగం అల్పంగానే కన్పడుతుంది. పాశ్చాత్య భాషలలో అలెగ్జాండరు కాంల మండి, వైటింగేర్ గ్రుడ్డు, గొడ్డలి మున్నగు ఆకార బంధాలు, విలోమాది కవిత్వాలు కూడ ఉన్నట్లు, A.B. కీత్ మహాశయుని సంస్కృత సాహిత్య చరిత్ర చాటి చెపుతోంది.

సంస్కృత ప్రహేళికను పాశ్చాత్యులు Riddle Puzzle అంటారు. జనసామాన్యంలో పుట్టిన దీనికి, సాహిత్యక్షేత్రంలో కూడ సమ్మానం లభించింది. సాధారణ జీవన-అనుభూతి, వైజ్ఞానిక ప్రయోగాలలో నున్న ప్రహేళికలలోని ప్రశ్నోత్తరాలు, కథలలో, నవలల్లో, నాటకాలలో కూడ నడయాడుతూ వచ్చాయి. ఇటలీ, గ్రీసుదేశాలలో, వీనిద్వారా సారస్వత సమాలోచనలుకూడ జరుగుచున్నాయి. కొందరీ కళను పద్యాలలోనేగాక, గద్యాలతో కూడ గద్దెనెక్కించారు. ఈపద్యాత్మక ప్రహేళికలు స్పెయిన్ దేశస్థుల కెంతో వినోదాన్నేగాక శిక్షణను కూడ చేకూర్చినవట, 11-13 వ శతాబ్దాల మధ్యలో ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిన్ దేశాలయొక్క కొన్ని ప్రాంతాలలో, అద్భుతధారాశక్తి గల్గిన Troubu dow అన్నకవులు కొందరు, మనభట్రాజులవలె, వీరగాథల నాశువుగా గానం చేసేవారట. Karl Mikael Bellman అను కవీశ్వరుడు స్వీడన్‌సానుస్కుల్లో, 'గితార్' వాయిస్తూ, ఆశ్చర్యకరంగా ఆశుపద్యాలను చెప్పి జనులను అలరింపజేసేవారట. మన యక్షగాన-జక్కులవలె, కొందరు పాశ్చాత్యకవులు భుక్తికొరకు, చిత్ర, చాటు కవితం నొక వృత్తిగా పెట్టుకొని, వినోదక్రీడలతో ప్రజారంజనం, కాలక్షేపం కల్గించేవారట! అయినా, మొత్తంమీద Extempore Poetry ని పాశ్చాత్య సారస్వతం అంతగా ఆదరించినట్లు కన్పడదు.

"చియాలోస్కురో" పేరుతో ఇటలీలో వచ్చిన కొన్నిరచనలు స్పష్టంగాను, అస్పష్టంగాను కూడ ఉన్నవి. చిత్రకళ ద్వారా చిత్రంగా ప్రచారం పొందిన, ఈ

శైలిగం రచనలలో, చీకటి-వెలుగుల, ఆశ-నిరాశల, సమ్మేళనం ఉంటుంది. గ్రీసులో కేవలం క్రీడా గోష్ఠి-వినోదముల కుపయోగపడెడి "పెగ్నియా" కవిత, అనేక-రూపాలు ధరించింది. అనులోమ-విలోమరీతిలో నొకటిగా కన్పడెడి, పద్య-పాద- క్రమకాలము, Palindrome అనబడిన కవితకు, 1 Able was I ere I saw Elba" (నెపోలియన్ చక్రవర్తి తనపతనానంతరం చెప్పుకొన్న వాక్యం), 2."Madam I' am Adam' (Adam తనను పరిచయం చేసుకొనుచు, Eveతో చెప్పె-), 3. Was it a car or a cat I saw" మొ. ఉ దా. లు. వానిని వెనకకు (విలోమంగా)త్రిప్పి చదివినప్పటికి రూపభేదము కన్పడదు.

Latin భాషలో కూడ కొందరు కవులు పద-పద్య క్రమకాలము ప్రదర్శించారు మరి కొందరు, అనేక భాషలు గలిపిన 'భాషా సముక' పద్యాలు వ్రాసి, లోకులను వినోద పూర్ణ మనస్కులను చేసేవారట. ఈ 'భాషాసముక నాటకా'లెన్నో ఎన్నో పార్లు ప్రాముఖ్యరంగస్థలంపై రాణకెక్కాయట! 15వ శ. లో, జర్మనీలో 'క్రెటిన్' అను కవి, తన విచిత్ర- జటిల-పద్యాలతో, అంత్యానుప్రాసంతో, నొక ధన్య శైలిని ప్రచారంచేయగా, తర్వాత చాలమంది, ఒక విశిష్ట పద్ధతిలేని, కుత్సిత కవితలు కూడ, బయలు దేరినవి. 19వ శ. అంతంలో జర్మనీలోనే "బుటజెన్ గోయిటెన్‌లిరిక్" అను పేరుతో జనప్రియ కవిత్వమొకటి ప్రచారంలోనికి వచ్చినది.

ఆంగ్లేయ 'లిమరిక్' పద్య ప్రక్రియ యందును క్రీడా వినోదములున్నవి, ప్రాయశః ఇవి చిన్నగీతములు. ఈ Light verseలో అప్పుడప్పుడు, వ్యత్యం పార్శ్వ జనిత. అచరణలు, ఆలోచనలు కూడ ఉట్టంకితములగుచుండును. మిల్టన్, గేటె, షేక్స్పియర్....."వంటి మహాకవులు కూడ, ఇట్టి కవితలల్లిరి. బెనిసన్ మొ. కవులు అను ప్రాసబద్ధ రచనలలో రాణకెక్కినవారు. 20వ. శ. ప్రారంభమున "అమీ లావెల్" అను కవి, వచ్యాంశము, ధ్వని, లయ, అను ప్రాసాదులనన్నింటిని సమ్మిళితం చేసి, పోలిఫోనిక్ ప్రోజ్, అనే పేరుతో, ఒక విచిత్ర, బహుధ్వనీయ గద్యము కూడ సృష్టించి, గణనకెక్కినారు. దీనిని చదువుట వలన, మనము ఆకవి-యొక్క క్రోధహర్షాలను, ఆశనిరాశలను, అతని అభిరుచిని, ఆశయాలను కూడ సులభంగా తెలిసికొనగలము.

ఇంకా కొంచెం అంతర్మథనం చేస్తే, డ్రైడెన్ (17శ) యుగం నుండి ఆంగ్ల కవిత్వం ఆశయాలను మారి, నూతన ప్రయాణం సాగిందిన్నట్లు కన్పడుతుంది.

బుద్ధి గజ్జెకట్టి గద్దెనెక్కింది భావనను బైటికి నెట్టింది. వచనం వని కవిత్వమే చేయటం మొదలు పెట్టింది. అప్పట్లో, స్పెన్సరు కల్పనాలోకం, మిల్టను స్వర్గ నరకాలు కూడ సొమ్మసిల్లాయి. తర్వాత పోపు (18శ) యుగం (Neo clasical age)లో భావన, ప్రతిభాపాటవం పాతబడటంతో, శబ్దవ్యామోహం, రీతి ప్రీతి, డొంక తిరుగుడు వ్యవహారం శ్రుతిని మించి, రాగానపడింది. నిసర్గసుందర జానపద జీవితం కంటె, నగరసమాజ చిత్రణ నాజెంగా భావింపబడింది. తెలుగులో 'సిత' కు బదులుగా, "కదలి మొలనూలి చేడియకన్న పదతి" అని వాడి, శిరోవేష్టన ప్రాణాయామంచేయించినట్లు, వారు కూడ 'Bird'కు బదులుగా "The feathered inhabitant of the air' వంటి డొంక తిరుగుడు చిత్రధోరణిలో చెప్పినారు.

శబ్దాడంబరవ్యామోహం చెంగలించడంతో, చమత్కార, పాండిత్య, వైచిత్ర్య ప్రకర్షలు కవిత్వానికి నికషోపలాలైపోయినాయి. ఇక క్లాసికల్ కవిత్వకాలంలో బాహ్యాలంకారంగా భావింపబడిన Imagery కాల్పనిక కవితలో ప్రధానమై, ఆత్మ స్థానాన్ని ఆక్రమించుకొన్నది పీరి భావచిత్రాలు హృదయంగమాలుకాగా, ఊహా చిత్రాలు బుద్ధికి పదును పెట్టినవి. కాల్పనిక కోద్యమం తర్వాతి "విక్టోరియనిజం" కూడ, గతాను గతికమై, గతించింది. ప్రతిక్షణం పరిణతి చెందుచున్న ప్రజాభిరుచులను ప్రతిబింబించజాలని "ఎడ్వర్డియన్, జార్జియన్" యుగాలు కూడ క్రమంగా దిగజారిపోయినాయి. పీటి సన్నిధిని వెనుకకు నెట్టుకొంటూ వచ్చిన హ్యూమ్, ఫ్లింట్, ఎజ్రాపౌండు....మొ. ఇమేజిష్టు కవుల రచనలు కూడ క్రమంగా అంతర్ధానం కావొచ్చినవి. తర్వాత కాల్పనికోద్యమాలకు నిరసనగా అనేక వాదాలు, ధోరణులు ప్రబలినాయి. 19,20శ.లో ఫ్రెంచి, ఇంగ్లీషు కవితా రంగాలలో వెలువడిన సర్రియలిజం సింబాలిజం....మొ. ధోరణులు కూడ పాశ్చాత్య సాహిత్యరంగంలో, ప్రభంజనంలా వీచి, వస్తువులలోనే కాక, శబ్దప్రయోగాలలో, భాషలో, భావవైభరులలో, ఛందస్సులో కూడ అపూర్వమూ, గూఢమునైనవైవిధ్యాన్ని వక్రోక్తి మార్గంలో వ్యక్తీకరించాయి.

ఈ వక్ర, గూఢ పద్ధతిని ఆంగ్లంలో Oblique లేక Enigmatic అంటారు దీని అర్థం "సూటిగానున్న మార్గాన్ని విడిచి, చిత్రమార్గం ద్వారాచిత్రించటమన్న మాట "That which diverges from a straight line" Jhonson. కనుకనే "Style is the drees of thought' అన్నాడు పోపుమహాశయుడు.

ఈ పాశ్చాత్య నప్రియలిఖానికి, సింబాలిఖానికి చిత్రకవిత్వంతో కొంత సంబంధమున్నది. వీరి చిత్రాలలోని సంజ్ఞలు కూడ మన నత్త్వ శాస్త్రాలతో ముడివడి గూఢంగా నుండుట వల్లగాబోలు, నద్య :- అర్థ స్ఫూర్తినీయక, ధిషణా కషణం చేస్తూనే ఉంటున్నాయి.

అక్షరచిత్రానికి సంబంధించి, మనభాషలలో లేని 1. Anagram 2. Acrostics 3. Telestich మొ॥ వానివి గూర్చి, మాన్య ుత్రులు S V U మాజీ కులపతులు, ఆ చార్య బి. ఎన్. రెడ్డిగారు అభూత పూర్వంగా అన్వేషించి, తమ 'చిత్రకవిత్వ' విమర్శన వ్యాసరాజంలో తాము పరిశోధించిన ఎన్నో విశేషాలను తెల్పినారు. Anagram అనగా 'పదంలోని వర్ణక్రమాన్ని మార్చి, అసలు పదానికి సన్నిహితార్థంకల (గూఢంగానున్న) మరొక పదాన్ని కల్పించడం, ఉదా : Astronomer నుండి Moon, starer, Telegraph నుండి Great, help, presbyterian నుండి best in prayer ........ వలె. (తెలుగులో 'పాదపము, నుండి-పాదము, పాము, పాద, తదపా....లను కల్పించినట్లు) గ్రీకు, లాటిన్ భాషలలో గూడ ఇటువంటి Anagrams కొన్ని ప్రచారంలోనికి వచ్చాయి. 'బైబిల్' లో Pilate ఏసుక్రీస్తు నడిగిన ప్రశ్న "Quid est veritas" (what is truth). దీనికి క్రీస్తు సమాధానం 'est vir qui adest' (It is the man who is before) N.B. దీనిలో, ప్రశ్న వాక్యంలోని వర్ణాలే, సమాధానవాక్యంలో (గూఢంగా) ఉండటం గ్రాహ్యవిషయం. ఇట్లే మిగిలినవానిలో కూడ.

పాశ్చాత్య భాషలలో ప్రహేలికా ప్రభేదాలగు, నీచ్యుత దత్తచిత్రము'ల కొరకు అన్వేషించటం, ఆంగ్లాది ఆచార్యుల కడకేగి, వవినయంగా, సంభాషించటం కూడ చాలసార్లు జరిగింది. ప్రత్యుత్తరం మాత్రం 'న' కారాత్మకమని తెల్పుటకు బాధపడుచున్నాము.

పైన చూపిన Anagram మొదలగు అక్షరచిత్ర సంబద్ధరచనలకు, 'చ్యుత దత్తచిత్ర' రచనలకు 'అంతరం మహదంతరం'. ఇవి, ఈరూపంలో మనభాషలలో కన్పడకపోవచ్చును గాని, సంస్కృతాది భాషలలోని 'చ్యుతదత్త-చిత్రా'లకు వీనికి కల సంబంధమును, లేదాను ఊహింపవచ్చును, మరియు, ధ్వని ప్రతిష్ఠాపనాచార్య-ఆనందవర్ధనుని "దేవీశతకంలోని 'ఖ్యాతి కల్పన దక్షైకా ..." (ఆ.దే. 95)

పద్యంలో "రేఫవివర్తనతో", పదంలోని వర్ణక్రమాన్ని మార్చి, మరొక పదాన్ని సృష్టించి, అర్థాన్ని సమన్వయించడం కూడ జరిగింది. వివరములు ("మా 'గూఢ చిత్ర రహస్య ప్రకాశిక" 106, 107 పేజీలలో) చూడగలరు.

ఇట్లు పాశ్చాత్య భాషలలో మృగ్యాలైన "చ్యుత-దత్తాదిచిత్రాలను" ఆంగ్ల విద్యాధికులకుకూడ అందజేయుటకై, గత్యంతరము గానక, సంస్కృతోదాహరణములనే అంగీకరించి చూపుటకు ప్రయత్నించుచున్నామని మనవి.

# ఆంగ్లాది పాశ్చాత్య భాషలలో చ్యుతదత్త చిత్ర వివరణ

In the cyuta riddles, it is in Particular, a part of aword (a metrical unit, a syllable, a particle etc ) which is dropped from the verse in some cases, however, a part of the word can be added to the verse or parts of words can be dropped and other parts added. In this case, these remind to-day's anagrams.

Bhamaha notes that riddles (Prahelika-s) employ yamaka and obscure the meaning of senthnces by the variety of root meanings,...that with out a commentary they are incomprehensible, & that they are a source of pleasure for an intelligent man but put to shame a fool. Mammata does not mention riddles and discusses only Citrakavyas. Rudrata only mentions them. But Viswanatha (16 C) refuces to prahelika-s a place in alamkarar-s, since they 'are opposed to Rasa,'' & he mentions 'చ్యుత దత్తాది'...., where a syllable is missing (cyutaKshara). where a sy able is added (Dattashara), and where a syllable is missing and another added (cyctadattakshara).

(రసస్య పరిపంథిత్వాత్-నాలంకారః ప్రహేలికా ॥సా. ద. 10.3
ఉక్తి వైచిత్ర్యమాత్రం సా చ్యుతదత్తాక్షరాదికా )

With the dropping or adding of 1) a half or 2) full syllable. 3) Bindu 4) V sarga 5) Akshara 6. Sthana and 7) Cyutadattakshara (where some akshara-s were dropped and some added), and it is necessary that we should arrange the words such

manner that even after such dropping or placing, the metre of the verse is not affected With these droppings and addings, the poetic curiosity can be aroused in a particular verse with a vast difference in the meaning with a slight change. Both these droppings and placings are only two facets of onething.

పయోధరభరాక్రాన్తే విద్యుల్లేఖా విరాజితే,
కాన్తః సర్వజనాభీష్టః బాలేన్దుః ఖే న లభ్యతే.

In the sky over cast with clouds and marked with the streaks of lighting, is the newly risen moon, beautiful, and the dorling of all, not attainable.

Here in 'బాలేన్దుః ఖే న లభ్యతే' (The new ly risen moon is not available in the sky). If we drop the nasal letter 'n' (న్), conjunct with the glide 'దు' in 'బాలేన్దుః', Quite a different meaning is produced in బాలే దుఃఖేన లభ్యతే(ohgirl) the lover (కాన్తః) is to be attained with difficulty) (another meaning),

With the loss of the nasal 'n=న్' her half a syllable is lost, but generally speaking, it can be said to be a case of the dropping of a Bindu or an అర్ధమాత్రా or a consonant (వ్యంజన) also. ∴This is an example of అర్ధమాత్రా (వ్యంజన) and బిందుచ్యుతక.

మహాశయ మతిస్వచ్ఛం నీ (న) రం నంతాపశాన్తయే ।
ఖలవాసా దతిక్రాన్తాః సమాశ్రయత హే నరాః॥

Here the dropping of a full syllable 'ఈ' (ఈ) in the word Nīram (నీరమ్ = water) leaves out the word 'Naram' (నరం = man, ie. 'నీరం' with the change of vowel 'ఈ' becomes 'నరం') and consequently gives a new twist meanings.

1. O people. fatigued of laying on the earth in summer, take to water, good and clear for removing your heat.

2. Other meaning · O people, vexed of living with the wicked take recourse to a man, noble and clean, for removing your heat.

**This is an eg of the dropping of the full syllable.**

It is to be noted that other words in the particular verses are so used as to give double mean ng in the case of the dropping of a syllable etc., and here the pun comes into play.

అగస్త్యస్య మునేః శాపాత్-బ్రహ్మస్యన్దన మాశ్రితః
మహానుః ఖాత్ పరిభ్రష్టః నహుషః సర్పతాం గతః ॥

As for the dropping of visarga, in the word 'మహానుః' (=high-souled), it is remarkable that the word left ('మహాను') associates with the following word 'ఖాత్' (=from heaven), making a separate word 'మహానుఖాత్' (=from the great pleasure), giving a turn in the meaning of the verse.

"Nahusha, having boarded the chariot of Brahma on account of tne curse of Agastya, fell from the sky and took the form of a serpent."

The other way, "fell down from a great pleasure" instead of fell from the sky.

అక్షరచ్యుతక : A verse composed in such a manner that it describes one object as it stands, and another object if a certain letter is dropped.

మహానపి సుధీరోఽపి బహురత్నయుతోఽపి సన్ ।
విరసః కుపరీవారో నదీనః కేన సేవ్యతే ? ॥

This verse describes at once, 1. 'నదీనః' (నదీనాం-ఇనః)= the ocean and 2. 'దీనః' (=a miser, లోభి).

1. 'నదీనః' though expansive, unpathamable and possessing several gems, the ocean which encircles the world, is tasteless and is not resorted to any body (for water).

2. (Other meaning) 'దీనః' - though great, very heroic, and rich with many gems, the miser who is uncultured and followed by worthless men is resorted to any body.

Here the 'Na' (న) from the word 'నదీనః' is dropped, as it making a different verse altogether.

N. B : This dropping of the letter can be of the middle one, or of the penultimate or last one Ex నగర న(గ)రః etc.

The dropping of the place (స్థానచ్యుతక) . Under this category, words l ke the subject, predicate etc. Change their places and the prose order becomes difficult.

హరః క్షయీ తాపకరః సురేశః గాంగో హరి . గోత్రరిపు. వివస్వాన్ ।
చక్రోరి ద్విజిహ్వాశ్రిత ఇ త్యుపేక్ష్య-లక్ష్మ్య వృతః పాతు విధి ర్జగన్తి॥

God siva is dependent on equivocaters (other wise. serpents), the moon wanes, the sun is a heat scorcher, Brahma is sexually in capable (otherwise peace loving) and Indra is the enemy of his own people : therefore. Lakshmi having ignored these, chose Vishnu who may protect the worlds.

Among the adjectives, 'ద్విజిహ్వాశ్రితః' (= one depending on equivocators) qualifies హరః, 'క్షయీ' (= one prone to waning) చంద్రః, తాపకరః (= one giving heat) వివస్వాన్, గాంగః (= one sexually debitious) విధిః and గోత్రభిత్ (= foe of one's own kinsmen) సురేశః.

This gives the key to the normal prose order. This kind of riddle is similar to, oreeven identical with, the శ్లిష్టార్థచ్యుత type of కూట.

In the like manner, the dropping or placing of a letter in a word can be a ternate. This is in one and the same word, some letter is dropped and some other letter is kept in its place instead:

పూర్ణచంద్రముఖీ రమ్యా కామినీ నిర్మలాంబరా ।
కరోతి కస్య న స్వాన్తం ఏకాన్త మదనాతురమ్ ? ॥

Whose the charming damsel with a face like that of the full moon, and having while sari, does not brighten heat which is highly inquisitive for love"

(The other way : The pleasunt night, having as its face, the full of moon and having a clear sky...)

Here, by dropping the initial letter 'కా' of 'కామినీ' (= damsel, కన్య) and placing letter 'యా' in its position, making the word, 'యామినీ' (= the night). Also certain words like పూర్ణచన్ద్రముఖీ, నిర్మలామ్బరా etc. have two meanings, and herce are app icable in both cases. But to illustrate a slightly different variety :

కూజన్తి కోకిలాఃసాలే యౌవనే ఫుల్ల మమ్బుజమ్ ।
కిం కరోతు కురఙ్గాక్షీ వదనేన నిపీడితా ? ॥

The kckilas chirp on the sala (సాల) tree, the lotus blooms in youth, what may the fawn-eyed lady do, distressed as she is by the face.

In this verse, the letter 'ర' of the word 'రసాలే', is dropped, and letter 'యౌ' is placed in the word 'వనే', the dropping and placing of both being in the beginning of the words concerned. In the second half, the initial letter 'మ' of the word 'మదనేన' is dropped, and letter 'వ' is placed there making the word 'వదనేన' to dupe the reader.

With these droppings & additions the sense of the verse was changed. Then : the kokilas warble on the mango tree (రసాలే), the lotus blooms in water (వనే), what may the fawn—eyed lady do, oppressed as she is by cupid.

The cyuta-Dattas are peculiar to Sanskrit and similar riddles do not exist in other larguages. An English translation of such riddles can not even convey often the intent and spirit of these riddles. In many cases they are in comprehensible and, in general, they can not be solved even by sanskrit pandits with out any టీకా.

# ఉపయుక్త గ్రంథకర్తల-గ్రంథనామ-సంకేత సూచిక

సంస్కృతమ్

| కవి | గ్రంథనామమ్ | సంకేతమ్ |
| --- | --- | --- |
| వేదవ్యాస | అగ్నిపురాణమ్ | అ.పు. |
| అమరసింహ | అమరకోశమ్ | అ కో. |
| అజితసేనాచార్య | అలంకారచిన్తామణి | అ.చి. |
| కర్ణపూర | అలంకారకౌస్తుభమ్ | అ. కౌ. |
| శ్రీ కృ. బ్ర. పరయతి | అలంకారమణిహార | అ.మ. |
| అవతారకవి | ఈశ్వరశతకమ్ | అ.ఈ. |
| | ఋగ్వేదమ్ | ఋగ్ |
| క్షేమేంద్ర | కవికంఠాభరణమ్ | క.కం |
| దేవేశ్వర | కవికల్పలతా | దే.క. |
| అమరచంద్రయతి | కవికల్పలతావృత్తి : | అ క. |
| విశ్వేశ్వర | కవీంద్రకర్ణాభరణమ్ | క.క. |
| బాణభట్టు | కాదమ్బరీ | బా.కా. |
| మమ్మట | కావ్యప్రకాశ | కా ప్ర. |
| రాజశేఖర | కావ్యమీమాంసా | కా.మీ. |
| దండిమహాకవి | కావ్యాదర్శమ్ | కా.ద. |
| వాగ్భట& హేమచంద్ర | కావ్యానుశాసనమ్ | వా.కా.& హే.కా |
| రుద్రట | కావ్యాలంకారకు | రు.కా. |
| భామహ | కావ్యాలంకారము | భా.కా. |
| భారవి | కిరాతార్జునీయమ్ | భా.కి |
| అప్పయ్య దీక్షిత | కువలయానన్దమ్ | అ.కు. |
| సంకలనమ్ | చాటుధారాచమత్కారసార : | చా.చ. |
| చక్రకవి | చిత్రరత్నాకర : | చ.చి |
| ఆనందవర్ధన | దేవీశతకమ్ | ఆ.దే. |
| విద్యానాథ | ప్రతాపరుద్రీయమ్ | వి.ప్ర. |
| వ్యాస | మహాభారతమ్ | మ.భా. |
| జగన్నాథపండిత | రసగంగాధర | జ.ర |
| వేంకటాధ్వరి | లక్ష్మీసహస్రమ్ | వేం.ల. |
| గొల్లాపిన్ని మల్లికార్జునసూరి | వాసుదేవానందః | గొ.వా |

| | | |
|---|---|---|
| ధర్మసూరి | విదగ్ధముఖమణ్డనమ్ | వి |
| విక్రాల శేషాచార్య. | వేంకటేశ్వరచిత్రరత్నాకరమ్ 1,2,3, భాగములు | వి |
| భోజ | సరస్వతీ కంఠాభరణమ్ | స.కం. |
| రుద్రదేవత్రిపాఠి | సం.సా.శబ్దాలంకార | రు.శ. |
| విశ్వనాథ | సాహిత్యదర్పణమ్ | సా ద. |
| డా. రామశాస్త్రి & సీతారామశాస్త్రి | సీ.రా.యుగి, ఉత్తరభాగ, అభినవ సీ.రా | సీ రా.యు |
| సు.గుప్త సంకలనము | సుభాషిత సుధారత్న భాండాగార | సురభాం. |
| తెలుగు | | |
| అప్పకవి | అప్పకవీయమ్ | అ.క |
| నారాయణరెడ్డి | అ. అం. శ.సం ప్రయోగసూచి | నా.అ |
| వేటూరి ప్రభాకరశాస్త్రి | చాటుపద్యమణిమంజరి 1.2భా | చా.మ. |
| గాదెధర్మేశ్వరరావు | తెలుగులో చిత్రకవిత్వము | తె చి. |
| అడుసుమిల్లి నారాయణరావు | నారాయణీయము | అ నా. |
| గణపవరపు వేంకటకవి | ప్ర. వే.విజయవిలాసము | గ. వేం.వి. |
| వేదులసూర్యనారాయణశర్మ | లక్ష్మీసహస్రం, చిత్రస్తబకమ్ | ల.స.చి |
| రామరాజభూషణకవి | వసుచరిత్ర | రా.వ, కి వ చ |
| చేమకూర వెంకటకవి | విజయవిలాసము | చే.వి. |
| పో.కాశీపత్యవధాని | పారంధరీయము | పో.కా. |
| బైరెడ్డి సుబ్రహ్మణ్యం | | బై.సు |
| దాసు శ్రీరాములు | అభినవ గద్యప్రబంధ కవి | దా.ఇ. |
| తెనాలిరామకృష్ణకవి | | తె. |
| హిన్దీ | | |
| డా. రామశంకర శుక్ల 'రసాల' | అలంకార పీయూష | రా.అ. |
| కేశవదాస | కవిప్రియా | కే క. |
| భిఖారీదాస | కావ్యనిర్ణయ | భి.కా. |
| భగవాన్‌దీన | | |
| English : | | |
| M. కృష్ణమాచార్య | History of Classical Sanskrit Literature | K.H.S. |
| A.B. కీత్. | History Sanskrit Literature | A.B K.H. |
| ఆచార్య G N రెడ్డి | చిత్రకవిత్వవ్యాసములు | జి.ఎన్.రె. |
| Landvik Steraback | Indian Riddles | I.R. |

# స్వవిషయమ్

"సాహిత్యరత్న"

## సూరపనేని వేణుగోపాలరావు
## "యశస్వి"



జననము : 1924

అభిజనము ఉంగుటూరు & మండలం కృష్ణాజిల్లా

ప్రాథమిక విద్య : ఉంగుటూరు

ఉన్నత పాఠశాలా విద్య : శ్రీ వ్యాసాశ్రమం & పి ఓ. చిత్తూరు జిల్లా

కళాశాలా విద్య : వేద సంస్కృత కళాశాల, నెల్లూరు

సాతకోత్తర విద్య : బెనారస్ హిందూ యూనివర్శిటీ, వారణాసి (కాశీ

గురువరేణ్యులు : బ్రహ్మర్షి, సద్గురు మలయాళస్వామి.
సర్వశ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి
" జమ్మలమడక మాధవరామశర్మ
" కాన్తానాథశాస్త్రి "తెలంగ్" (కాశీ) మొ॥ వారు

భార్య : శ్రీమతి కాన్తారత్నమ్.

ఉద్యోగ నిర్వహణ : సంస్కృతాంధ్ర సీనియర్ పండితుడుగా (చిత్తూరు కృష్ణాజిల్లా హైస్కూళ్ళలో, 1944-'5

సంస్కృతాంధ్రోపన్యాసకుడుగా ఎ.నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ 1953-8

ఇంటర్ అండ్ డిగ్రీపరీక్షలకు చీఫ్ ఎగ్జామినరు, మెంబర్ అండ్ ఛైర్మన్ బోర్డు అఫ్ స్టడీస్(డిగ్రీ)ఎగ్జామినేషన్స్ & మెంబరు P G బోర్డ్-(A U

గౌరవ సంస్కృతాంధ్రాధ్యాపకుడుగా :-

గౌతమ్ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ విజయవాడ 1985-86

సిద్ధార్థ, నలంద అండ్ శ్రీ చైతన్య రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ విజయవాడ. 1987....

సాంఘిక మరియు సాంస్కృతిక సేవ : కార్యదర్శి "ఆంధ్ర నటుల అండ్ కవిరాజ సాహిత్య విహారము" (రిజిష్టర్డు) గుడివాడ.

వ్యాసములు : ఉపన్యాసములు : "సాహితి" "భారతి" "ఆంధ్రజ్యోతి మొ అండ్ "ఆకాశవాణి" విజయవాడ, హైదరాబాద్.

ప్రకటిత గ్రంథములు : బాల వ్యాకరణము (వ్యాఖ్యానము) ప్రశ్నోత్తర చిత్రాలంకారము, గూఢచిత్రరహస్య ప్రకాశిక, చ్యుతదత్త చిత్రచంద్రిక.

రాబోవు ప్రచురణలు : 1. చిత్రకావ్య సర్వస్వరహస్యమ్ 2. వర్ణ, స్థాన, స్వర-ఆకార చిత్రచమత్కార చంద్రిక, 3 గతిచిత్రిగరిమ 4. ప్రహేలికా ప్రపంచ భాషాసమకచిత్రకౌతుకమ్ 6. కూటార్థ కందీపిక 7 సమస్యాచిత్ర సంగ్రహం 8 శ్లేషవక్రోక్తి సుషమ 9. సంవాద రత్నమాల 10 సంస్కృత సాహితీ సౌరభం మొ॥